# చతుర

డిశంబర్ 2001 ✤ రూ: 7/-



# గడప

హోతా పద్మినీదేవి

## సచిత్ర విచిత్రం

# మేధో కోతి



జపాన్‌లో హిరోషిమా నగరానికి చెందిన కాట్ సుమీనకజిమో పెంచుకునే ఈ కోతి మొమొకో(4)కి వాటర్ స్కయింగ్ ఆటను నేర్పించాడు. పుట్టిన తర్వాత మూడేళ్లు అడవుల్లో పెరిగిన ఈ కోతిని పట్టితెచ్చాడు కాట్ సుమీ. తనతో తరచు పడవలో షికారుకు తీసుకెడుతుండేవాడు. అప్పుడోసారి వచ్చిన ఆలోచనతో దీనికి వాటర్ స్కయింగ్ ఆటను నేర్పించాడు. భయపడకుండా ఎంతో ఉత్సాహంతో నేర్చుకుంది. ఇప్పుడీ కోతి హిరోషిమా నగర టూరిస్టులకి పెద్ద ఆకర్షణ అయింది.



# చతుర

సంపుటి : 24
సంచిక : 11
డిసెంబర్: 2001
287వ సంచిక

ఆడంబరాలకే అగ్రపీఠం వేసే ఆమె
అహాన్ని సవాల్ చేస్తున్నట్లుగా కొడుక్కి సాదాసీదా
సంబంధం ఖాయం చేశాడాయన.

అయినా, అనుక్షణం పెద్దకోడలి పుట్టింటివారి పెట్టుపోతల్ని పొగుడుతూ, కొత్త కోడలిని న్యూనత పరుస్తూ... భర్తమీద ప్రతీకారం తీర్చుకుంటూ తన అహాన్ని చల్లార్చుకుంటూ వుంటోందామె.

మొదట పిల్ల నల్లగా వుందనీ, నచ్చలేదనీ అన్నవాళ్లే డబ్బుకోసం మళ్లీ అదే సంబంధం కావాలంటూ వస్తే వాళ్ల అంతర్యాన్ని తెలుసుకోలేక ఆనందపడుతూ కూతుర్ని ఆ ఇంటి కోడలుగా పంపాడు మరోతండ్రి.

తామూ ఒకింటికోడళ్లమే అని మరిచే అత్తలు... వారి ఆరళ్లు... కోడళ్ల
కడగళ్లు... చివరికి వింత మలుపులు తిరిగిన రెండు కుటుంబాల
సంపూర్ణకథాచిత్రణ పోతా పద్మినీదేవి రచన **'గడప'**
ఈ నెల చతుర సమగ్ర నవల.



ఆ వీధికంతటికీ అందాన్నిస్తున్న ఆ మేడ తాజ్‌మహల్‌లోని ఒక భాగాన్ని పెకిలించి తెచ్చి అక్కడ పెట్టినట్టుగా వుంది.

పోర్టికోలో వున్న లాన్సర్ కారు, అది దాటి లోపలికెళ్తే ఆ ఇంట్లోని ఖరీదైన ఫర్ని చరు ఆ ఇంటి యజమాని స్థితిగతులని చాటి చెబుతున్నట్టున్నాయి.

హాలు మధ్య ఉన్న సోఫాలో కూర్చుని వున్న త్రిపురాంబలో ఐశ్వర్యం తెచ్చిన హుందాతనం కంటే అతిశయమే ఎక్కువగా ప్రస్ఫుటమవుతోంది.

ఆవిడ కట్టుకున్న జరీచీర, చెవులకి వున్న వజ్రాల దుద్దులు, మెడలోను, చేతులకి వున్న బంగారు ఆభరణాలు ఆవిడలోని ఆడంబర ప్రియత్వానికి అద్దం పడుతు న్నాయి.

ఆవిడ నిశితంగా చేతిలోని ఫొటోని పరిశీ లిస్తోంది.

ఆవిడకెదురుగా కూర్చున్న పేరిశాస్త్రి చెబు తున్నాడు.

"ఈ అమ్మాయి పేరు మధునిక. ఎమ్. ఎస్.సి. గోల్డ్‌మెడలిస్ట్. తండ్రి సెంట్రల్ గవ ర్నమెంటులో ఇంజనీరు. వంశగౌరవం, మర్యాదలలో మీకేమాత్రం తీసిపోరు. నలు గురు సంతానంలో పెద్దపిల్ల ఈమె"

త్రిపురాంబ ఆ ఫొటోని నిరాసక్తతతో చూసి టీపాయ్‌మీద పెట్టింది.

ఆవిడ ముఖంలో కదలాడుతున్న భావా లని చదివిన పేరిశాస్త్రి చేతి సంచీలోనుంచి మరో ఫొటోని తీసి ఆవిడముందు పెట్టాడు.

"ఈ అమ్మాయి పేరు అభినందన. తండ్రి ఛార్టెడ్ ఎకౌంటెంట్. వారి ఇల్లు ఇంద్రభవ నంలా వుంటుంది"

"వారికి ఎంతమంది పిల్లలో చెప్పండి శాస్త్రిగారూ!" అసహనంగా అడ్డుపడి అడి గింది.

"ఎందరోనా? ఒక్కగానొక్క కూతురు. యాభైలక్షలు విలువ చేసే ఆస్తి. కాని అమ్మాయి ఒక మోస్తరుగా వుంటుంది"

"పెళ్లికి అందం ఒక్కటే అర్హత కాదు శాస్త్రి గారూ! కయ్యానికైనా, వియ్యానికైనా సమ ఉజ్జీ ఉండాలన్నారు. మా పెద్దబ్బాయి శ్రీధ ర్‌కి మీరు సలక్షణమైన సంబంధం చెప్పారు. చేశాం. గొప్ప చెప్పుకోవడం కాదు కానీ మా వియ్యాలవారు పెళ్లయి మూడేళ్ల యినా, ఇవాళ్టివరకు మాకు మర్యాదలు జరుపుతూనే వున్నారు. ఇప్పుడు రవికి ఏమాత్రం తక్కువ సంబంధం చేసినా, వాడు చిన్న బోవడం మాట అటుంచి తోడి కోడళ్లలో ఒకరికి మరొకరిపై చిన్నచూపు, అసూయ పెరిగిపోతాయి"

"నిజమేనమ్మా మీరు చెప్పింది. కాని అమ్మాయి అబ్బాయికి నచ్చుతుందా అని నా సందేహం"

"అందానిదేముంది శాస్త్రిగారూ! ఇవాళ రేపు బోలెడు సౌందర్యసాధనాలు మార్కెట్‌లో దొరుకుతున్నాయి. కాస్త రూపురేఖలుంటే వాటిని ద్విగుణీకృతం చేసేందుకు బ్యూటీపార్లర్లున్నాయి. అయినా అమ్మాయి అందగత్తె కాదుగానీ, అనాకారి మాత్రం కాదు" శాస్త్రి తనకెదురుగా వుంచిన ఫొటోని పరిశీలిస్తూ అంది త్రిపురాంబ.

ఆవిడ ఆస్తిపాస్తులు, అంతస్తు లేని సంబంధాలను గడపలోపలకే రానివ్వదని పేరిశాస్త్రికి తెలుసు.

"అమ్మా! మరి కట్నకానుకల విషయం సెలవిచ్చారు కాదు" అన్నాడు.

"మాకు కట్నమెందుకు శాస్త్రిగారూ! మాకేం లేదా పోదా? పెళ్లి మా అంతస్తుకి తగినట్టు జరిపితే చాలు"

"అయితే వారికీ విషయాలన్నీ చెప్పి తమ దగ్గరకి వారిని తీసుకొస్తాను"

"అలాగే. నేనీలోగా అమ్మాయి జాతకం చూపిస్తాను"

"ఎవరికి త్రిపురా! పెళ్లి సంబంధం?" అప్పుడే అక్కడకి వచ్చిన మాధవరావుగారు అడిగారు.




"మన రవికి" చెప్పిందావిడ.

ఆయనని చూస్తూనే పేరిశాస్త్రి లేచి నిలబడి మర్యాదగా నమస్కరించాడు.

"కూర్చోండి శాస్త్రిగారూ"

"చిత్తం. అమ్మా... ఆ ఫొటోని అయ్యగారికి చూపించండి"

త్రిపురాంబ ఫొటోని భర్తకి అందించింది.

ఆయన ఫొటోని అందుకోకుండానే అన్నారు.

"నేను రవికి ఒక సంబంధం నిశ్చయించాను త్రిపురా"

కొన్ని క్షణాలపాటు ఆ గదిలో గాలి స్తంభించింది. నిశ్శబ్దం రాజ్యమేలింది. ఆయన చెప్పింది అర్థం చేసుకోడానికి కొన్ని క్షణాలు పట్టిందావిడకి. ఆవిడ ఎంత షాక్‌కి లోనయిందంటే అప్రయత్నంగానే లేచి నిలబడింది.

"ఏమిటీ! రవి పెళ్ళి మీరు నిశ్చయించారా? "

"అవును. అమ్మాయిది కాకినాడ. చాలా మంచి సంబంధం"

పేరిశాస్త్రి తెల్లబోయి చూస్తున్నాడు. కొడుక్కి పెళ్లి సంబంధాలు వెతకమని ఈవిడ చెబుతుంది. కొడుకు పెళ్లిని నిశ్చయించానని మాధవరావుగారు చెబుతున్నాడు. ఏది నిజం? తను ఇక్కడ వుండాలా, వెళ్ళాలా? "

ఆవిడకి ఆగ్రహావేశాలతో ఒళ్ళు తెలియడంలేదు. తనకి మాట మాత్రంగానైనా చెప్పకుండా కొడుకు పెళ్ళి నిశ్చయించుకొచ్చిన భర్తని కసితీరా తిట్టాలనిపిస్తోంది. కాని అక్కడ పేరిశాస్త్రి వున్నాడన్న విషయం గుర్తుకు వచ్చి తమాయించుకుంది. తెచ్చిపెట్టుకున్న నవ్వుతో చూస్తూ అడిగింది. "ఎవరమ్మాయి? "

"చెబుతాను. ముందు ఫొటో చూడు" ఆయన లాల్చీ జేబులోనుంచి ఫొటోని తీసి ఆవిడకి ఇచ్చాడు.

సన్నని జరీఅంచు వున్న సిల్కుచీర ధరించిన ఆ అమ్మాయి అద్భుతమైన అందగత్తె కాదుకాని ఆకర్షణీయంగా వుంది.

"అమ్మాయి తండ్రి కాకినాడలో ఒక స్టేట్ గవర్నమెంట్ ఆఫీసులో హెడ్‌క్లర్క్‌గా పని చేస్తున్నాడు. చాలా మంచి కుటుంబం" మాధవరావుగారు చెప్పారు.

త్రిపురాంబ ముఖంలో మారుతున్న రంగులని గమనిస్తున్న పేరిశాస్త్రి ఇంక తను అక్కడ వుండడం మంచిదికాదని లేచి నిలబడ్డాడు.

"అయ్యా! నేను సెలవు తీసుకుంటాను" అని అక్కడనుంచి బయటపడ్డాడు.

ఆయన వెళ్ళేదాకా ఆగిన త్రిపురాంబ భర్త వైపు క్రోధంగా చూస్తూ తీవ్ర స్వరంతో అడిగింది.

"నా కొడుకు పెళ్ళి నాకు మాటమాత్రంగానైనా చెప్పకుండా నిశ్చయించటం ఏమిటి? "

"రవి నా కొడుకు కూడా. ఆ విషయం మరచిపోకు"

"అసలు ఎవరిని అడిగి వాడి పెళ్ళి నిశ్చయించారు మీరు? "

"రవి స్రవంతిని చూడగానే ఇష్టపడ్డాడు"

"స్రవంతి ఎవరు? "

"రవికి నేను నిశ్చయించిన ఆ ఫొటోలోని అమ్మాయి"

"నాతో చెప్పనవసరంలేదనుకున్నారా? నేను చచ్చాననుకున్నారా? "

"నువ్వు నాతో సంప్రదించకుండా శ్రీధర్ పెళ్ళి నిశ్చయించినప్పుడు నేనేమైనా గొడవ చేశానా? "

"అంటే! ఈ రకంగా ప్రతీకారం తీర్చుకున్నారన్నమాట"

"ప్రతీకారం ఏమిటి త్రిపురా? అంత పెద్ద మాటలెందుకు. నీకు నచ్చిన సంబంధాన్ని పెద్దబ్బాయికి నువ్వు నిశ్చయించావు. నాకు నచ్చిన సంబంధం చిన్నబ్బాయికి నేను నిశ్చయించాను. మన పిల్లలు సుఖపడాలనేగా మన ఇద్దరి ఆశా!"

"చేశారులే మహా గొప్ప సంబంధం! మన

కాళ్ళ దగ్గర నిలబడడానికి కూడా అర్హత లేనివాళ్ళతో మనం వియ్యమందాలా? అసలు మీకెలా తోచింది ఆ సంబంధం నిశ్చయించాలని? " కోపంతో మండిపడుతూ అరిచింది.

"నీకు కోడలు తెచ్చే కట్నంపై ఆశలేదు కదా త్రిపురా? కట్నం ఇచ్చుకోలేని వాళ్ళ పిల్లని చేసుకుంటే తప్పేమిటి? "

"చేసిన పనిని సమర్థించుకుంటున్నారా? "

"నేను చేసినది మంచిపని కాబట్టే సమర్థించుకుంటున్నాను"

"ఏమిటండీ మీరు చేసిన మంచిపని? ఓ గుమాస్తాగాడి కూతుర్ని ఈ ఇంటికోడలిని చెయ్యాలనుకోవడమా? "

"రవి ఇష్టపడ్డాడు."

"నాకు ఇష్టం లేదు" కరుగ్గా అంది. "రవి ఇష్టపడ్డాడా? లేదు, మీరేవో మాయ మాటలు చెప్పి ఉంటారు. లేకపోతే నా చేత్తో పెట్టనిదే అన్నమయినా తినని రవి నాతో చెప్పకుండా పెళ్లికి ఒప్పుకోడు"

"కావాలంటే ఇప్పుడే రవిని పిలుస్తాను. నువ్వే అడుగు" మాధవరావుగారు లోపలికి చూస్తూ పిలిచారు.

"రవీ"

ఆయన రెండుసార్లు పిలిచాక గదిలో డ్రెస్సవుతున్న రవిచంద్ర బయటకి వచ్చాడు.

"ఏమిటి నాన్నగారూ? "

"నేను నీకు నిశ్చయించిన కాకినాడ సంబంధం నువ్వు మనస్ఫూర్తిగా అంగీకరించావా? లేక నా బలవంతంవలన ఒప్పుకున్నావా? "

"నేను మనస్ఫూర్తిగా ఇష్టపడే అంగీకరించాను గదా!"

కొడుకు చెప్పిన మాటలు పిడుగుపాటుగా ధ్వనించాయి త్రిపురాంబకి.

ఆవిడ హతాశురాలయింది.

★ ★ ★

"పోస్ట్!"

వీధి వరండాలోంచి పోస్ట్‌మాన్ పిలుపు విన్న రఘురామయ్య ఆత్రుతగా వీధి వరండాలోకి వచ్చాడు. పోస్ట్‌మాన్ ఒక కవరు అందించి వెళ్లిపోయాడు. ఉత్తరం చదువుతున్న ఆయన ముఖంలో రంగులు మారిపోతున్నాయి.

"ఎక్కడినుంచండీ ఉత్తరం? పెళ్లివారేమయినా రాశారా? " భర్త ముఖం చూసేటప్పటికి జానకమ్మకి విషయం అర్థమైనా ఆశ నోరు తెరిపించింది.

"అవును" పొడిగా అన్నాడాయన.

"ఏం రాశారు? "

"గతంలో మన అమ్మాయిని చూసి వెళ్లిన వాళ్లు ఏం రాశారో వీళ్లూ అదే రాశారు. వాళ్లబ్బాయికి మరో సంబంధం కుదుర్చుకున్నారట"

కూతురికి ఈ సంబంధమైనా నిశ్చయమవుతుందని ఆశ పెట్టుకున్న జానకమ్మ మనసు నిరాశా నిస్పృహలతో నిండిపోయింది. పైకి ఎంతో మామూలుగా ఉంది.

"పోనీలెండి. మరో సంబంధం చూద్దాం"

"ఇప్పటికి పదిహేనో సంబంధం. ఒక్కళ్లంటే ఒక్కళ్లయినా నచ్చిందన్నారా? "

"హుష్..! ఊరుకోండి శ్వేత వినగలదు" ఆవిడ మందలింపుగా అంది.

రఘురామయ్య తమాయించుకున్నాడు. పెద్ద కూతురు శ్యామల పెళ్లి విషయంలో అంతగా శ్రమపడని ఆయనకి శ్వేత పెళ్లి విషయంలో 'చెప్పులరిగిపోయేలా తిరగడం' అనే మాటకి అర్థం తెలిసింది. కూతురి పెళ్లి చెయ్యాలని శక్తి వంచన లేకుండా ప్రయత్నిస్తున్నాడు. కానీ ఏ ఒక్కటీ కలిసి రావడం లేదు. మళ్లీ సంబంధాల వేట మొదలుపెట్టాలనుకుంటేనే ఆయనకి దిగులుగా ఉంది. ఫొటోలంటారు. జాతకాలంటారు. అమ్మాయి ఫొటో నచ్చి, జాతకాలు, నప్పి పెళ్లి చూపులుదాకా వచ్చాకే అసలు టెన్షన్ మొదలవుతోంది. తీరైన ముఖకవళికలతో ఆకర్షణీయంగా ఉండే శ్వేత నల్లని శరీరచ్ఛాయ ఏ పెళ్లివారినీ ఆకర్షించడం





లేదు. చామనఛాయ అని కన్నప్రేమ సరి పెట్టుకున్నా శ్వేత నల్లటిదనే నిజాన్ని ఒప్పు కోక తప్పదు.

రెండురోజులు కుదురుతుందని ఆశలు పెంచుకున్న సంబంధం కుదరలేదనే నిరాశా నిస్పృహలతో కుంగిపోయాక మూడవరోజు వైరాగ్యం మొదలయింది రఘురామయ్య దంపతులకి.

ప్రసూతి వైరాగ్యం, శ్మశాన వైరాగ్యంలాగే పెళ్లి సంబంధాల వైరాగ్యం కూడా ఒకటి వుంటుంది. తమకి అనుకూలంగా వున్న సంబంధం అన్నీ నిశ్చయమై చివరకి ఏదో కారణంగా తప్పిపోయినప్పుడు కలిగే వైరాగ్యం అది.

'ఎవరికెక్కడ ఘటనో, కళ్యాణయోగం రాలేదు' వగైరా స్టేట్‌మెంట్లు ఆ వైరాగ్యంలో నుంచి పుట్టినవే! ప్రస్తుతం రఘురామయ్య దంపతులు అలాంటి వైరాగ్యంలోనే వున్నారు.

తన పెళ్ళి విషయంలో తల్లీతండ్రీ ఎంత అశాంతిగా వున్నారో శ్వేతకి తెలుసు. అసలా మెకి ఈ పెళ్ళి చూపుల తతంగమే అస హ్యంగా తోస్తోంది. గంగిరెద్దులా అలంకరించుకుని వచ్చి పెళ్లివారి ముందు కూర్చోడం...

వాళ్ళు అడిగే అడ్డమైన ప్రశ్నలకి సమాధానం ఇచ్చి వాళ్ళనుంచి వచ్చే చల్లని కబురుకోసం ఆత్రంగా ఎదురుచూడడం...

వాళ్లు నావుకబురు చల్లగా చెప్పినట్టు తను నచ్చలేదని చెప్పడం...!

నిజానికి ఎవరికైనా నచ్చనిది తను కాదు. తన ఒంటిరంగు అని ఆమెకి తెలుసు. తన శరీరపు నలుపురంగుని చామనఛాయగా మార్చడానికి తల్లి చెయ్యని ప్రయత్నమంటూ లేదు. పత్రికలలో రాసే చిట్కాలన్నింటిని ఉపయోగించింది. కాని ఫలితం లేదు. గ్రాడ్యుయేషన్ చేసిన తను పి.జి. చెయ్యాలనుకుంది. కాని తండ్రి ఒప్పుకోలేదు. తను ఎమ్.ఏ. చదివితే తనకంటే ఎక్కువ చదివిన వాడిని తనకి భర్తగా తేలేసని ఆయన భయం. తండ్రి మనసుని అర్థం చేసుకున్న ఆమె ఇంకా చదువుకోవాలనే తన కోరికని మనసులోనే సమాధి చేసేసింది.

★ ★ ★

రఘురామయ్య వీధివాకిట్లోని మొక్కలకి నీళ్లు పోస్తున్నాడు.

ఆయన యాంత్రికంగా ఆ పనిచేస్తున్నా మనసులో మాత్రం ఆలోచనలు జోరీగల్లా ముసురుకుంటున్నాయి.

ఆయన ఆలోచనలకి కేంద్ర బిందువు శ్వేత పెళ్లి. ఇరవై నాలుగేళ్ళ కూతురి పెళ్ళి ఆయనకో పెద్ద సమస్య అయింది. గత అయిదేళ్లుగా ఆమె పెళ్లి చెయ్యాలని ఆయన చేసిన ప్రయత్నాలన్నీ నిష్ఫలమయ్యాయి.

గేటు తెరిచిన చప్పుడవడంతో ఆయన ఆలోచనలలోనుంచి తేరుకుని అటువైపు చూశాడు. పెళ్ళిళ్ళ పేరయ్య! ఆయనని చూడగానే రఘురామయ్యలో నూతనోత్తేజం ప్రవేశించింది. 'మళ్ళీ శ్వేతకోసం ఏదో సంబంధం తెచ్చివుంటాడు. తప్పేదేముంది? ప్రయత్నిద్దాం' అనుకున్నాడు. కుళాయి కట్టేసి వస్తూ, "నమస్కారం! రండి" అన్నాడు.

ఇద్దరూ వరండాలో వున్న పేము కుర్చీల్లో కూర్చున్నారు.

"అమ్మాయికేమైనా సంబంధం కుదిరిందాండీ?"

"లేదండీ" రవ్వంత నిరాశ నిండిన స్వరంతో అన్నాడు.

"కుదిరిపోయిందని చెబుతారేమో! నేను మీ ఇంటికి వచ్చిన సంకల్పం వృధా అవుతుందనుకున్నానండీ"

"కుదిరితే మీకు చెప్పకుండా వుంటానా?"

"అయ్యా! నేను వచ్చిన విషయం. గతంలో మీ అమ్మాయిని చూసి తిరస్కరించిన బెజవాడ సంబంధం వాళ్ళు ఇప్పుడు మళ్ళీ మీ అమ్మాయిని చేసుకుంటామంటు

న్నారు"

"ఏం? వాళ్ళబ్బాయికి ఎక్కడా సంబంధం దొరకలేదా? ఆరునెలల క్రిందట మా అమ్మాయిని చూసి నచ్చలేదన్నవాళ్ళు మళ్ళీ మా సంబంధానికి వాళ్ళంతటవాళ్ళే ఎందుకు కబురంపినట్టో?"

"వాళ్ళు కూడా ఈ ఆరునెలల్లోనూ చాలా సంబంధాలు చూశారుట. కాని ఒక్కటీ కలిసిరాలేదు"

"ఇంతకీ మీరు చెప్పేదేమిటండీ"

"మీ అమ్మాయికీ ఇంతవరకు ఏ సంబంధమూ కుదరలేదు. పైగా వాళ్ళంతటవాళ్ళుగా మీ అమ్మాయిని చేసుకుంటామని కబురు పంపారు. ఆలోచించుకోండి. కావాలనుకోవడం కష్టం కాని వద్దనుకోవడం ఎంతసేపు" పేరయ్య వెళ్ళిపోయాడు.

రఘురామయ్య అలాగే కూర్చుండిపోయాడు. ఒకసారి తిరస్కరించిన వాళ్ళు మళ్ళీ కబురు పంపారంటే ఆయనకి ఆశ్చర్యంగా వుంది. ఆడపిల్లని అడిగి చేసుకునే కులం కూడా కాదు తమది.

భార్య పిలుపుతో ఉలిక్కిపడి చూశాడు.

"పేరయ్యగారు వచ్చినట్టున్నారు"

"అవును" అంటూ ఆయన విషయం చెప్పాడు.

విన్న జానకమ్మ ఆశ్చర్యంగా, ఈసడింపుగా అంది.

"ఏమిటీ! ఆరునెలల క్రిందట మన అమ్మాయి నచ్చలేదని చెప్పి మళ్ళీ ఇప్పుడు మనతో సంబంధం కలుపుకుంటామని కబురు పంపారా? బాగుంది. చాలా బాగుంది"

"వాళ్ళబ్బాయికి ఏ సంబంధం కుదరలేదుట. 'మీ అమ్మాయికీ కుదరలేదుకదా ఆలోచించండి' అంటాడు ఈయన"

"ఒకసారి తిరస్కరించాక మళ్ళీ కావాలనుకోడానికి వాళ్ళకి సిగ్గు లేకపోతే వాళ్ళతో వియ్యమందడానికి మనం మాత్రం సిద్ధంగా ఉన్నామా?"

తృణీకారాన్ని, నిరసనని స్వరంలో ప్రతిఫలింపచేస్తూ అందామె!

"మరే" అన్నాడాయన.

ఆ రాత్రి రఘురామయ్యకి నిద్రపట్టలేదు. ఆయనకి పేరయ్య మాటలే గుర్తొస్తున్నాయి.

"మీ అమ్మాయికీ పెళ్ళి కుదరలేదుకదా! ఆలోచించండి"

రైల్వే ఉద్యోగిగా ఆ ఏడాదే రిటైరయిన తనకి కూతురికి కట్నకానుకలిచ్చి పెళ్ళి చెయ్యడం పెద్ద సమస్యేమీ కాదు. కానీ ఎన్ని సంబంధాలు చూసినా ఒక్కళ్ళు కూడా శ్వేత నచ్చిందని ముందుకి రాలేదు. అసలు దానికి పెళ్ళవుతుందా? ఆలోచిస్తున్న ఆయనకి గుండెలో కలుక్కుమన్న బాధ.

అటునుంచి ఇటు వత్తిగిల్లటంలో భార్య మంచంమీద కూర్చుని వుండడాన్ని చూశాడు.

"జానకీ! నిద్రపోలేదా?"

"నిద్రపట్టడంలేదండీ" తుళ్ళిపడిందావిడ.

"నాకూ నిద్రపట్టడం లేదు"

ఆయన లేచివచ్చి ఆవిడ పక్కనే కూర్చున్నాడు.

"జానకీ నేను శ్వేత పెళ్ళి చేయగలనంటావా?" ఆయన స్వరం చిన్నగా కంపిస్తోంది.

"ఛ! అవేం మాటలండీ!" ఆవిడ కళ్ళలో నీళ్ళూరాయి. "నా భయం, బాధ నీకు అర్థం కావు జానకీ. గత నాలుగేళ్ళుగా దాని పెళ్ళి గురించి నేను చెయ్యని ప్రయత్నమంటూ లేదు. ఒక్కటీ కలిసిరాలేదు"

"నిజమే! కాని ఏం చేస్తాం? చూస్తూ చూస్తూ ఏ దారినపోయేవాడి చేతిలోనో పెట్టలేంకదా"

"అది కాదు. పోనీ పేరయ్యగారు చెప్పి

నట్టు ఆ విజయవాడ సంబంధం..."

"వద్దండీ? " ఆయన చెప్పేది పూర్తి కాకుండానే అంది. "వాళ్ళు గతంలో శ్వేతని తిరస్కరించారు. ఆ తిరస్కారంతో దాని మనసెంత గాయపడిందో నాకు తెలుసు. ఇప్పుడు వాళ్ళంతట వాళ్ళుగా దాన్ని చేసుకుంటామని.

ముందుకొచ్చినా, ఆ తిరస్కారాన్ని అవమానం తాలూకు బాధని అది మరచిపోతుందనుకోను. ఆరోజు వాళ్ళు శ్వేతని సరిగ్గా చూడనుకూడాలేదు. ఆ అబ్బాయి ఇంటికప్పుకేసి చూస్తూ కూర్చున్నాడు. పెళ్ళి చూపులలో దాని పేరడిగి అది శ్వేత అని చెప్పగానే అతని పెదవులమీద కదిలిన వ్యంగ్యపూరితమైన చిరునవ్వు బహుశా అది ఈ జన్మంతా గుర్తుంచుకుంటుందేమో!"

రఘురామయ్య నిశ్శబ్దంగా వుండిపోయాడు. భార్య మాటలలో ఏ ఒక్కటీ అసత్యం కాదని ఆయనకీ తెలుసు. పెళ్ళివారు వెళ్ళిపోయాక రెండురోజులపాటు కూతురి కళ్ళల్లో తిరిగిన నీళ్ళు తిరిగినట్టే వున్నాయి. ఆ అవమానం తాలూకు బాధని ఆమె చాలా రోజులు మరచిపోలేదు. ఇప్పుడు ఆమె ఆ సంబంధానికి ఒప్పుకోదని తనకీ తెలుసు.

"శ్వేతకి ఏ సంబంధమూ కుదరలేదని మీరు ఆ సంబంధాన్ని ఒప్పుకోవాలనుకుంటున్నారా? "

"అవును"

"వద్దండీ. మీరు వత్తిడి చేశారనో, లేక బాధపడుతున్నారనో అది పెళ్ళికి ఒప్పుకున్నా తరువాత మనస్ఫూర్తిగా అతనితో కాపురం చేస్తుందనుకోను. తిరస్కారం తాలూకు బాధ అవమానం అలాంటిది"

"పోన్లే! మరో సంబంధం చూద్దాం" అన్నాడు.

"పేరయ్యగారు ఆ సంబంధం ప్రస్తావించిన విషయం శ్వేతకి తెలియనివ్వకండి"

"అలాగే" అన్నాడాయన.



శ్రీధర్ ఇంటికి వచ్చేసరికి మాధవరావుగారు, త్రిపురాంబ ఎదురెదురుగా సోఫాలలో కూర్చునివున్నారు. తల్లి ముఖంలోని ఉక్రోషాన్ని, దుఃఖాన్ని తండ్రి ముఖంలోని గంభీరతను చూసి వాళ్ళిద్దరిమధ్యా ఏం జరిగివుంటుందో ఊహించగలిగాడతను. రవి పెళ్ళి నిశ్చయమైనప్పటినుంచి ఆ ఇంటి వాతావరణం గంభీరంగా మారిపోయింది. తండ్రి రవి పెళ్ళి విషయంలో స్వతంత్రించి తీసుకున్న నిర్ణయం అంతవరకూ సాఫీగా నడచిపోతున్న ఆ సంసారంలో కల్లోలాన్ని రేపింది. కంటి చూపుతో పెదవి బిగింపుతో, ఎదుటివాళ్ళని శాసించగలిగే తల్లి అహంకారానికి ఇది గొడ్డలిపెట్టు లాంటిది.

శ్రీధర్ ఒకసారి తల్లినీ తండ్రినీ మార్చి మార్చి చూసి తండ్రి పక్కనే సోఫాలో కూర్చున్నాడు.

బ్రీఫ్‌కేసులోనుంచి చెక్‌బుక్ తీసి తండ్రికి అందిస్తూ అన్నాడు.

"కొన్ని చెక్కులమీద మీరు సంతకాలు చెయ్యాలి నాన్నగారూ!"

మాధవరావుగారు చెయ్యిజాపి చెక్‌బుక్

అందుకోబోయారు. త్రిపురాంబ చటుక్కున చెయ్యి అడ్డంపెట్టింది.

"ఇంక ఇవాళ్టినుంచి ఈ బాధ్యతలన్నీ నువ్వే తీసుకో శ్రీధర్" అంది.

ఆయన ముఖంలో క్షణకాలం రంగులు మారాయి. మరుక్షణం తేరుకుని చిరునవ్వు నవ్వేడు.

"అవును అదే మంచిది" అన్నారు. ఆ స్వరం ఏమీ జరగనట్టు మామూలుగా వుంది.

తల్లి బాధ్యత పేరుతో పెత్తనాన్ని తనకి ఇవ్వడం శ్రీధర్‌కి సంతోషంగానే వున్నా తండ్రిపట్ల తల్లి వైఖరి ఆశ్చర్యాన్ని కలుగచేసింది.

"ఆవిడని సంప్రదించకుండా తండ్రి రవి పెళ్ళి నిశ్చయించినందుకా ఆవిడ కోపం? " అతను గంభీరమైన ఆ వాతావరణంలో ఎక్కువసేపు కూర్చోలేకపోయాడు. చెక్‌బుక్‌ని తిరిగి బ్రీఫ్ కేసులో పెట్టి గదిలోకి వెళ్ళాడు.

గదిలో మంచంమీద కూర్చుని మల్లెపూలు మాల కడుతున్న కల్పన అతన్ని చూసి పూలగిన్నెని వదిలి లేస్తూ అడిగింది.

"ఇవాళ ఇంత ఆలస్యమైందేం? బాగా అలసిపోయినట్టున్నారు. వేడిగా కాఫీ ఇవ్వనా? "

"వద్దు... ఏకంగా భోజనం చేసేస్తాను" అంటూ అతను ఆమె పక్కనే కూర్చున్నాడు. కొద్దిసేపు మామూలు సంభాషణ అయ్యాక ఆమె అడిగింది.

"మిమ్మల్ని ఒక విషయం అడగవచ్చా? "

"అడుగు"

"రవి పెళ్ళి మామగారు నిర్ణయించడం అత్తయ్యగారికి ఇష్టంలేదు కదూ? "

"ఎలా ఇష్టం వుంటుంది? ఆయన మాట మాత్రంగానైనా అమ్మతో చెప్పకుండా చేశారు కదా? "

"మామగారు అలా ఎందుకు చేశారు? "

"ఏమో! విచిత్రమేమిటంటే రవికి ఆయన నిర్ణయించిన అమ్మాయి ఎలా వుంటుందో మనకెవరికీ తెలియదు. అంత రహస్యంగా ఆయన రవి పెళ్ళి చూపులకి వెళ్ళి ఏకంగా పెళ్ళి నిశ్చయించుకుని వచ్చి తర్వాత అమ్మతో చెప్పారు. కారణం ఎవరికీ తెలియదు" అన్నాడు శ్రీధర్.

అతనికి మరునాడే రవికి నిశ్చయింపబడిన వధువు తాలూకు వివరాలు తెలిశాయి. తల్లి ద్వారా కాదు, అతని అక్క వరలక్ష్మిద్వారా.

★ ★ ★

"ఏమిటిరోయ్ దారితప్పి వచ్చావ్!" వరలక్ష్మి ముఖం శ్రీధర్‌ని చూడగానే అప్రసన్నమయింది.

"దారి తప్పితే మీ ఇంటికెలా వస్తానే అక్కయ్యా!" నవ్వాడు శ్రీధర్.

"అక్క బతికి వుందని మీకెవర్కైనా గుర్తుందిట్రా? "

"ఛ! అదేమిటే అలా అంటావ్? " అతను నొచ్చుకున్నాడు.

"రవికి పెళ్ళి సంబంధం నిశ్చయించినప్పుడు మీకెవరికీ గుర్తురాలేదట్రా నేను? పోనీ, నా సంగతి అలా వుంచు. ఏ సలహా కావలసినా బావగారి దగ్గరకి పరిగెత్తుకుని వస్తారే నాన్నగారు. పెళ్ళి సంబంధం విషయంలో ఆయన గుర్తు రాలేదా? లేక ఆయన ప్రమేయం అనవసరం అనుకున్నారా? "

"నాకేమీ తెలియదే! నాన్న అన్నీ నిర్ణయించుకుని వచ్చాకే నాకు, అమ్మకి చెప్పారు"

"నీకు కూడా తెలియదా? నమ్మమంటావా? "

"నువ్వు నమ్మినా, నమ్మకపోయినా ఇది నిజం"

"ఎవరికీ చెప్పకుండా ఎవరితోనూ సంప్రదించకుండా అంత రహస్యంగా తండ్రీకొడుకులిద్దరే పెళ్ళి చూపులకి వెళ్ళి వచ్చి ఏకంగా సంబంధం ఖాయపరచుకున్నాక చెప్పడంలో ఆయన ఆంతర్యమేమిటి? పోనీ ఏదో పెద్ద

సంబంధమా అంటే అదీ కాదు. తండ్రి గుమాస్తాట. వాళ్ళకి వుండడానికి ఇల్లు తప్ప ఏమీ లేదుట!"

"నిజమా?" నివ్వెరపోయాడు శ్రీధర్.

"అవునోయ్" అప్పుడే అక్కడకి వచ్చిన శివశంకరం అన్నాడు.

"నన్ను సంప్రదించకుండా రవి పెళ్లి నిశ్చయించారనే బాధ నాకేం లేదుగాని, మీ నాన్నగారు ఇలాంటి తెలివితక్కువపని చేశారేమిటి? చెల్లని సరుకుని వదిలించుకున్నట్టు ఎందుకంత తొందర? మీరు కోరుకుంటే కోటీశ్వరుల సంబంధాలు మీ కాళ్ళ దగ్గరకి వచ్చేవి గదా!"

శ్రీధర్‌కి తండ్రి రవిపెళ్ళి విషయంలో ఎందుకంత తొందరపడ్డాడో అర్థంకాలేదు. అతను అన్యమనస్కంగానే ఇంటికి వచ్చాడు.

కల్పన అతని ముఖంలోని ఉద్విగ్నతని గమనిస్తూ అడిగింది.

"ఏమిటలా వున్నారు?"

"నేనిప్పుడు మా అక్కావాళ్ళింటినుంచి వస్తున్నాను"

"తనతో సంప్రదించకుండా రవి పెళ్ళి నిశ్చయించినందుకు మీ బావగారి చేత మీకు అక్షింతలు పడ్డాయా?"

"రవికి బొత్తిగా గతి మాలిన సంబంధం చేస్తున్నారు మా నాన్నగారు. అదీ మా బావగారి బాధ"

"ఏమిటి మీరనేది?"

శ్రీధర్ రవికి తండ్రి నిశ్చయించిన సంబంధం వివరాలు చెప్పాడు.

"ఏమిటీ!" కల్పన ముఖంలో నివ్వెరపాటు ఆనందంగా మారింది. ఆమెకి ముందు నుంచీ ఒక భయం వుండేది. తన భర్త కంటే అందగాడయిన రవికి తనకంటే స్థితి పరుల సంబంధం వస్తుందని, ఈ ఇంట్లో తన విలువ తగ్గిపోతుందని. ఇతరుల గొప్పదనాన్ని అంగీకరించనివ్వని అహం, తన కంటే ఉన్నత స్థితిలో వున్నవాళ్ళని చూస్తే అసూయ ఆమెవి. ఆమె సంతృప్తిగా నవ్వుకుంది. తనకి తోటికోడలు కాబోతున్న అమ్మాయి అంతస్థులో తనకంటే ఎన్నో మెట్లు దిగువున వుంది" ఆమెకి ఏదో తెలియని ఆనందం కలిగింది.

★ ★ ★

పదిరోజుల తర్వాత...

ఆ ఉదయం శ్వేత పెరట్లో బట్టలు ఆరేస్తోండగా కాలింగ్‌బెల్ మోగిన శబ్దమయింది.

వంటింట్లో వున్న జానకమ్మ, పూజచేసుకుంటున్న రఘురామయ్యలకంటే ముందు ఆ శబ్దాన్ని విన్నది శ్వేతే. ఆమె చేస్తున్న పనిని వదిలివచ్చి తలుపు తీసింది.

గుమ్మానికి ఎదురుగా వున్న ఆ వ్యక్తిని చూసి ఆమె నిశ్చేష్ట అయింది. ఆహ్వానించడం మరచిపోయి అలాగే నిలబడిపోయింది.

శ్వేత ఆవిడని తేలిగ్గానే గుర్తుపట్టగలిగింది కాని, ఆవిడ తమ ఇంటికి ఎందుకొచ్చిందనేది ఆమె ఊహకందని విషయం.

"మీ నాన్నగారున్నారామ్మా?"

ఆవిడ అడగడంతో తెప్పరిల్లిన ఆమె "వున్నారు. పూజ చేసుకుంటున్నారు. కూర్చోండి" అంది తడబాటుగా.

ఆవిడ లోపలకి వచ్చి కూర్చుంది.

శ్వేత పరుగులాంటి నడకతో లోపలికి వచ్చి తల్లితో చెప్పింది.

"అమ్మా! ఆవిడవచ్చారు" ఆమె స్వరంలో ఉద్వేగం.

"ఆవిడా? ఎవరావిడ?" జానకమ్మకి అర్థంకాలేదు.

"విజయవాడ సంబంధం... పెళ్ళి కొడుకు తల్లి"

జానకమ్మ చేతిలోని గరిట జారిపడింది. ఆవిడ సంభ్రమాశ్చర్యాలతో తలమునకలవుతూ బయటకి వచ్చింది.

"నీ మొహం! ఎవరిని చూసి ఎవరనుకున్నావో" అంది తమాయించుకుంటూ.

"నేను పొరపాటు పడలేదమ్మా! ఆవిడే. నేను బాగానే గుర్తుపట్టగలను" అంది శ్వేత.

ఆవిడ అయోమయంగా పూజగదిలోకి నడిచింది. అప్పటికి రఘురామయ్య పూజ ముగించి బయటకి రాబోతున్నాడు.

ఆవిడ మెల్లని స్వరంతో ఉద్వేగంగా చెప్పింది. "ఏమండీ! విజయవాడ సంబంధం ఆవిడ వచ్చింది"

"ఏమిటీ! విజయవాడ సంబంధమా? "

"పేరయ్యగారిచేత మనకి కబురంపిన వాళ్లు"

ఆయన సంభ్రమంతో తలమునకల వుతూ, గదిలోకి వెళ్ళి పట్టుపంచె మార్చి బట్టలు ధరించాడు.

జానకమ్మ ఆయన వెనుకనే వస్తూ గుస గుసగా అడిగింది.

"ఎందుకొచ్చిందంటారు ఆవిడ? "

"ఇంకేముంది? శ్వేతని వాళ్ళబ్బాయికి చేసుకుంటానని అడగడానికే"

"ఆవిడ అడిగితే మీరేం సమాధానం చెబుతారు? "

"మీకూ, మీ సంబంధానికీ ఒక నమస్కారం. వెళ్ళి రండి అంటాను"

జానకమ్మ తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది.

రఘురామయ్య వీధిగదిలోకి వచ్చాడు. అక్కడ కుర్చీలో కూర్చుని వున్న రాజేశ్వరమ్మ లేచి నిలబడి నమస్కరించింది.

"నమస్కారమండీ! కులాసాగా వున్నారా? "

ఆయన ప్రతినమస్కారం చేసి గంభీరంగా ఆవిడని చూస్తూ అడిగాడు. "మీరేమిటిలా వచ్చారు" ఆయన స్వరంలో ఎంత దాచుకుందామన్నా దాగని అయిష్టత.

ఆవిడ గొంతు సర్దుకుని అంది. "పేరయ్యగారు మీతో చెప్పినట్టున్నారు"

"చెప్పారు. కాని ఆరు నెలల కిందట మా అమ్మాయిని తిరస్కరించిన మీరు మీ అంతటమీరుగా ఇప్పుడు దాన్ని కోడలిగా చేసుకుందామనుకున్నా మీతో వియ్యమందడానికి మేము సిద్ధంగా లేము"

"మీకు కోపం రావడం సహజం. కాని, పెళ్ళి విషయంలో మగపిల్లవాడికి పది సంబంధాలు చూస్తాం. ఆడపిల్లనిచ్చే వాళ్ళు పాతిక సంబంధాలు చూస్తారు. అలాగే మా అబ్బాయికి మీ సంబంధంతోబాటు మరో సంబంధం చూశాం. ఆ అమ్మాయి మీ అమ్మాయికంటే తెల్లగా వున్నమాట వాస్తవం. మా అబ్బాయికీ ఆమె నచ్చింది. వాడికి నచ్చినపిల్లని చెయ్యడం మా ధర్మం కనుక మీ అమ్మాయిని తిరస్కరించాం. కాని ఆ రెండో సంబంధం అమ్మాయి జాతకంతో మా వాడి జాతకం నప్పక పెళ్ళి కుదరలేదు"

"అప్పుడు నచ్చని మా అమ్మాయి మీ అబ్బాయికి ఇప్పుడెలా నచ్చింది? "

"నచ్చకపోడానికి మీ అమ్మాయి కురూపే మీకాదు. రంగు తక్కువన్నమాటేగాని ఆ ముఖంలోని కళ... ఆమెలోని అణకువ... మేం ఎన్నో సంబంధాలు చూశాం. ఒక్కరంటే ఒక్కరికి కూడాలేదు. 'రంగుదేముందిరా పిచ్చినాన్నా! తెల్లగా పిండిబొమ్మలా వుంటే మాత్రం అందంగా వుంటారేమిట్రా' అన్నాను. మావాడు నా మాటలతో ఏకీభవించాడు. నిజానికి ఇన్ని నెలల తరువాత మా అంతటమేముగా మీ పిల్లని చేసుకుంటామని అడగడం మీలో ఎన్ని భయ సందేహాలను రేకెత్తిస్తుందో నాకూ తెలుసు. కాని, మీరు ఎలాంటి సందేహాలను పెట్టుకోనవసరంలేదు. నాకు ఆడపిల్లలు లేరు. వున్నది ఇద్దరూ అబ్బాయిలే. మీ అమ్మాయిని కోడలిలా కాదు. కూతురిలా చూసుకోగలను"

రఘురామయ్య మనసు ఆయనకి తెలియకుండానే మెత్తబడిపోతోంది. ఆవిడ మాటలలోని మహత్యం ఏమిటోగాని ఆయన మనసులో ఆవిడపట్ల వున్న వైమనస్య భావం మటుమాయమయిపోయింది.

ఆవిడన్నది నిజమే. మగపిల్లవాడుగల వాళ్ళే కాదు, ఆడపిల్లగలవాళ్ళు కూడా

బోలెడు సంబంధాలు చూస్తారు. వీలయి నంత మంచి సంబంధం చెయ్యాలని తమ పిల్లలు సుఖపడాలని తల్లిదండ్రులు వాంఛి స్తారు. అందమైన, అనుకూలమైన భార్య లభించాలని అబ్బాయిలు, అందమైన మంచి ఉద్యోగం వున్న అబ్బాయి భర్తగా రావాలని ఆడపిల్లలు కోరుకుంటారు. ఘటన మాట అటుంచి సాధ్యమైనంతవరకు తమకి అన్ని విధాలుగా అనుకూలమైన సంబంధాన్ని నిశ్చయించడానికే ఇరుపక్షాలవాళ్లు తాపత్ర యపడతారు.

"మీరైనా మేమైనా పెళ్ళి సంబంధం వద్దు అనుకోవడం సులువు అన్నయ్యగారూ! కావా లనుకోడమే కష్టం. అప్పట్లో మీ సంబంధం వద్దని సులువుగానే చెప్పేశాం. ఇప్పుడు మళ్ళీ మీ సంబంధాన్ని కావాలనుకోడం మీకే కాదు మాకూ కష్టమే. మీరిప్పుడు మమ్మల్ని కాదన్నా తలవంచుకుని వెళ్ళిపో డానికి సిద్ధంగానే వున్నాను"

రెండు నిముషాలు ఆ గదిలో నిశ్శబ్దం రాజ్యమేలింది. రఘురామయ్య ఆవిడవైపు చూస్తూ అన్నాడు.

"మా అమ్మాయితో, నా భార్యతో ఆలో చించి మీకు ఏ విషయం సాధ్యమైనంత తొందరలో తెలియచేస్తాను"

ఆవిడ లేచి నిలబడింది. "మంచిది అన్న య్యగారూ! మీకు ఈ విషయంలో ఎలాంటి సందేహాలున్నా సంకోచించకుండా బయట పెట్టండి. వస్తాను" ఆవిడ చేతులు జోడించి నమస్కరించి వెళ్ళిపోయింది.

రఘురామయ్య అలాగే కూర్చుండిపో యాడు. ఆ ఇద్దరిమధ్య, జరిగిన సంభాష ణను జానకమ్మతోబాటు శ్వేత కూడా స్పష్టంగా వింది. ఒక గదిలో మాట్లాడితే మరొక గదిలోకి విన్పించకపోవడానికి ఆ ఇల్లేమీ రాజమహల్ కాదు.

ఆవిడ వెళ్ళిపోయిందని నిర్ధారించుకున్నాక బయటకి వచ్చింది జానకమ్మ.

ఆయన భార్యని చూస్తూనే అన్నాడు. "రాజేశ్వరమ్మగారు ఎందుకొచ్చారంటే..."

ఆయన చెప్పేది పూర్తికాకుండానే ఆవిడ అంది.

"ఆవిడ మీతో మాట్లాడినదంతా విన్నాను" క్షణం ఆగి అంది. "ఆవిడతో ఎందుకలా చెప్పారు? "

"ఇంకెలా చెప్పమంటావు? "

"అంటే! ఈ సంబంధం మీకు ఇష్టమేనన్న మాట"

ఆయన ఏదో ఆలోచిస్తూ భార్య మాటలకి జవాబివ్వలేదు.

"ఒకసారి వద్దని తిరస్కరించాక, మళ్ళీ ఆవిడ మనని వెదుక్కుంటూ వచ్చిందంటే ఖచ్చితంగా ఈ సంబంధంలో ఏదో లొసుగు వుంది"

"అలా ఎందుకనుకోవాలి? పెళ్ళి అంటే ఇరుపక్షాల అంగీకారంతో కూడిన వ్యవ హారం. అప్పట్లో మనమే వాళ్ళ సంబం ధాన్ని వద్దనుకుని ఇప్పుడు కావాలను కుంటే? "

"ఏమో! నాకెందుకో ఈ సంబంధం అంగీ కరించడానికి మనస్కరించడంలేదు"

"ఈ సంబంధాన్ని ఒప్పుకుని తీరాలని నేననడంలేదు జానకీ! ఆలోచించవలసిన విషయం అంటున్నాను. అబ్బాయి ఉద్యోగం చేస్తున్నది ప్రైవేటు కంపెనీలో. అయినా ఉద్యోగం మంచిది. పెద్దగా బాదరబందీలు లేని సంసారం. పెళ్ళిళ్ళ విషయంలో ఎక్కడో ఒకచోట రాజీపడక తప్పదు. మొదట్లో శ్వేతకి ఇంజనీర్‌నో, లేక బ్యాంక్ ఆఫీసరునో తప్ప మరో సంబంధం చూసే వాడిని కాను. తరువాత కొన్నాళ్ళకి బ్యాంకులో క్లర్కు అయినా ఫర్వాలేదనుకు న్నాను. ఇప్పుడు ప్రైవేటు కంపెనీ అయినా ఫర్వాలేదనుకునే స్థితికి వచ్చాను. మరో సంబంధం సమీపంలో లేదు. వున్నా వాళ్ళ కైనా శ్వేత నచ్చుతుందో లేదో"

జానకమ్మ మౌనం వహించింది. భర్త చెప్పినదంతా నిజమే. కాని, ఒకసారి తిరస్క



రించిన వాళ్ళు మళ్ళీ తమంతట తామే ముందుకి ఎందుకొస్తున్నారు? అనేది ఆవిడకి జవాబు దొరకని ప్రశ్నగా మిగిలిపోయింది.

★ ★ ★

శ్వేత రాజేశ్వరమ్మకి, తండ్రికి మధ్య నడిచిన సంభాషణ పూర్తిగా వింది. తల్లిదండ్రులు మాట్లాడుకున్నది కూడా వింది. "మీకు, మీ సంబంధానికి ఒక నమస్కారం" అని చెప్పేస్తానన్న తండ్రి రాజేశ్వరమ్మ మాటలతో మెత్తబడడం గమనించిన ఆమె మనసులో ముల్లు గుచ్చుకున్నట్టయింది. తనకింక పెళ్ళి కాదనే భయంతోనే తండ్రి ఆ సంబంధం విషయంలో మెత్తబడ్డాడనేది నిర్వివాదాంశం. అయినా తనని తిరస్కరించిన ఆరు నెలల తరువాత ఆవిడ తమ ఇంటికి స్వయంగా వచ్చి తనని కోడలిగా చేసుకుంటానని సుముఖతని ఎందుకు వ్యక్తంచేసినట్టు? "

పెళ్ళి చూపులరోజున తనవైపు ఒకసారి చూసి తరువాత ఇంటి పైకప్పువైపు చూస్తూ కూర్చున్న అతను గుర్తుకొచ్చాడామెకు.

తనపేరు 'శ్వేత' అని చెప్పగానే ఆరోజు అతని పెదవులపై కదలాడిన వ్యంగ్యపూరితమైన చిరునవ్వుని తను ఎప్పటికీ మరచిపోలేదు. ఆమె మనసు అతన్ని భర్తగా ఊహించుకోడానికే ఎదురు తిరుగుతోంది. జీవిత భాగస్వామిని ఎన్నుకునేందుకు ఏర్పాటుచేసిన పెళ్ళి చూపులలో కనీసం తనని కుతూహలంతోనైనా చూడని అతనికి పెళ్ళిపట్ల నిర్లిప్తతకంటే తనపై మొదటి చూపులోనే అయిష్టత కలిగిందనేది పచ్చి నిజం! తనపై ఉదాశీనభావంతో వున్న అతన్ని తన జీవితంలోకి ఎలా ఆహ్వానించగలదు?

★ ★ ★

త్రిపురాంబ, వరలక్ష్మి ధుమధుమలాడుతున్న ముఖాలతో కారు ఎక్కారు. డ్రైవరు పక్కన కూర్చున్న మాధవరావుగారు మౌన గంభీరంగా వున్నారు. తల్లికి, అక్కగారికి మధ్యలో కూర్చున్న రవికి ఆ పరిస్థితి ఇబ్బందిగా వుంది. ఆరోజు ఉదయమే వాళ్ళు హైదరాబాదు నుంచి కాకినాడ వచ్చారు. కాబోయే కోడలిని చూడ్డానికి త్రిపురాంబ ఏమాత్రం ఇష్టపడలేదు.

"అన్నీ మీరూ, మీ కొడుకూ నిర్ణయించుకున్నాక ఇంక నేనెందుకు చూడడం?" అంది.

"ఇప్పుడు అమ్మో, నేనో ఆ పిల్ల నచ్చలేదంటే ఆ సంబంధాన్ని విరమించుకుంటారా నాన్నా" అడిగింది వరలక్ష్మి తల్లికి సపోర్టుగా.

"తాంబూలాలు మార్చుకోవడం మినహా రవి పెళ్ళి నిశ్చయమయినట్టే. సంబంధం విరమించుకునే సమస్యేలేదు" అన్నారు మాధవరావుగారు స్థిరంగా.

"మరి మేమెందుకు చూడడం?"

"రవికి కన్నతల్లిగా అది నీ బాధ్యత"

"నేను వాడి తల్లినని మీకు గుర్తుంటే ఇలా చేసేవారేకాదు" త్రిపురాంబ కళ్ళలో నీళ్ళూరాయి.

"మళ్ళీ స్తోత్రం మొదలుపెట్టకు. వచ్చి నీక్కాబోయే కోడలినిచూసి నీ పెద్దరికాన్ని నిలబెట్టుకో"

త్రిపురాంబ పెద్ద పోట్లాట పెట్టుకుంది. స్నాతకం పీటలమీద కూర్చోనంది. అసలు పెళ్ళికే రానంది.

"నువ్వలా అంటావని నాకు తెలుసు. అందుకే రిజిస్టర్ మ్యారేజికి అన్ని ఏర్పాట్లూ చేసే ఉంచాను"

త్రిపురాంబ అసహాయంగా పళ్ళు కొరుక్కుంది. రిజిష్టర్ మారేజి చేస్తే సొసైటీలో తన పరువేమవుతుంది?

ఆవిడ గత్యంతరంలేకే కాకినాడ రావడానికి అంగీకరించింది.

కాకినాడలోవున్న పెద్ద హోటల్‌లో బసచేసారు. పెద్ద జరీబార్డర్ వున్న పట్టు చీరలు ధరించి, నగలన్నీ దిగేసుకుని ముస్తాబయిన





భార్యని, కూతురిని చూసి మనసులోనే నవ్వుకున్నారు మాధవరావుగారు.

వాళ్ళలో రవికి నిశ్చయించిన అమ్మాయిని చూడాలనే కుతూహలంకంటే తమ ఐశ్వర్యాన్ని చాటిచెప్పాలనే తాపత్రయమే ఎక్కువగా వుంది.

టాక్సీ ఇంటిముందు ఆగగానే అతిసామాన్యంగావున్న ఆ డాబా ఇంటిని చులకనభావంతో చూసింది త్రిపురాంబ. ఆవిడ వెనుకే కారు దిగిన వరలక్ష్మి ముఖంలోనూ అదే భావం. సాదాబట్టలు ధరించివున్న స్రవంతి తండ్రి చలపతిరావువైపు, మెడలో నల్లపూసలు, మంగళసూత్రం గొలుసు తప్ప వేరే నగలేమీలేని ఆమె తల్లి అన్నపూర్ణమ్మవైపు తిరస్కారంగాచూసి తలలు తిప్పుకున్నారిద్దరూ.

ఘుమఘుమలాడుతున్న రవ్వకేసరిని వేలితో కూడా తాకకుండా వదిలేసిన కాబోయే వియ్యపురాలివైపు చూస్తూ మర్యాదగా అంది అన్నపూర్ణమ్మ,

"మీరేమీ తినలేదు వదినగారూ! పోనీ, ఈ పళ్ళైనా తినండి"

"ఒంట్లో బాగాలేదు" మర్యాదకైనా నవ్వకుండా చెప్పింది.

"కిందటిసారి మా ఇంటికి వచ్చినప్పుడు అన్నయ్యగారు చెప్పారు మీకు ఒంట్లోబాగాలేదని. ఇంకా తగ్గలేదాండీ? "

'అంటే మొదటిసారి తను పెళ్ళిచూపులకి రానికారణం తనకి ఒంట్లో బాగాలేకపోవడం అని చెప్పాడన్నమాట మహానుభావుడు' కోరగా భర్తని చూస్తూ అనుకుంది. "ఇప్పుడు ఫర్వాలేదు" అనేసింది.

తనకి కాబోయే అత్తా, ఆడబడుచుల ముఖాలలో గిరిగీసినట్టు కన్పిస్తున్న అహాన్ని స్రవంతి కనిపెట్టకపోలేదు. ముఖ్యంగా వచ్చిన దగ్గరనుంచి వాళ్ళిద్దరూ డేగకళ్ళతో తమ ఇంటిని, ఇంట్లోని వస్తువులని పరిశీలిస్తున్న తీరు చూస్తే ఆమెలోని అణువణువు ఆత్మన్యూనతతో అత్తిపత్తి ఆకులా ముడుచుకుపోసాగింది. ఆ చూపులలో గొంగళి పురుగుని చూసినప్పటి కంపరం! కుష్టురోగిని చూసినప్పటి జుగుప్స! ఆమె కళ్ళెత్తి రవివైపు చూసింది. అతను చిరునవ్వుతో తననే చూస్తుండడంతో కంగారుగా కనురెప్పలు వాల్చేసింది.

పదిరోజుల కిందట మాధవరావుగారు, రవి వచ్చి తనని చూసి తను నచ్చిందని, కట్నంవద్దని, పెళ్ళి సింపుల్‌గా చెయ్యమని చెప్పినప్పుడు కలిగిన ఆనందం హఠాత్తుగా ఆమెలో ఎవరో ఊదేసినట్టు మాయమయిపోయింది. స్రవంతి మధ్యతరగతి అమ్మాయి. ఆమెకి పెళ్ళిపట్ల ఆశలు, కలలు లేవు. కానీ ఆమె కోరుకోకుండానే కోటీశ్వరుల సంబంధం ఆమెని వెతుక్కుంటూ వచ్చింది. కానీ ఇప్పుడు ఈ ఆడవాళ్ళ వైఖరి చూస్తే ఈ సంబంధం కుదురుతుందా? భార్యా, కూతుర్ల విముఖతకి తలవంచి మాధవరావుగారు తమ సంబంధాన్ని విరమించుకుంటాడా అనే సందేహం అన్నపూర్ణమ్మ, చలపతిరావులకేకాదు స్రవంతికీ కలిగింది. ముళ్ళమీద కూర్చున్నట్టున్నాయి ఆడవాళ్ళిద్దరి ముఖాలూ.

"వెళ్ళొస్తాం బావగారూ! ముహూర్తాలు నిర్ణయించి త్వరలో తెలియచేస్తాం" అన్నారు మాధవరావుగారు.

ఆయన మాటలతో అణగారిపోతున్న ఆశకి మళ్ళీ జీవం వచ్చినట్టయి తెప్పరిల్లాయి చలపతిరావు దంపతుల ముఖాలు.

స్రవంతికి త్రిపురాంబ, వరలక్ష్మిల చూపులు గుర్తు వస్తే ఒళ్ళంతా గొంగళిపురుగులు పాకినట్టవుతోంది. వాళ్ళిద్దరికీ అసలు తనని ఆ ఇంటికోడలిగా చేసుకోవడం ఇష్టం లేదేమో అనే అనుమానం ఆమెలో అంతై ఇంతై అన్నట్టు పెరిగిపోసాగింది.

పెళ్ళికి ఎంత ఖర్చుపెట్టాలి? ఎవరెవర్ని పిలవాలి అని లెక్కలువేసుకుంటున్నారు తల్లీ తండ్రీ. ఆమె వాళ్ళదగ్గరికి వచ్చి చెప్పింది,

"నాకు ఈ సంబంధం వద్దమ్మా"



ఉలిక్కిపడి తలలు ఎత్తారిద్దరూ. "అదేమి టమ్మా?" ఇంకా ఏదో అనబోయాడు చలప తిరావు.

"మనం ఏ రకంగా చూసినా వాళ్ళతో సరి తూగం. ముఖ్యంగా అతని తల్లి, అక్కల వైఖరి చూస్తే. నన్ను చేసుకోడం ఇష్టంలేనట్టే వుంది. నిజం నాన్నా! ఆవిడ చూపుల్లో అయిష్టతే కనిపించింది"

"నువ్వు ఆ ఇంట్లోని వ్యక్తులందరికీ నచ్చా లని రూలేమీ లేదు. నీతో జీవితాన్ని పంచు కోబోయే అతనికి నువ్వు నచ్చడం ముఖ్యం. మిగిలినవాళ్ళ సంగతి నీకనవసరం" అన్నాడు చలపతిరావు.

స్రవంతి మనసుని మాధవరావుగారి మంచితనం ఆకట్టుకుంది. తనని చూడగానే రవి కళ్ళలో మెరిసిన మెరుపు 'నువ్వంటే నాకిష్టం' అని చెప్పింది. అయినా అతని తల్లీ, అక్కల ధోరణి భయపెడుతోంది. ఆమె మనసు ద్వైదీభావాలతో సతమతమవసా గింది. రెండురోజుల తరువాత ఆమె తండ్రి నిర్ణయానికి తన ఆమోదాన్ని తెలిపింది.



శ్వేత లైబ్రరీనుంచి ఇంటికి వచ్చేటప్పటికి ఇంటికి తాళం పెట్టివుంది. తల్లీతండ్రీ ఆ సమయంలో ఎక్కడకి వెళ్ళివుంటారా అని ఆలోచిస్తూ ఆమె పక్క ఇంటికి వెళ్ళి అడి గింది.

"మీ నాన్నగారికి ఛాతీలో నొప్పి వచ్చి వున్నట్టుండి కళ్ళు తిరిగి పడిపోతే మీ అమ్మ గారు హాస్పిటల్‌కి తీసుకెళ్ళారు. వాళ్ళకి తోడుగా అంకుల్ కూడా వెళ్లారు. ఇప్పుడే హాస్పిటల్‌నుంచి ఫోన్ చేసి చెప్పారు తగ్గింది కులాసాగా వున్నారని. ఏమీ గాభరాపడకు"

"ఏ హాస్పిటల్ ఆంటీ" గుండె దడదడలాడుతూండగా, కళ్ళలో నీళ్ళు కమ్ముకొస్తుండగా అడిగింది.

ఆవిడ చెప్పింది "పద, నేనూ వస్తాను" అందావిడ తలుపు తాళం పెడుతూ.

నాలుగురోజుల తర్వాత రఘురామయ్య హాస్పిటల్‌నుంచి డిశ్చార్జి అయి ఇంటికి వచ్చాడు. ఆయనకి మైల్డ్‌గా చెస్ట్‌పెయిన్ వచ్చింది. డాక్టర్లు ఇన్వెస్టిగేషన్స్ చేసి భయమేంలేదని, బాగా విశ్రాంతి అవసరమని చెప్పి ఇంటికి పంపారు.

ఆయన వీధి వరండాలో కూర్చుని అస్తమిస్తున్న సూర్యుడినే చూస్తున్నాడు. "తను అస్తమించబోతున్న సూర్యుడు. పొద్దువాలిపోయేలోగానే తన బాధ్యతను తీర్చుకోవాలి. సాధ్యమైనంత తొందరలో శ్వేత పెళ్ళి చేసెయ్యాలి. తనకి ఛాతీనొప్పి బదులు హార్ట్‌ఎటాక్ వచ్చివుంటే! తను మరణిస్తే కూతురి జీవితం ఏమవుతుంది? ఆమె పెళ్ళి చెయ్యకుండానే తను చనిపోతే తన ఆత్మ ఈ ఇంటిచుట్టూ తిరుగుతూ క్షోభిల్లుతూనే వుంటుందేమో! రఘురామయ్యకి భవిష్యత్తు భయంకరంగా కన్పిస్తోంది. స్తబ్దంగా, యాంత్రికంగా నడుస్తున్న వర్తమానం ఆయనని కృంగదీస్తోంది.

"నాన్నగారూ" కూతురి పిలుపుతో ఉలిక్కిపడి తల తిప్పాడు.

శ్వేత చేతిలో పుస్తకాలతో నిలబడివుంది.

"నేను ఒకసారి లైబ్రరీకి వెళ్ళొస్తానండీ!"

"అలాగే వెళ్ళి రామ్మా"





"తొందరగా వచ్చేస్తాను"

"అలాగేనమ్మా"

"మీరు ఎక్కువగా ఆలోచించకుండా ప్రశాంతంగా వుండండి"

"అలాగే!" అన్నాడాయన నవ్వి.

శ్వేత జాలిగా తండ్రివైపు చూసి గేటు తీసుకుని బయటకి వచ్చింది. ఆయన్ని అనారోగ్యంకంటే తన పెళ్ళి గురించిన దిగులే ఎక్కువగా కృంగదీస్తోందని ఆమెకి తెలుసు. పెళ్ళే జీవితానికి ముఖ్య పరమావధికాదు. కానీ తండ్రి దృష్టిలో తన పెళ్ళి పెద్ద బాధ్యత. పెళ్ళిచేసుకుని ఆయనకి బరువు తగ్గించాలనే వుంది. కానీ తనా విషయంలో నిస్సహాయురాలు.

"బొగ్గుసుందరి వస్తోందిరోయ్" వీధిమొగలో స్కూటర్‌పై కూర్చున్న జులపాల కుర్రాడు వెకిలిగా నవ్వేడు.

"బొగ్గుసుందరికాదురా! సింగరేణి సుందరి" రెండవవాడు శృతి కలిపాడు.

శ్వేతకీ అవమానాలు కొత్తకాదు. కానీ తండ్రి తన పెళ్ళి విషయంలో బాధపడుతున్నాడనే వేదనతో వున్న ఆమె మనసుని ఆ అవహేళన కొరడా దెబ్బలా తాకింది. ఆమె నడకవేగం హెచ్చించింది.

ఆమె ఇంటికి వచ్చేటప్పటికి పక్క ఇంట్లోంచి గొల్లున ఏడుపులు విన్పిస్తున్నాయి. అక్కడంతా జనం గుమిగూడి వున్నారు. గేటు తీసుకుని వరండా మెట్లెక్కి లోపలికి వచ్చేటప్పటికి తల్లి తండ్రి దగ్గరే కూర్చుని వుండడం గమనించింది. తల్లి ముఖంలో ఆందోళన. తండ్రి ముఖంలో వైరాగ్య భావన.

"ఏమయిందమ్మా! అలా వున్నావేం?" అనడిగింది శ్వేత.

దానికి సమాధానం తండ్రినుంచి వచ్చింది, "మన పక్కింటి సుబ్బారావుగారు పోయారుటమ్మా"

"ఏమిటీ?" శ్వేత చిత్తరువులా నిలబడిపోయింది. "పొద్దున్న కూడా పెరట్లో మొక్కలకి నీళ్ళు పోస్తూ కనిపించారే!"

"గుండెనొప్పి అన్నారుట. డాక్టరు దగ్గరికి తీసుకెళ్ళేలోగానే..."

శ్వేత చప్పున తండ్రిచేతిని తన చేతిలోకి తీసుకుంటూ అంది, "సుబ్బారావుగారికి వచ్చినది హార్ట్‌ఎటాక్ అయివుంటుంది నాన్నా. గుండెనొప్పి వచ్చినంత మాత్రాన ప్రాణానికేం ప్రమాదం లేదని మొన్న మిమ్మల్ని చెకప్ చేసిన డాక్టర్లు చెప్పారుకదా?"

ఆయనకి కూతురి మాటలలోని ఓదార్పుకి నవ్వొచ్చింది. 'తన ప్రాణానికేమీ ప్రమాదం లేదని చెబుతోంది'

"మీకోసం చిలకమర్తివారి 'గణపతి' నవల తెచ్చాను నాన్నగారూ. మీరు చదువుతూండండి. నేనీలోగా మీకు పండ్లరసం తెస్తాను" అంటూ పుస్తకాన్ని తండ్రికి అందించింది.

"జానకీ! నన్ను సుబ్బారావుగారింటికి తీసుకెళ్లు" అన్నారు. ఆయన అలా అనగానే శ్వేత, జానకమ్మలు క్షణం నిరుత్తరులయ్యారు.

శ్వేత చప్పున అంది. "వద్దు నాన్నగారూ! మీరసలే నీరసంగా వున్నారు. అమ్మ వెళ్ళివస్తుందిలెండి"

"జానకీ! వెళ్ళొద్దాం పద" ఆయన లేచి నిలబడ్డారు. ఆయన స్వరంలోని స్థిరనిర్ణయం జానకమ్మని ముందడుగు వేసేలా చేసింది.

ఆ రాత్రి ఎంత ప్రయత్నించినా ఆవిడకి నిద్రపట్టలేదు. సుబ్బారావుగారి శవం, తల దగ్గర వెలుగుతున్న దీపం, శవం మీదపడి గుండెలు బద్దలయ్యేలా రోదిస్తున్న ఆయన భార్యాపిల్లలు కళ్ళకి కట్టినట్లుగా కన్పిస్తుంటే ఆవిడ మనసు విచలితమవుతోంది. పక్కనే పడుకునివున్న భర్త కూడా నిద్రపోవడంలేదని ఆవిడకి తెలియదు.

రఘురామయ్య కూడా నిద్రపోవడంలేదు. చనిపోయిన సుబ్బారావు గురించే ఆలోచిస్తున్నాడు. సుబ్బారావు బాధ్యతలనుంచి విము

క్షుద్రైన వ్యక్తి. ఆయన మరణం ఆయన కుటుంబానికి తీరనిలోటే అయినా, ఆయన మాత్రం అదృష్టవంతుడే. కానీ, తను! శ్వేత పెళ్ళి బాధ్యత తనపై వుంది. 'కూతురి జీవితానికో దారి చూపకుండానే తను మరణిస్తే!' ఆ ఊహే ఆయన్ని భయపెడుతోంది. ఆయన అస్థిమితంగా అటునుంచి ఇటు వత్తిగిల్లారు. మంచంమీద కూర్చుని వున్న భార్యని అప్పుడు చూశారాయన.

"నిద్రపట్టడంలేదా జానకీ!" లేచి కూర్చుంటూ అడిగారు.

"ఇప్పుడే మెలకువ వచ్చిందండీ" అందావిడ.

"సుబ్బారావుగారి మరణం నిన్ను భయపెట్టిందికదూ? "

"అదేంకాదు. నేనిప్పుడే లేచాను" చప్పున అబద్ధం చెప్పిందావిడ.

"సుబ్బారావు అదృష్టవంతుడు. పిల్లలందరూ సెటిలయ్యారు. ఆయన చనిపోవడం బాధాకరమేకానీ దురదృష్టకరంకాదు. కానీ నేను శ్వేత పెళ్ళి చెయ్యలేకపోయాను. నేనేమైనా అయితే...? "

"ఛ! ఏం మాటలండీ అవి!" ఆవిడ ఆందోళనగా వారించింది.

"మీకేమీ అవదు. మీకు వచ్చినది ఒట్టి ఛాతీనొప్పి మాత్రమే. ఆహారనియమాలు పాటిస్తూ వేళకి మందులు వేసుకుంటున్నారు. మీకేమీ అవదు" ఆవిడ ఆ మాటలన్నతీరు భర్తకి ధైర్యం చెబుతున్నట్టుకాక తనకి తానే ధైర్యం చెప్పుకుంటున్నట్టుంది.

"మరణం మనిషి చేతులలోలేదు జానకీ! సైన్సు అభివృద్ధి చెంది మనిషి జననాన్ని తన చేతులలోకి తీసుకోగలిగాడేకానీ, మరణాన్ని ఆపగలిగాడా చెప్పు. నాకు వచ్చిన ఛాతీనొప్పి హార్ట్ఎటాక్‌కి సూచనేమో!" అంటుంటే, ఆవిడ కన్నీళ్ళతో ఆయన నోటికి చేతిని అడ్డంపెట్టి ఆయన చేతిని తన తలపై ఉంచుకుంటూ ఉద్వేగంగా అంది.

"మరోసారి ఇలా మాట్లాడితే నేను చచ్చినంత ఒట్టే!"

ఆయన పెదవులపై విరిగిన పాలలాంటి చిరునవ్వు కదలాడింది. పిచ్చిజానకి! తను మరణిస్తానన్న ఊహే తట్టుకోలేకపోతోంది. నిజంగా తను చనిపోతే ఏమవుతుంది?

ఆవిడ భర్తని బలవంతాన పడుకోబెట్టి ఆయన గుండెలపై చెయ్యివేసి ఆయన హృదయస్పందనని వింటూ మిగిలిన రాత్రంతా మెళుకువగానేవుంది.

★ ★ ★

పొద్దుట ఏడుగంటలు దాటినా తల్లీతండ్రీ లేవకపోవడంతో శ్వేత కంగారుపడింది. రెండుమూడుసార్లు వాళ్ళు పడుకుని ఉన్న గది ముందుకు వచ్చింది. తలుపులు తీసే పడుకునివున్నా ఆ గదిలోకి వెళ్ళి తల్లిని లేపడానికి ఆమెకెందుకో మొహమాటంగా అన్పించింది. వాళ్ళిద్దరూ రాత్రంతా నిద్రపోయి ఉండరని ఆమెకి నిశ్చయంగా తెలుసు. సుబ్బారావుగారిని చూసివచ్చాక తల్లి ముఖంలోని అలజడిని, తండ్రి ముఖంలోని మృత్యుభీతిని ఆమె గమనించగలిగింది. మృత్యుభీతి కూడా కాదది. బాధ్యతలు తీరకుండానే మరణిస్తానేమో అనే భయం.

శ్వేత మరో పదినిమిషాలు అస్థిమితంగా, కర్తవ్యవిమూఢంగా ఇల్లంతా పచార్లు చేశాక అప్పుడు లేచివచ్చింది జానకమ్మ.

"రాత్రి నిద్దరపట్టలేదమ్మా! అందుకే మెళుకువ రాలేదు" అంది సంజాయిషీ ఇస్తున్నట్టుగా.

"నాన్నగారు...? " అర్థోక్తిలో ఆగింది.

"మీ నాన్నగారు నిద్రపోలేదు"

"నాన్నగారు సుబ్బారావుగారిని చూడకుండా వుండవలసింది" అంది శ్వేత.

జానకమ్మ కళ్ళలో నీళ్ళూరాయి. "నీ పెళ్ళి చెయ్యకుండా తనేమయిపోతానో అని ఇదివరకే భయపడ్డారు. ఇప్పుడా భయం రెట్టింపయింది" అని బాత్‌రూమ్‌వైపు నడిచింది.

శ్వేత గుండెని తాకిందామాట. "తండ్రి





మనోవ్యథ ఎలా తీరుతుంది?" ఆమె కళ్ళలో నీళ్ళు.

"శ్వేతా! స్టవ్‌మీద పాలుపెట్టమ్మా" జానకమ్మ బ్రష్‌మీద పేస్టు వేసుకుంటూ చెప్పింది.

శ్వేత పాలు పొంగించి కాఫీ కలిపేటప్పటికి రఘురామయ్య కూడా లేచి ముఖం కడుక్కున్నాడు. ఆమె కాఫీగ్లాసు తండ్రికి అందించింది.

పక్క ఇంట్లోంచి ఏడుపులు హృదయవిదారకంగా విన్పిస్తున్నాయి. రఘురామయ్య చెయ్యి వణికి కాఫీ బట్టలనిండా పడింది.

శ్వేత చప్పున ఆయన చేతిని గట్టిగా పట్టుకుంది. "నీరసంగా వుందా నాన్నా?" ఆదుర్దాగా అడిగింది.

"లేదు. ఎందుకో చెయ్యి పట్టు తప్పినట్టయిందమ్మా" ఆయన ముఖంలో లీలగా వేదన. స్వరంలో అంతర్లీనంగా భీతి.

సుబ్బారావుగారి అంతిమయాత్రాదృశ్యం భర్తకంట పడకుండా వీధితలుపులు చేరవేస్తున్న తల్లితో చెప్పింది "ఈ పూట వంట నేను చేస్తాను. నువ్వు నాన్నగారి దగ్గర కూర్చో" అని.

ఆవిడ భర్త దగ్గర కూర్చుంటూ అడిగింది, "పెద్దమ్మాయిని, అల్లుడిని రమ్మని ఫోన్ చేయనా? మీకూ కాస్త కాలక్షేపమవుతుంది"

"వద్దులే! పిల్లల చదువులు పోతాయి. ఏకంగా శలవులకి రమ్మందాం!"

రెండు క్షణాల నిశ్శబ్దం తరువాత అంది. "పోనీ శ్వేతకి ఆ విజయవాడ సంబంధం మాట్లాడుదామా?"

"శ్వేత ఒప్పుకుంటుందా?"

"మీ కిష్టమేనా?"

ఆయన జవాబివ్వలేదు.

"సంబంధం మంచిది కాబట్టే మనం అప్పట్లో శ్వేతని ఆ అబ్బాయికి ఆఫర్ చేశాం. ఘటన లేక అది మనకి కుదరలేదు. ఇప్పుడు వాళ్ళంతట వాళ్ళే వచ్చారు కనుక మనం ముందుకి వెళ్తే?"

"శ్వేత ఒప్పుకోవాలికదా!" అన్నాడు రఘురామయ్య.

"నేను దానితో మాట్లాడతాను"

అదే సమయానికి వంట చేస్తున్న శ్వేత మనసులో కూడా తన పెళ్ళి గురించి ఆలోచనే వచ్చింది.

విజయవాడ సంబంధానికి ఒప్పుకుని తండ్రికి బరువు తగ్గిస్తేనో, ఆమె ఆలోచిస్తోంది. పెళ్ళిపట్ల తనకి ఆశలు, కలలు వున్నా అవి తీరవని తెలిశాక రాజీపడక తప్పదు. ఏ కారణంచేతనైతేనేమి వాళ్ళు తనని మొదట్లో తిరస్కరించారు. ఇప్పుడు తమంతట తాముగా ఆహ్వానిస్తున్నారు. తండ్రి మరో సంబంధం చూసినా తను వాళ్ళకి నచ్చుతుందని గ్యారంటీ లేదు. ఈ పరిస్థితులలో ఆ సంబంధానికి అంగీకరిస్తేనో!' ఆమె ఎటూ తేల్చుకోలేకపోతోంది.

★ ★ ★

రెండురోజులపాటు తీవ్రంగా ఆలోచించాక శ్వేత తన మనసులోని ఆలోచనని తల్లితో చెప్పింది. అంతవరకూ కూతురితో ఆ విషయాన్ని ఎలా మాట్లాడాలా అని సతమతమవుతున్న జానకమ్మకి కూతురే స్వయంగా చేసిన ఆ ప్రతిపాదనతో కొండంత ధైర్యం వచ్చింది.

"నువ్వు మనస్ఫూర్తిగా ఇష్టపడే అంగీకరిస్తున్నావామ్మా?" అడిగిందావిడ.

"అదేమిటమ్మా, అలా అడుగుతున్నావ్?" నవ్వింది.

"ఎందుకంటే గతంలో వాళ్ళు నిన్ను తిరస్కరించారు కనుక. ఆ అవమానాన్ని నువ్వు ఇప్పటికీ మరచిపోలేదుగదా!"

"నన్ను వీళ్ళొక్కళ్ళే కాదు చాలామంది తిరస్కరించారు"

"నిజమే. కాని..."

"అమ్మా! నువ్వే సందేహాలూ పెట్టుకోవద్దు. నేను మనస్ఫూర్తిగా అతన్ని చేసుకోడానికి ఇష్టపడుతున్నాను"

"అయితే మీ నాన్నగారికి చెప్పనా?"



"చెప్పు" అంది శ్వేత.

జానకమ్మ ముఖంలో సంతృప్తి. ఆవిడ అప్పటికప్పుడు వెళ్ళి భర్త చెవిన ఈ వార్త వేసింది.

రఘురామయ్య ముఖంలో కొత్త కాంతి. ఆయన సంతృప్తిగా నిశ్వసించాడు.

మరో వారం తరువాత తాంబూలాలు మార్చుకోవడం, పదిహేనురోజుల తరువాత మోహన్‌తో శ్వేత పెళ్ళీ జరిగిపోయాయి.

★ ★ ★

మాధవరావుగారి ఇల్లు మామిడాకుల తోరణాలతో కళకళలాడుతోంది. ప్రధాన ద్వారానికి వున్న గడప లోపల జల్లిన ధాన్యాన్ని, వీధి వరండాలో కూర్చుని తమ వాయిద్యాలను శృతి చేసుకుంటున్న సన్నాయి వాళ్ళని, ఆ ఇంట్లో పట్టుచీరల రెపరెపలతో హడావుడిగా తిరుగుతున్న ముత్తయిదువులని చూస్తే ఆ ఇంటి కొత్త కోడలికి స్వాగతం ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నారని అర్థమవుతోంది.

"త్రిపురా! వరలక్ష్మి ఎక్కడుంది? దాన్ని త్వరగా స్నానంచేసి తెమలమను. ఈ ఇంటి ఆడబడుచు అది. కొత్త కోడలి వడిగంటి బియ్యం మూట అదే విప్పాలి" చెప్పింది త్రిపురాంబ తోటికోడలు.

"ఆ పిలుస్తాను" అంటూ త్రిపురాంబ గది లోకి వచ్చింది. వరలక్ష్మి అద్దంముందు ముస్తాబవుతోంది. ఖరీదైన పట్టుచీర, ఒంటి నిండా నగలు ధరించి వున్న కూతురిని చూడగానే ఆవిడలో కలిగిన సంతృప్తి మరి కొద్దిసేపటిలో ఆ ఇంట్లో అడుగు పెట్టబోయే కొత్త కోడలిని తలచుకోగానే అసంతృప్తిగా మారింది.

రవిచంద్రకి ఆస్తిలో, అంతస్థులో తమతో ఏ మాత్రం సరితూగని సంబంధం చేసిన భర్తని కసితీరా తిట్టుకుంది. వరలక్ష్మి అద్దంలో తననితాను పరిశీలనగా చూసుకుని తల్లివైపు తిరిగింది.

"ఎలా వున్నానమ్మా? "

"సాక్షాత్తూ లక్ష్మీదేవిలా వున్నావు" అంది కూతురి చెంపలు పుణుకుతూ.

"నీ ముద్దుల కొడుకు వలచిన రంభ కొత్త కోడలిగా ఈ ఇంట్లో గృహప్రవేశం చేసే ముహూర్తం దగ్గరపడిందనుకుంటాను. కొత్త కోడలి వడిగంటి బియ్యం మూట విప్పడానికి నేను సిద్ధంగా లేను. అర్థమయిందా? "

త్రిపురాంబ మనసులో అంతవరకు కొత్త కోడలిపై వున్న వ్యతిరేకభావం కసిగా మారిపోయింది. "దీని ముఖానికి అపురూపమైన స్వాగత సత్కారాలొకటి!" నిరసనగా అనుకుంది.

"అసలు ఆవిడగారు గృహప్రవేశం చేసే టైమ్‌కి నువ్వు ఇంట్లో వుండకు. ఏదో పని కల్పించుకుని బయటకి వెళ్ళిపో!"

"మంచి సలహా చెప్పావు" అంది హేండ్ బ్యాగ్ తీసుకుని బయటికి వస్తూ.

"అదేమిటే, ఇప్పుడెక్కడకి బయలుదేరావ్? ఇంకో పావుగంటలో మీ తమ్ముడు, మరదలు వస్తారు. కాస్సేపు ఇంట్లో వుండు" వరలక్ష్మి మేనత్త అంది.

"ఇప్పుడే వస్తాను" అని ఆమెవైపు చూడకుండానే పోర్టికోలో ఆగివున్న కారు దగ్గరికి వెళ్ళింది.

డ్రైవర్ ఆమెని చూడగానే వినయంగా కారుడోర్ తెరిచిపట్టుకున్నాడు. ఆమె కారు ఎక్కింది. కారు స్టార్టయి గేటు దాటింది. మరో రెండు నిమిషాల తర్వాత గేటులో నుంచి మారుతీ ఎస్టీమ్ కారు వచ్చి పోర్టికోలో ఆగింది.

వధూవరులు వచ్చారని తెలియగానే ఆ ఇంట్లో సందడి మొదలయింది. సన్నాయి వాళ్ళు త్యాగరాజు కీర్తనని వాయిస్తున్నారు.

"త్రిపురాంబ! వరలక్ష్మిని ఇంట్లో వుండమని నువ్వు చెప్పలేదా? కొత్త కోడలి వడిగంటి బియ్యంమూట విప్పడానికి ఈ ఇంట్లో ఆడబడుచు వరసైనవాళ్ళు ఒకళ్ళూ




లేకపోయారు" అంటున్న తోటికోడలికి సమాధానం ఇవ్వకుండా త్రిపురాంబ 'తాయారమ్మగారూ!' అని పిలిచింది.

ఎవరికో కాఫీ అందిస్తున్న ఆవిడ యజమానురాలి పిలుపుతో అక్కడకి వచ్చింది.

"కొత్తకోడలి వడిగంటి బియ్యంమూట విప్పండి"

"నేనా? అదేమిటమ్మగారూ! వరలక్ష్మి గారు..."

ఆవిడ ఏదో అనబోతుండగా మధ్యలోనే అడ్డుపడి చెప్పింది.

"ముందు నేను చెప్పిన పనిచెయ్యండి" ఆవిడ స్వరం శాసిస్తున్నట్టు వుంది.

తాయారమ్మగారు నూతన వధూవరుల కెదురుగా గడప ఇవతల నిలబడింది.

రవిచంద్ర చిటికెనవేలు పట్టుకుని నును సిగ్గు దొంతరలతో తలదించుకుని నిలబడిన స్రవంతితో చెప్పాడు పురోహితుడు.

"కుడికాలు ముందుపెట్టి ఆ ధాన్యం గింజలమీద నడుస్తూ లోపలకి వెళ్ళండమ్మా? "

స్రవంతి చెప్పులు విప్పి కుడిపాదాన్ని ఎత్తి గడపలోపల పెట్టింది. ఆమె గుమ్మం దాటి లోపలకి రాగానే తాయారమ్మగారు ఆమె నడుముకి వున్న వడిగంటి బియ్యం మూటని విప్పింది.

"రండి" అంది చిరునవ్వుతో.

స్రవంతి లోపలికి వచ్చింది.

ఆమె నడుస్తుంటే ఆమె పాదాలకి వున్న చిరుమువ్వలు లయగా శబ్దం చేశాయి.

ఆమె ప్రతి కదలికని నిశ్శబ్దంగా గమనిస్తున్న త్రిపురాంబ కళ్ళలో ఆమెపై చులకన భావం స్పష్టంగా కన్పిస్తోంది. స్రవంతి లోపలికి వచ్చి అత్తగారి పాదాలకి నమస్కరించింది. ఆవిడ చటుక్కున పాదాలని జరుపుకుని అంది. "వెళ్ళి త్వరగా స్నానం చెయ్యి. వర్జ్యం వస్తుంది. మీరిద్దరూ పీటలమీద కూర్చోవాలి"

స్రవంతి మనసు చివుక్కుమంది. కొత్త కోడలు పాదాభివందనం చేసినప్పుడు మంచి అత్తగారు చిరునవ్వుతో ఆమె భుజాలు పట్టి లేవదీసి నుదుట ప్రేమగా ముద్దుపెట్టుకోవడం చాలా సినిమాల్లో చూసింది. గయ్యాళి అత్తగారైతే ముఖం చిట్లించి, మూతి తిప్పుకుంటూ తన నిరసనని, తిరస్కారాన్ని వ్యక్తం చెయ్యడం కూడా చూసింది.

"కాని తన చేతులు ఆవిడ పాదాలను తాకీ తాకకముందే పాదాలని వెనక్కి జరుపుకున్న ఈవిడ స్వభావమెలాంటిది? " ఆమె తల ఎత్తి ఆవిడవైపు చూసింది. ఆవిడ కళ్ళల్లో ఆ క్షణంలో కనిపించిన అయిష్టతకి ఆమె మనసులో ముల్లు గుచ్చుకున్నట్టయింది.

"పెళ్ళికూతురికి కాఫీ ఇచ్చారా? " ఎవరో అడుగుతున్నారు.

ఇల్లంతా అపరిచితవ్యక్తులు. ఖరీదైన పట్టుచీరలు, డైమండ్ నగల మిలమిలలు. స్రవంతికి ఏదో కొత్త లోకంలోకి వచ్చినట్టయింది. ఎవరో కాఫీ తెచ్చి ఆమెకి అందించారు.

ఆమె కాఫీ తాగసాగింది. మధ్యలో ఎందుకో కాఫీ కప్పుపై నుంచి కళ్ళెత్తి చూసిన ఆమెకి తననే గుచ్చి గుచ్చి చూస్తున్న కొన్ని జతల కళ్ళు కనిపించాయి. ఆమెకి ఒళ్ళంతా ముడుచుకుపోయినట్టయింది. నత్తగుల్లలా ముడుచుకుపోవాలన్పిస్తోంది.

"పద, స్నానం చేద్దువుగాని" మేనత్త చెవి దగ్గర మెల్లిగా చెప్పింది.

స్రవంతి లోపలికి నడిచింది.

తలంటుకున్న ఆమె జుట్టుని తుడుస్తూ అంది ఆమె మేనత్త.

"మీ అత్తవారిలో డబ్బున్నవాళ్ళమనే దర్పం, అతిశయం స్పష్టంగా కన్పిస్తున్నాయి. ఇలాంటి మనుషుల మధ్య ఎలా కాపురం చేస్తావో ఏమిటో? "

స్రవంతి మనసుని ఆవరించుకున్న భయ సందేహాలు మరింత గాఢమయ్యాయి.

"హనీమూన్‌కి ఎక్కడకి వెళ్తారురా? " వరలక్ష్మి రవిని చూస్తూ అడిగింది.

అతను సమాధానం చెప్పేలోగానే త్రిపురాంబ అడిగింది. "హనీమూన్ ఖర్చుల కోసం మీ మామగారు ఎన్నివేలు ఇచ్చారురా? "

స్రవంతి ముఖం పాలిపోయింది. ఆమె కంచంలో వేలితో గీతలు గీస్తూ ఉండిపోయింది. రవి ఏం సమాధానం చెబుతాడా అని ఆమె అసంకల్పితంగానే ఎదురుచూడసాగింది.

"మీరు హనీమూన్‌కి వెళ్ళినప్పుడు మీ నాన్నగారు ఎంత ఇచ్చారు కల్పనా? నలభైవేలు కదూ? " వరలక్ష్మి అడిగింది.

"నలభైవేలు కాదు. యాభైవేలు" అంది కల్పన.

ఆమె స్వరంలో అతిశయం.

శ్రీధర్ భార్యవేపు చూసి నవ్వాడు. ఆ నవ్వులో గర్వం తొణికిసలాడింది.

"హనీమూన్ లేదు. ఏంలేదు. ఇక్కడే వుంటాం" అన్నాడు రవి.

వరలక్ష్మి రవిని హనీమూన్‌కి ఎక్కడకి వెళ్తారని అడగ్గానే అత్తగారు అతన్ని, "మీ మామగారు ఎంత ఇచ్చారని అడగడంలో ఆంతర్యమేమిటి? అన్యాపదేశంగా తన తండ్రిని ఆ డబ్బు అడగమని హెచ్చరిక కాదుకదా!" ఆమెకి తింటున్న అన్నం చేదుగా అన్పిస్తోంది.

తరువాత ఏకాంతంలో భర్తని అడిగింది.

"మా నాన్నగారు మనం హనీమూన్‌కి వెళ్ళడానికి డబ్బు ఇవ్వలేదని బాధపడుతున్నారా? "

"ఇంకొకరి సొమ్ము కోసం ఆశించే నీచుడిని కాను" రవి ముఖం చిట్లిస్తూ అన్నాడు.

"మీ అమ్మగారు మీ మామగారు ఎన్నివేలు ఇచ్చారని అడిగినప్పుడు ఈ సమాధానం చెప్పవలసింది"

"అమ్మ చాదస్తంగా ఏదో అంది. దానిపై తర్కం అనవసరం"

"ఆవిడ చాదస్తంగా అనలేదు. మీ నాన్న డబ్బిస్తేనే హనీమూన్‌కి వెళ్ళండి" అని పరోక్షంగా చెప్పింది. స్రవంతి మనసులోనే అనుకుంది.

ఉదాసీనమైన ఆమె ముఖాన్ని చూసి అడిగాడు రవి. "నీకు హనీమూన్‌కి వెళ్ళాలని వుందా? "

"మీకు లేదా? " ఎదురుప్రశ్నించింది.

"వెళ్ళాలనే వుంది. కాని డబ్బు? "

ఒక కోటీశ్వరుడి కొడుకు తన హనీమూన్ ఖర్చులకి డబ్బెలా వస్తుందా అని ఆలోచిస్తుంటే స్రవంతికి ఆశ్చర్యంగా వుంది.

ఆమె కళ్ళలోని ఆశ్చర్యాన్ని గమనించి అన్నాడు రవి.

"ఈ ఆస్తి అంతా మా తాతగారి ద్వారా మా అమ్మకి సంక్రమించింది. మా నాన్నగారు మంచివారేకాని వ్యవహారజ్ఞానం బొత్తిగా లేనివారు. నాన్నగారితో మా అమ్మ పెళ్ళయ్యేసరికి ఆయన ఇంజనీరుగా ఉద్యోగం చేస్తుండేవారు. ఆయన్ని ఉద్యోగం మానెయ్యమని బిజినెస్ పెట్టించింది అమ్మ. ఆయన మంచితనాన్ని లోకువగా తీసుకుని పార్ట్నర్స్ మోసం చేశారు. ఇవాళ మా బిజినెస్ ఈ మాత్రం నిలబడిందీ అంటే అది మా అన్నయ్య సమర్థతే!"

తామిద్దరూ హనీమూన్ వెళ్ళడానికి ఆస్తి అంతా తల్లిదని చెప్పడానికి సంబంధం ఏమిటో స్రవంతికి అర్థం కాలేదు.

"మా అన్నయ్య అత్తవారు బాగా డబ్బున్నవాళ్ళు. మా అన్నయ్యకి, వదినకి కానుకల రూపంలో బాగా ముట్టచెబుతారు. మా వదిన చెప్పినది నిజమే. వాళ్ళ హనీమూన్ ట్రిప్‌కి ఆయనే డబ్బిచ్చారు. అయినా మనం హనీమూన్‌కి వెళ్ళకపోతేనేం, మనిద్దరం ఇలా వుంటే అది హనీమూన్ కాదా? " ఆమె చుట్టూ చేతులు బిగిస్తూ అన్నాడు.

★ ★ ★

శ్వేత గది మధ్యలో తలవంచుకుని నిలబడి వుంది. ఆమె శరీరం ఏదో తెలియని




భయాందోళనలతో సన్నగా కంపిస్తోంది. తల దించుకుని నిలబడి వున్న ఆమెకి కాస్త దూరంలో నిలబడి వున్న మోహన్ పాదాలు కన్పిస్తున్నాయి.

క్షణాలు నిముషాలుగా మారిపోతున్నా, అతను కదిలి తన దగ్గరకి వచ్చే సూచన కన్పించలేదామెకి. మొదటి రాత్రి సంకోచంతో, బిడియంతో ముడుచుకుపోతున్న భార్యని భర్త చొరవగా ముందు పలుకరిస్తాడని పుస్తకాలలో చదివింది. సినిమాలలో చూసింది. కాని ఇతను? తను గదిలోకి వచ్చి చాలాసేపయినా తనని పలుకరించ లేదు. కనీసం తన దగ్గర్కైనా రాలేదు. ఏమిటితని మనస్తత్వం?

మరికొన్ని నిముషాల తర్వాత అతను నిలబడ్డచోటునుంచి కదిలివచ్చాడు.

"నాకు ఇష్టంలేదు" అన్నాడు.

అతని స్వరంలో అసహనం.

"ఇష్టంలేదు"

శ్వేత స్పష్టంగా విన్పించిన ఆ మాటలతో అదిరిపడింది. ఆమె గుండె క్షణకాలం కొట్టుకోవడం ఆగినట్టయి మళ్ళీ రెట్టింపు వేగంతో కొట్టుకోవడం మొదలుపెట్టింది.

"ఏమన్నాడతను? ఇష్టం లేదా? తనంటే ఇష్టంలేదా? " ఆమె చివ్వున తల ఎత్తింది.

అతను ఆమెకి రెండడుగుల దూరంలో నిలబడివున్నాడు. కందగడ్డలా వున్న అతని ముఖంలో అయిష్టత స్పష్టంగా కన్పిస్తోంది.

"నాకిదంతా ఇష్టంలేదు. నీ గురించి నాకు నా గురించి నీకు ఏమీ తెలియదు. అలాంటిది మన ఇద్దరినీ గదిలోకి పంపి... ఛీ! నాకు చాలా అసహ్యం వేస్తోంది"

శ్వేత సంతృప్తిగా నిశ్వసిస్తూ, సిగ్గు తెరలని అవతలకి నెడుతూ అంది.

"కొన్నాళ్లు మనం స్నేహితుల్లా వుందాం. మనం మానసికంగా దగ్గరయ్యాకే..."

ఆమె చెప్పేది పూర్తవకుండానే అతను అసహనంగా అడ్డుపడ్డాడు.

"నేను మా అమ్మతో ఈ విషయంలో చాలా పోట్లాడాను. కాని చాదస్తంగా మంచి ముహూర్తం అంటూ నన్ను వేధించుకుని తింది"

శ్వేతకి నవ్వొచ్చింది. ఆమె తలదించుకుని తనలో తనే నవ్వుకుంది.

అతను మంచంమీద కూర్చుంటూ అన్నాడు.

"అక్కడే నిలబడిపోయావేం రా? "

అతని స్వరంలో అంతర్లీనంగా ధ్వనించిన పదునుకి శ్వేతలో పోతున్న జంకు, భయం మళ్ళీ వచ్చి చేరాయి. ఆమె అడుగు ముందుకి వెయ్యలేకపోయింది.

"నిన్నే! రమ్మంటున్నానా? " అధికారికంగా వున్న ఆ స్వరం విన్న ఆమె తనువు, మనసు కూడా కంపించిపోయాయి.

ఆమె తడబడే అడుగులతో వచ్చి అతనికి అడుగు దూరంలో నిలబడింది. అతనామె చెయ్యిపట్టి లాగుతూ అన్నాడు.

"ముహూర్తం అన్నాక తప్పదుగా? వచ్చి పడుకో"

భూమి బద్దలై తను అందులోకి కూరుకుపోతే బాగుండునన్పిస్తోందామెకి. సిగ్గుతో, భయాందోళనలతో నిలువెల్లా కంపిస్తున్న ఆమెని అతను ఆక్రమించుకున్నాడు. ఆ చర్యలో ఉద్రేకం తప్ప ప్రేమ, లాలన ఈషణ్మాత్రం కన్పించలేదామెకి. ఆమె మనోనేత్రం కన్నీరు కారుస్తోంది. తొలి పురుష స్పర్శతో, అత్తి పత్తి ఆకులా ముడుచుకుపోతోందామె శరీరం. భాష చెప్పలేని భావాన్ని స్పర్శ చెబుతుంది. అతని స్పర్శలో కోరిక తప్ప తనపై ఇష్టం లేదని గ్రహించిన ఆమె మనసు మూగగా రోదిస్తోంది.

కొన్ని క్షణాల తర్వాత అతను ఆమెనుంచి దూరంగా జరుగుతూ అన్నాడు.

"నువ్వు వెళ్ళి కిందపడుకో. ఎక్కువసేపు నన్ను అతుక్కుని పడుకుంటే నీ నలుపు రంగు నాకు అంటుకుంటుంది" అతని స్వరం వ్యంగ్యంగా ధ్వనించిందా చీకట్లో అతని వీపుని చుట్టిన ఆమె చేతులు అప్ర

యత్నంగానే వదులయ్యాయి. శ్వేతని దిగ్గున లేచేలా చేశాయి ఆ మాటలు. ఆమె మీటనొక్కినట్టు లేచి నిలబడిపోయింది. తలమీద పిడుగుపడ్డట్టు, తను నిలబడిన నేల కంపిస్తున్నట్టు వుందామెకి. అతని మాటలని జీర్ణం చేసుకోడానికే ఆమెకి కొన్ని నిముషాల టైమ్ పట్టింది.

"నీ నలుపురంగు నాకు అంటుకుంటుంది"

ఎంత ఏహ్యాత ఆ స్వరంలో?

ఎంత వ్యంగ్యం ఆ మాటలలో.

గతంలో ఎందరో తన శరీరపు నలుపు రంగుని హేళన చేసినపుడు కలుగని బాధ ఇప్పుడు కలుగుతోంది. అతను అన్న ప్రతి మాటని పునశ్చరణ చేసుకుంటున్న ఆమెకి వాటి అర్థం బోధపడింది.

"నాకిష్టంలేదు" అన్న అతని మాటలకి అర్థం ఇష్టంలేనిది మొదటి రాత్రికాదు తను. శ్వేత మనసుని ఎవరో మంచుముద్దల మధ్య నొక్కిపెట్టినట్టు మొద్దుబారిపోయింది"

మొదటిరాత్రే భర్తచేత నువ్వంటే నాకిష్టం లేదు అన్పించుకున్న తనకి దుఃఖం రాదేం?

గదిలో నైట్ బల్బ్ మందంగా వెలుగు తోంది. అతను మంచం మీద అసహనంగా అటూఇటూ కదలడం ఆ వెలుతురులో కన్పి స్తోంది. అతను హఠాత్తుగా ఏదో గుర్తువ చ్చినట్టు లేచి కూర్చుంటూ అడిగేడు.

"మీరు బాగా వున్నవాళ్లే నటగా"

శ్వేతకి ఆ ప్రశ్న అర్థం అయీ అవకుండా వుంది.

"అదే మీ నాన్న బాగా సంపాదించాడ టగా" అతను అడిగిన ప్రశ్న శ్వేతకి అర్థం అయింది. కాని ఎందుకలా అడుగుతు న్నాడో మాత్రం అర్థంకాలేదు.

"మీ నాన్న మన సంసారానికి నెలకో మూడువేలు సర్దగలడా"

శ్వేత నోట మాట రానట్టు అతన్నే చూస్తోంది.

"ఏంఅడిగినా సమాధానం చెప్పవేం, పొగరా, నిర్లక్ష్యమా?" మోహన్ కోపంగా అరిచాడు.

"మా నాన్నగారు మనకి డబ్బు పంపడం ఏమిటి?" చిన్నగా అయినా స్పష్టంగానే అడి గింది.

"ఎందుకంటే నాకు వచ్చే జీతంతో మన సంసారం నడవదు కాబట్టి. మీ వాళ్లకి చెప్పినట్టుగా నా జీతం ఆరువేలు కాదు మూడు వేల కాబట్టి"

శ్వేతకి తన చుట్టూవున్న వస్తువులన్నీ గిర గిర తిరిగిపోతున్న అనుభూతి కలుగు తోంది. ప్రైవేటు కంపెనీ అయినా ఆరువేలు జీతం వస్తుంది, తనని పోషించగలడనే నమ్మకంతో తనని మోహన్‌కిచ్చి పెళ్లి చేసిన తండ్రి గుర్తువచ్చాడు. ఇతను తనని ఇష్ట పడి పెళ్లిచేసుకోలేదని తన డబ్బుపై ఆశతో చేసుకున్నాడని తెలిస్తే తండ్రి ఏమవుతాడు.

"ఈ విషయాన్ని మరోసారి మాట్లాడు కుందాం. నాకు నిద్ర వస్తోంది" అందామె పడుకోబోతూ.

"నాకు జవాబు ఈ క్షణాన్నే చెప్పాలి. నిన్ను పెళ్లిచేసుకోవడం అనే వ్యాపారంలో లాభం వస్తుందని నాకు తెలుసు. కాని ఎంత వస్తుందో ఇప్పుడే తెలియాలి."

మోహన్ మాటలలో వ్యాపారం అనే మాట విని ఆమె కంఠం చుట్టూ ఉరిత్రాడు బిగించినట్టయింది.

"ఇది మన మొదటి రాత్రేకాని చివరి రాత్రి కాదు. తాపీగా అన్ని విషయాలు చర్చించుకుందాం" సహనాన్ని కూడదీసు కుంటూ అంది.

"డబ్బు విషయం తేల్చి చెప్పేదాకా ఇది మన మొదటి రాత్రేకాదు, చివరి రాత్రి కూడా. గుర్తుంచుకో" అతను హెచ్చరికగా అని పడుకున్నాడు. కొన్ని నిముషాల నిశ్శబ్దం తరువాత అతను గురకపెట్టడం వినిపించిందామెకి. పేరు తెలియని జంతువేదో వికృతంగా నోరు తెరుచుకుని తనని మింగడానికి సిద్ధంగా వున్నట్టు ఆమె మేనులో జలదరింపు.

అప్పుడొచ్చిందామెకి దుఃఖం.



స్రవంతి కాపురానికి వచ్చిన పదిరోజుల లోనే ఆ ఇంట్లోని వ్యక్తుల మనస్తత్వాలను గ్రహించగలిగింది. ఆ ఇంట్లో మాధవరావు గారు యజమానిలా వుండడు. నిర్ణయాలన్నీ త్రిపురాంబవే. కల్పనలో తను డబ్బున్న ఇంటినుంచి వచ్చాననే అహం స్పష్టంగా కన్పిస్తూంటుంది. శ్రీధర్ వట్టి స్వార్థపరుడు. అతను చేసే ప్రతి పనిలోను ఆ స్వార్థం బయటపడుతూనే వుంటుంది. ఆస్తిలో, అంతస్తులో తమతో ఏమాత్రం సరితూగని కుటుంబంనుంచి ఆ ఇంటి కోడలిగా వచ్చిన తనపై ఆడబడుచుకి, అత్తగారికి కూడా చిన్న చూపేనని గ్రహించడానికి ఆమెకెంతో కాలం పట్టలేదు.

ఆరోజు స్రవంతి డైనింగ్‌టేబిల్ మీద ప్లేట్లు అమరుస్తోంది. హాలులోనుంచి వరలక్ష్మి స్వరం వినిపించి బయటకి వచ్చి ఆమెని చిరునవ్వుతో పలుకరించింది.

"ఏంచేస్తున్నావు? " అడిగిందామె.

"ఏమీ తోచడంలేదు. తాయారమ్మగారికి సాయం చేస్తున్నానండీ" అంది.

"ఇలా వచ్చి కూర్చో" అంది త్రిపురాంబ. స్రవంతి వచ్చి కల్పన పక్కన కూర్చుంది.

వరలక్ష్మి తన ఆడబడుచు కోడలి గురించి చెబుతోంది. ఆ ఇంట్లో ఆడవాళ్ల ముగ్గురూ ఒకచోట కూర్చుంటే చెప్పుకునేవి అక్కడ లేనివాళ్ల గురించి విమర్శలే. వాళ్ల మాటలే నిజమైతే వాళ్ల బంధువర్గంలోగాని మిత్రబృందంలోగాని ఒక్క మంచి వ్యక్తీ లేరు. పరోక్షంగా విమర్శిస్తూనే మళ్లీ వాళ్లు ఇంటికొస్తే నవ్వుతూ ఆప్యాయతని ఒలకబోస్తూ మాట్లాడతారు.

"అసలా అమ్మాయి ఎప్పుడూ వంటింట్లోనే వుంటుంది. జిడ్డోడుతూ ఎంత మురిగ్గా వుంటుందో" అంది వరలక్ష్మి.

"వంటింట్లో అంత సేపు ఏంచేస్తుందండీ!" కల్పన కుతూహలంగా అడిగింది.

"ఏమో ఏంచేస్తుందో? అసలు పని తెముల్చుకోదు. కొడుకు ఆఫీసునుంచి ఇంటికి వచ్చే టైమయినా వంటింట్లోనుంచి బయటకి రాదని మా ఆడబడుచు గోల"

"వాళ్లింట్లో వంటమనిషి లేదుటే? " త్రిపురాంబ అడిగింది.

"వుంది. వున్నా పనివాళ్లచేత పని చేయించుకోడం రావద్దూ? దాని పుట్టింట్లో పనివాళ్లని పెట్టుకునే తాహతు లేదు. ఇక్కడ వున్నా చేయించుకోడంరాదు. పూటకి గతిలేని ముండలందరూ మన ఇంటి కోడళ్లయితే ఇలాగే వుంటుంది"

స్రవంతి గుండెలో బాణంలా దిగబడిందా మాట. ఆమె ముఖం రక్తం లేనంతగా పాలిపోయింది.

"వాళ్లు బొత్తిగా లేనివాళ్లు. మనకా సంబంధం వద్దురా అని మా ఆడబడుచు మొత్తుకుంటున్నా వినకుండా ప్రేమని, దోమని దాన్ని చేసుకున్నాడు"

స్రవంతి తల దించుకుని తన ముఖంలోని భావాలు కన్పించకుండా జాగ్రత్త పడుతోంది. ఆమెకి అక్కడనుంచి పారిపోవాలని వుంది. కానీ కాళ్లలో శక్తినంతటినీ ఎవరో లాగేసినట్టు లేవలేకపోతోంది. తర్వాత వాళ్లేం మాట్లాడుకున్నారో ఆమెకి వినబడ

లేదు. వినే స్థితిలో లేదామె. అన్యాపదేశంగా ఆమె మాట్లాడిన ప్రతిమాట తనని ఉద్దేశించినదే అని ఆమెకి తెలుసు.

మరోరోజు అందరూ సినిమాకి వెళ్దామని బయలుదేరుతున్నారు. కల్పన లేత గోధుమ రంగు బిన్నీ సిల్కు చీర కట్టుకుంది.

"ఇలాంటి చీర నా దగ్గర కూడా వుందండీ. సరిగ్గా ఇదే రంగు... అచ్చం ఇలాంటిదే. ఈసారి ఎక్కడికైనా వెళ్లినప్పుడు మనిద్దరం కట్టుకుందాం" అంది.

ఆ క్షణంలో కల్పన ముఖంలో కదలాడిన భావాలని ఆమె గమనించలేదు. మరునాడు ఉదయం... స్రవంతి పెరటితోటలో కొత్తిమీర కోస్తోంది. పనిమనిషి బట్టలు ఉతుకుతోంది.

"ముత్యాలూ! ఇలా రావే!" కల్పన వచ్చి పిలిచింది. అది చేస్తున్న పని వదిలి ఆమె దగ్గరకి వెళ్లింది.

"ఎప్పటి నుంచో పాత చీర ఇమ్మని అడుగుతున్నావుకదూ? ఈ చీర తీసుకో" కల్పన ముత్యాలు చేతులలో పెట్టిన చీర చూసి ఆమె ముఖం మతాబాలా వెలిగిపోతే స్రవంతి ముఖం వెలవెల పోయింది. అది నిన్న సాయంకాలం కల్పన కట్టుకున్న బిన్నీ సిల్కు చీర. తనకి కూడా అలాంటి చీర వుందని తను చెప్పి కొన్ని గంటలయినా కాకముందే కల్పన ఆ చీరని పనిమనిషికివ్వడంలోని ఆంతర్యమేమిటి? తనకి వున్నలాంటి చీర ఆమె కట్టుకుంటే ఆమె అంతస్తు దిగజారిపోతుందా? " స్రవంతి దిమ్మెరపోయినట్టు చూస్తోంది.

తను ఆ ఇంట్లో నెల జీతానికి వంట చేసే తాయారమ్మగారికి కూడా లోకువే అనుకుంది జరిగిపోయిన ఒక్కొక్క సంఘటననే గుర్తు చేసుకుంటూ.

స్రవంతి ఆ ఇంటికి వచ్చి పూర్తిగా నెల రోజులయినా కాకముందే ఆవిడ ఆమెని పాత చీర ఇమ్మని అడిగింది. ఆమెకేం చెయ్యాలో పాలుపోలేదు. పెళ్లప్పుడు తల్లి పది చీరలు కొంది. అప్పుడప్పుడు కొనుక్కున్న చీరలు పదిహేనుదాకా వున్నాయి. బాగా పాత చీరలని అవైనా రెండే వుంటే కాకినాడలో తమ ఇంట్లో పనిచేసే అమ్మాయికి ఇచ్చింది. ఇప్పుడు తాయారమ్మగారు పాత చీర అడిగితే ఏ చీర ఇవ్వాలో ఆమెకి అర్థంకాలేదు.

"నా దగ్గర పాత చీరలు లేవండి" అంది.

"పోనీలెండి" అందావిడ ముఖం మాడ్చుకుని. తరువాత కల్పనతో అంది స్రవంతి. తాయారమ్మగారు పాత చీర ఇమ్మని నన్ను అడిగింది కల్పనా! నా దగ్గర నిజంగానేలేవు. అందుకే లేవని చెప్పేశాను"

"నిన్ను పాతచీర అడిగిందా? బుద్ధి లేకపోతే సరి" అన్న కల్పన మరో గంట తర్వాత ఆవిడని గదిలోకి పిలిచి రెండు చీరలివ్వడం చూసి స్రవంతి నోటమాటరానట్టు అయింది.

"కల్పనమ్మ మనసు వెన్న, చెయ్యి భారీ! అడగకుండానే రెండు చీరలిచ్చింది" ఆ రోజంతా తాయారమ్మగారు ఆమెని పొగుడుతూనే వుంది.

స్రవంతి భర్తకి కేరేజీ సర్దాలని "వంట యిందా తాయారమ్మగారూ? " అని అడిగితే "నాకేం పది చేతులు లేవు. చేస్తున్నాగా? అర్జంటయితే చేసుకోండి" అని విసుక్కోడం మొదలు పెట్టింది.

కల్పన తాయారమ్మగారు అడగకుండానే రెండు చీరలివ్వడం ఆవిడపై అభిమానంతో కాదు. కేవలం తనని చిన్నబుచ్చడానికే అని స్రవంతికి తెలుసు.

"మా అమ్మాయిని చూడనిదే వుండలేను"

"మా కల్పన రాత్రంతా కలలోనే వుంది" అంటూ నెలకోసారి ఆ ఇంటికి వచ్చే కల్పన తల్లి మహేశ్వరి స్రవంతిని మరోలా అవమానించేది.

"అమ్మాయీ స్రవంతీ! మా కల్పన, నువ్వు తోటి కోడళ్లలా కాదు అక్క చెల్లెళ్లలా వుండాలి" అంటూ నేను కల్పనకే కాదు





నీకూ తల్లినే అన్నంత ఆప్యాయతను కురిపించింది. స్రవంతి మనసు ఆ అభిమానానికి ఆర్ద్రమయింది.

"మా అమ్మాయి చెబుతుంది. మా స్రవంతి ఎంత పనిమంతురాలో! మా మరిది అదృష్టవంతుడని" ఆవిడ తనని పొగిడినప్పుడు మాత్రం ఆమెకి తనపట్ల కల్పన వైఖరి గుర్తొచ్చి ఆలోచనలో పడింది. తనతో నవ్వుతూ మాట్లాడుతూనే చేతలతో తనని అవమానించే కల్పన తను చాలా మంచిదని, పనిమంతురాలని తల్లితో చెప్పిందా?

ఆమె ఆలోచిస్తుండగానే మహేశ్వరి అడిగింది.

"నువ్వు ఇక్కడకి వస్తున్నప్పుడు మీ అమ్మగారు ఎన్నో ఇచ్చి పంపారుట. ఊరగాయలుట, అవేవో వుండలుట. మా కల్పన చెప్పింది. అమ్మా! స్రవంతి ఎన్ని తెచ్చుకుందో తెలుసా అని"

"వుండలా? " స్రవంతి నవ్వేసింది. "తొక్కుడు లడ్లు ఇచ్చారు. నాకు బెల్లం ఆవకాయ ఇష్టమని కొంచెం పెట్టి ఇచ్చారు"

"అవునుట. మీ అమ్మగారు చాలా ఇచ్చారుట. నేను మా కల్పన మొదటిసారి ఇక్కడకి వచ్చేప్పుడు వాళ్ల సంసారానికి సరిపడ సామాన్లిచ్చాను. వెండి డిన్నర్ సెట్టు, టీసెట్టు. మొత్తం అయిదు కేజీల వెండి ఇచ్చాను. వరలక్ష్మి వ్రతం చేయించి వెండి సింహాసనం నుంచి హారతిపళ్లెం వరకు ఇచ్చాను. వాళ్ల మొదటి వెడ్డింగ్ యానివర్సరీకి శ్రీధర్‌కి నవరత్నాల వుంగరం, కల్పనకి నెక్లెస్ చేయించాను"

ఆవిడ మాటలు వింటున్న స్రవంతికి తన పుట్టింటి వాళ్లు తనకి వూరగాయ మాత్రమే ఇచ్చారని ఆవిడ హేళన చేస్తోందా, లేక తను కల్పనకిచ్చిన వెండి బంగారాల విలువని చెప్పి ఆవిడ గొప్పతనాన్ని చాటుకుంటోందా అనే అనుమానం వచ్చింది. ఆలోచించగా ఆలోచించగా ఆవిడ మాటలలోని అర్థం తెలిసిపోయి ఆమె మనసు చేదు తిన్నట్టయింది. తను పుట్టింటి నుంచి ఏమీ తెచ్చుకోలేదని ఆవిడ హేళన.

ఆ కుటుంబంలో ఎవరికీ తనని కోడలిగా చేసుకోడం ఇష్టం లేనప్పుడు మామగారు తనని ఎందుకు కోడలిగా చేసుకున్నట్టు? అడుగడుగునా తిరస్కారాన్ని, అవమానాన్ని చవిచూస్తూ ఈ మనుషుల మధ్య ఎంత కాలం గడపగలదు. ఆమె మనసు తుఫాను వచ్చినప్పటి సముద్రంలా వుంది.

★ ★ ★

జానకమ్మ కూతురి పాదాలకి పసుపు పూసి కొత్త చీర, చలిమిడి ఆమె చేతిలో పెట్టింది. మొన్నటి వరకు కూతురికి పెళ్లి కాలేదనే బెంగ ఇప్పుడు ఆమె అత్తవారింటికి వెళ్లిపోతోందనే బెంగగా మారింది. వంగి తన పాదాలకి నమస్కరిస్తున్న కూతురి తలపై ఆవిడ కన్నీళ్లు అక్షింతలై కురిశాయి. శ్వేత కన్నీళ్లు తల్లి పాదాలని అభిషేకిస్తున్నాయి.

తను ఏడిస్తే కూతురు మరింత బెంబేలు పడుతుందని ఆవిడ తన దుఃఖాన్ని బలవంతాన నిగ్రహించుకుంటూ ఆమెని అక్కున చేర్చుకుని ఓదార్చసాగింది.

"ఏడవకమ్మా! నువ్వు చదువుకున్నదానివి. నీకు అన్నీ తెలుసు. ఆడపిల్ల ఎప్పటికైనా పరాయివాళ్ల సొత్తే. అయినా రాజమండ్రికి విజయవాడ ఎంత దూరమని? ఎప్పుడు కావాలంటే అప్పుడు నువ్విక్కడకి రావచ్చు మేమూ అక్కడకి వచ్చి నిన్ను చూడచ్చు" అంది ఓదార్పుగా.

"నేను ఏడుస్తున్నది మీకు దూరమై పోతున్నందుకు కాదమ్మా. పెళ్లి నాకు భద్రతనిస్తుందని, నా జీవితం నా భర్త అండన సుఖంగా గడచిపోతుందని నమ్మకంతో ఆనందిస్తున్నారు మీరు. కాని నా భర్త దృష్టిలో పెళ్లి అనేది వ్యాపారం అని, అందులోని లాభనష్టాలను బేరీజు వేసుకునే అతను నా మెడలో తాళి కట్టాడని తెలిస్తే

మీరేమయిపోతారమ్మా? మీరు నాకు కష్టంతో కొనిపెట్టిన భద్రత ఓటిదమ్మా!" ఆమె మనసు మూగగా రోదిస్తోంది.

శ్వేతని అత్తవారింట్లో దింపడానికి జానకమ్మ వచ్చింది. మధ్యాహ్నం భోజనాలయ్యాక వియ్యపురాలిని అడిగిందావిడ.

"సారె పంచడానికి మీకు తోడు రమ్మంటే వస్తాను వదినగారూ"

"ఇంతోటి సారె పంచడానికి మీరు తోడు రావాలా? ఈ వంద లడ్లు మా బంధుజనానికే సరిపోవు" రాజేశ్వరమ్మ ముఖం గంటుపెట్టుకుని అంది.

మొదటి రాత్రే భర్త నిజస్వరూపం అర్థమై అత్తమామలు ఎలాంటివాళ్లోనని భయపడుతున్న శ్వేత ఆవిడ అన్న మాటలకి నిశ్చేష్టురాలయింది.

వియ్యపురాలు అలా అనగానే జానకమ్మ నిర్ఘాంతపోయింది.

"ఏమిటీవిడ ఉద్దేశం?"

"ముద్దు ముచ్చట్లు తీర్చే వాళ్లనుకున్నాను కాని ఇలా అన్నింటిలోను దిగలాగే వాళ్లనుకున్నానా? ఏంచేస్తాను? నా మర్యాద పోగొట్టుకోలేనుకదా! మరో యాభై లడ్లు కొని నా స్నేహితుల ఇళ్లలో పంచి పెట్టుకుంటాను."

జానకమ్మ మారు మాట్లాడకుండా పర్సులోనుంచి అయిదు వందలు తీసి ఆవిడ చేతిలో పెట్టింది.

"ఏమీ అనుకోకండి వదినగారూ! మా పెద్దమ్మాయికి ఇచ్చినట్టే శ్వేతకీ సారె చేయించాను. మీకు బంధువర్గం ఎక్కువని నేను తెచ్చిన స్వీట్లు చాలవని అనుకోలేదు" అంది క్షమాపణ కోరుకునే ధోరణిలో.

"ఫర్వాలేదులెండి" అందావిడ ఆ డబ్బు తీసుకుని అక్కడకి ఏదో దయతలస్తున్నట్టు.

అక్కడేవున్న మోహన్ తండ్రి శంకర్రావు కలుగచేసుకున్నాడు.

"ఏమిటి రాజ్యం నువ్వు! ఆడపిల్లగల వాళ్లు. మొన్ననే పెళ్లికి బోలెడు ఖర్చుపెట్టి వున్నారు. ఏదో వాళ్ల శక్తికొద్దీ సారె తెచ్చారు. అయినా ఆవిడకి మన బంధువర్గం చాలామంది వున్నారని, సారె సరిపోదని కలగానీ వచ్చిందా? ఈసారి అన్నీ తలో రెండొందలు చొప్పున స్వీట్లు తెస్తారులే"

జానకమ్మ అవాక్కై వింటోంది. భార్యని మందలిస్తున్నట్టు ఇటు తనకి పరోక్షంగా మరోసారి సారె ఇచ్చేప్పుడు రెట్టింపు స్వీట్లు తెమ్మని చెబుతున్నట్టున్న ఆయన చాతుర్యాన్ని ఆవిడ మనసులోనైనా అభినందించకుండా వుండలేకపోయింది.

"ఇంత దురాశాపరులైన అత్తమామల మధ్య ఈ ఇంట్లో కూతురి కాపురం సజావుగా సాగుతుందా?" ఆవిడ కళ్లు చెమ్మగిల్లాయి. శ్వేత ఆదుర్దాగా తల్లివైపు చూసింది. ఆవిడ బలవంతాన ముఖాన నవ్వు పులుముకుని మామూలుగా వుండడానికి ప్రయత్నించింది.

ఆ సాయంకాలమే జానకమ్మ ప్రయాణమయింది. రాజేశ్వరమ్మ మాటవరసకి అంటున్నట్టు అంది.

"మరి నాలుగురోజులుండి వెళ్లండి"

"లేదండీ... మావారికి వంట బొత్తిగా చేతకాదు. మా పెద్దమ్మాయి రేపు వెళ్లిపోతోంది" అందావిడ.

వెళ్తున్న తల్లితో రహస్యంగా చెప్పింది శ్వేత.

"ఇక్కడి విషయాలన్నీ నాన్నగారికి చెప్పకమ్మా" జానకమ్మకి పుట్టెడు దుఃఖం ముంచుకొచ్చింది.

అనారోగ్యంతోవున్న తండ్రి ఈ విషయాలు తెలిసి ఎక్కడ బెంగపడతాడో అని ఆదుర్దా పడుతున్న కూతురిని చూసి. "చెప్పనమ్మా" అంది మాట ఇస్తున్నట్టు.

తల్లి వూరికి వెళ్లాక అత్తగారు తను సారెలో తెచ్చిన స్వీట్లు స్వీట్ షాప్‌కి పంపి అమ్మించడం చూసి శ్వేత నిర్ఘాంతపోయింది.




అత్తగారి కక్కుర్తికి అసహ్యమేసింది.

స్వీట్లు అమ్మగా వచ్చిన డబ్బుని చేతిలో పట్టుకుని శ్వేతని పిలిచింది ఆవిడ.

"అమ్మా! శ్వేతా! నేనొక మాట చెబుతాను. ఏమీ అనుకోవుగా? "

"చెప్పండత్తయ్యా" మామూలుగా వుండడానికి ప్రయత్నిస్తూ అంది.

"పెళ్లయిన కొత్తలోనే నీ అవసరాలకి భర్త ముందు చెయ్యి జాస్తే అతనికి లోకువ అయిపోతావు. నీకేదయినా అవసరమైతే నన్ను అడగడానికి మొహమాట పడతావేమో! అందుకే ఈ డబ్బు నువ్వు తీసుకో" ఆవిడ డబ్బు అందించబోయింది.

శ్వేత మనసు అభిమానంతో కూడిన ఆర్ద్రతతో స్పందించింది. ఆమె కళ్లలో నీళ్లూరుతున్నాయి. ఒక్క చిన్న సంఘటనతో మనుషులని అంచనా వెయ్యడం ఎంత తప్పో ఆమెకి అనుభవపూర్వకంగా తెలిసింది. తల్లి తెచ్చిన స్వీట్లు అమ్మిన అత్తగారిది కక్కుర్తి బుద్ధి అనుకుంది. కాని ఆ డబ్బు తన అవసరాలకి వాడుకోమని భర్త ముందు చెయ్యి జాపవద్దని చెబుతున్న ఈవిడ దేవత.

ఆమె అభిమానంగా అత్తగారివైపు చూస్తూ అంది. "వద్దత్తయ్యగారూ! నా దగ్గర డబ్బు వుంది. మా నాన్నగారు నేను ఇక్కడకి వచ్చేప్పుడు వెయ్యి రూపాయలు ఇచ్చారు"

"ఇచ్చారా? సరేనమ్మా! కాని ఎప్పుడైనా నీకు డబ్బు అవసరమైతే నన్ను అడగడానికి సంకోచించకు. ఈ డబ్బు నీదే" అందావిడ బీర్వాలో ఆ డబ్బు పెడుతూ.

సాయంకాలం ఆరు గంటలయింది. మోహన్ తమ్ముడు ప్రకాష్ ఇంటికొచ్చాడు. ఆఫీసు నుంచి మోహన్ మాత్రం రాలేదు. శ్వేత తనకి తెలియకుండానే అతనికోసం ఎదురు చూస్తోంది.

★ ★ ★

రాత్రి ఎనిమిది గంటలకి ఇంటికి వచ్చాడు. ముందు గదిలో కుర్చీలో కూర్చున్న శ్వేతవైపు చూడకుండా సరాసరి వంటగదిలోకి వెళ్ళిపోయాడు. అతను తల్లితో మాట్లాడడం అస్పష్టంగా విన్పిస్తోందామెకి. శ్వేత చిన్నబుచ్చుకున్న మనసుతో ఆలోచిస్తోంది.

పెళ్ళయిన తొలిరోజులు. ఇరువురి మనసులూ అనురాగంతో పులకరించి ఏకమవవలసిన శుభతరుణమది. కాని, కొన్ని సంవత్సరాలుగా అతనితో కాపురం చేస్తున్నప్పటి యాంత్రికత, నిర్లిప్తత తన మనసులో ఏర్పడ్డాయి. ఆమె తను కట్టుకున్న గులాబీరంగు ప్రింటువున్న తెల్లని చీరని, తలలో మత్తుగా గుబాళిస్తున్న విరజాజులని నిర్లిప్తంగా చూసుకుంది. 'తను నల్లనిదైనా చక్కనిదని ఎవరైనా ఒప్పుకుని తీరవలసిందే. కాని తన భర్తని తను ఆకర్షించలేకపోయింది. పైగా మొదటి రాత్రే అతని అవహేళనకి గురయింది' ఆలోచిస్తున్న ఆమె హఠాత్తుగా తనని ఎవరో పిలవడంతో ఉలిక్కిపడింది.

మోహన్ వచ్చాడు. అతన్ని చూడగానే ఆమె అప్రయత్నంగానే లేచి నిలబడింది.

'రా, భోజనం చేద్దాం' అతని స్వరంలోని ఆప్యాయతకి, అనురాగానికి ఆమె మనసు తనకి తెలియకుండానే వశం తప్పుతోంది.

"ఇవాళ ఆఫీసునుంచి ఆలస్యంగా వచ్చారనుకుంటానే? " ఏదో ఒకటి మాట్లాడాలి కదా అన్నట్టు అడిగింది.

"అవును. ఆఫీసులో వర్క్ కొంచెం ఎక్కువగా వుంది" అన్నాడతను. వంటగదిలో అత్తగారు కంచాలలో వడ్డించి ఎదురుచూస్తోంది.

"కొత్త దంపతులు మీ ఇద్దరిమధ్య నేనెందుకమ్మా? మీరే పెట్టుకోండి" అని అవతలకి వెళ్ళిపోయింది.

మోహన్ నెయ్యి వడ్డిస్తూ అడిగాడు.

"మీ అమ్మగారు వెళ్ళిపోయారుట. నాలుగు రోజులుండి వెళ్ళవచ్చు కదా? "

"మా నాన్నగారి భోజనానికి ఇబ్బంది అని..."

అతను ఏవో కబుర్లు చెబుతున్నాడు. శ్వేతకి ఆశ్చర్యంగా వుంది. "మొదటి రాత్రి తరువాత ఇదే అతను తనతో మాట్లాడ్డం. ఆ రాత్రి నిస్సిగ్గుగా నిష్కర్షగా, నిర్మొహమాటంగా మాట్లాడినది ఇతనేనా? ఇతనిలో మరో మనిషి వున్నాడా?" ఆమె వెడల్పయిన కళ్లతో 'అతన్నే చూస్తోంది.

"ఏమిటలా చూస్తున్నావు? అన్నం తిను" అన్నాడు చిరునవ్వుతో ఇద్దరి భోజనాలు పూర్తయ్యాయి. శ్వేత గిన్నెలు సర్దుతుంటే రాజేశ్వరమ్మ వచ్చింది.

"అవన్నీ నేను చూస్తాను. వెళ్ళి కబుర్లు చెప్పుకోండి"

"ఫర్వాలేదత్తయ్యా!" అంది పనిచేస్తూనే.

"ఇలాగియ్యి. తెల్లవారితే చాలు వాడు ఆఫీసుకి వెళ్ళాలని ఉరుకులు పరుగులు మొదలుపెడతాడు. మళ్ళీ రాత్రికే ఇల్లు చేరేది"

శ్వేత సంకోచంగానే గదిలోకి వెళ్ళింది. అప్పటికే మంచంమీద పడుకుని వున్న మోహన్ లేచి కూర్చుంటూ అన్నాడు. "రా!"

అతని పెదవులపై చిరునవ్వు. శ్వేత గది మధ్యలోనే ఆగిపోయింది. ఈ ఆహ్వానం ఆ రాత్రివుంటే తన మనసులో అగాధం వుండేదా? అతను ఆమె దగ్గరకి వచ్చి చెయ్యి పట్టుకుని తన పక్కనే కూర్చోబెట్టుకున్నాడు.

ఆమె చేతిగాజులని సవరిస్తూ అడిగాడు. "నీకు మా ఇల్లు, ఈ వాతావరణం నచ్చాయా?"

ఆమెకి అతని స్వరంలోని ప్రేమ, లాలన కొత్తగా వున్నాయి. కొత్త వ్యక్తిని చూస్తున్నట్టు చూస్తోందతన్ని.

"మా అమ్మ అని గొప్ప చెప్పుకోవడం కాదుకాని, చాలా మంచిది. ఆవిడ మాట కటువుగా వుంటుంది తప్ప మనసు చాలా మంచిది"

"నిజమే!" అందామె చిరునవ్వుతో.





ఆ మాటలని, అతని అభిప్రాయాన్ని బలపరచడానికో, ముఖస్తుతికోసమో అనలేదు. అనుభవపూర్వకంగా తెలుసుకున్న నిజాన్ని అంగీకరించింది. అతనామెని దగ్గరకి తీసుకున్నాడు. శ్వేత ముఖం అతని మెడ ఒంపులో ఆనింది.

తండ్రి తమని పెంచడానికి ఎంతకష్టపడినది, ఆయన పడేకష్టం చూడలేక, తను ఇంకా చదువుకోవాలనే కోరికని చంపుకుని ఉద్యోగ ప్రయత్నాలు చెయ్యడం, తన దురదృష్టంకొద్దీ గవర్నమెంటు ఉద్యోగం దొరక్క ప్రైవేటు కంపెనీలో చేరడం అన్నీ ఒక కథలా చెప్పుకొచ్చాడతను. శ్వేత మౌనంగా వింటూండిపోయింది.

తరువాత కొన్ని నిముషాలు వేగంగా గడిచిపోయాయి. శ్వేత అతని అనురాగంలో, లాలనతోకూడిన కోరికలో తన అస్తిత్వాన్ని కోల్పోయింది. ఆమెకి ఇదే నిజమైన మొదటిరాత్రి అన్పిస్తోంది.

'శ్వేతా!' అతను తన గుండెలపై తలానించి పడుకుని వున్న ఆమె ముంగురులని సవరిస్తూ పిలిచాడు.

కళ్ళు తెరిస్తే ఈ సుందరస్వప్నం కరిగిపోతుందేమోనని ఆమె కళ్లు తెరవకుండానే "ఊ" అంది.

"నేను కొన్నాళ్ళపాటు నీ చిన్నచిన్న సరదాలను కూడా తీర్చలేను. ఈ దౌర్భాగ్యుడిని క్షమిస్తావు కదూ?"

ఆమె చప్పున అతని నోటికి తన చేతిని అడ్డం వుంచుతూ చెప్పింది.

"మీతో కష్టసుఖాలను పంచుకుంటానని ప్రమాణం చేస్తున్నాను. నాకు మీ అనురాగం చాలు. మీ నుంచి అంతకంటే ఏమీ కోరుకోను"

అతను క్షణం మాట్లాడలేదు. తరువాత అన్నాడు.

"నిన్నెలా అడగాలో అర్థంకావడంలేదు. అసలు నాకు నోరే రావడంలేదు" అతని స్వరం దీనంగా వుంది.

"నాకీ నెలజీతం ఇంకా అందలేదు. ఇదివ

# రచయితలకు మనవి






ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు. 75/- ద్వితీయ బహుమతి, రు. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రను మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

డిసెంబర్ చతుర నవల గడప

**సమీక్షకుని పేరు:** ..........................................................................

**చిరునామా:** ..........................................................................

..........................................................................

..........................................................................

..........................................................................

రకు మూడుగదులలో సర్దుకునే వాళ్ళం. ఇప్పుడు మనకోసం ఒక గది ఎక్స్‌ట్రాగా తీసుకోక తప్పలేదు. అంటే, మరో అయిదు వందలు అద్దె పెరిగింది. కరెంటు ఛార్జీలు పెరిగాయి. నిత్యావసర వస్తువుల ధరలు పెరిగాయి. నాన్నగారి పెన్షను, నా జీతంతో మనం అయిదుగురం ఈ నగరంలో బత కాలి. పోయిన నెల అద్దె ఇంకా ఇవ్వలేదు. నీ దగ్గర డబ్బేమైనా వుంటే..."

శ్వేత మనసు కరిగిపోయింది. "నా దగ్గర వెయ్యి రూపాయలున్నాయి. సరిపో తాయా?"

"ఎంతోకొంత ముందు నన్నీ ఆపదనుంచి గట్టెక్కించు"

శ్వేత లేచి లైటువేసి తన పెట్టెలోనుంచి డబ్బు తీసి అతనికిచ్చింది.

"థ్యాంక్ యూ!" అన్నాడతను. శ్వేత అతని పక్కనే కూర్చుంది. అతను డబ్బు తలగడ కింద పెట్టుకుంటూ అన్నాడు.

"నాకు నిద్రవస్తోంది. పడుకుంటాను. పొద్దున్నే ఆఫీసుకి పరిగెట్టాలి"

శ్వేత లైటార్పి వచ్చి అతని పక్కనే పడు కుంది. "ఈ మంచం ఇద్దరికి సరిపోదు. నువ్వు చాపవేసుకుని కింద పడుకో"

కొన్ని నిముషాలక్రిందట తమిద్దరికీ సరి పోయిన మంచం ఇప్పుడు సరిపోకపోవడ మేమిటో ఆమెకి అర్థంకాలేదు.

చాపకోసం చూసింది. గదిలో కన్పించ లేదు.

"చాప అమ్మగదిలో వుంది" చెప్పాడతను.

చెదిరిన జుట్టు, నలిగిన పువ్వులతో బయ టకి వెళ్ళడం ఇష్టంలేని ఆమె దిండు నేల మీద వేసుకుని పడుకుంది. ఆమె చెవులలో కొద్దినిముషాలక్రిందట అనురాగం నిండిన భర్త స్వరమే ప్రతిధ్వనిస్తోంది.

అతను తనపై కనబరిచిన ప్రేమ నిజమా? నటనా?

"మొదటి రాత్రికి, ఈ రాత్రికి అతని ప్రవ ర్తనలో బేధం అతనిలోని ఆత్మవిమర్శవల్ల వచ్చిందా? లేక అవసరంలోనుంచి పుట్టుకొ చ్చిందా?

మొదటిరాత్రి "మీ నాన్నగారు మన సంసారానికి నెలకో మూడువేలు సర్దగ లరా?" అని అడిగిన అతను ఈ రాత్రీ తనని డబ్బు అడిగేడు. అతను తన దగ్గర డబ్బు వుందని ఊహించి అడిగాడా? లేక తన దగ్గర డబ్బు వుందని నిర్ధారణగా తెలిసి అడిగాడా?"

ఆలోచిస్తున్న ఆమెకి అత్తగారితో తన సంభాషణ గుర్తువచ్చింది.

ఆఫీసునుంచి ఇంటికి వచ్చిన భర్త ముందుగదిలో వున్న తనని కనీసం కన్నెత్తి అయినా చూడకుండా సరాసరి లోపలకి వెళ్ళడం గుర్తువచ్చింది.

'అత్తగారు తన దగ్గర డబ్బు వుందని చెప్పి వుంటుందా. అందుకే అతనికి తన మీద ప్రేమ పుట్టుకొచ్చిందా?' ఆలోచిస్తున్న శ్వేతకి వెన్నెముకలోనుంచి చలి పుట్టుకొ చ్చింది. ఇదీ అని చెప్పలేని భయం ఆమె మనసంతా ఆక్రమించుకుంది.

★ ★ ★

పోర్టికోలో ఆగిన కారులోనుంచి పెద్ద జరీ అంచువున్న గద్వాల్ చీర ధరించి దిగిన వియ్యపురాలిని అట్టహాసంగా ఆహ్వానిం చింది త్రిపురాంబ.

"రండి, వదినగారూ! ఏమిటి, ఫోన్ చెయ్యకుండా హఠాత్తుగా వూడిపడ్డారు? కల్పనా! మీ అమ్మగారు వచ్చారు" అరిచిన ట్టుగా చెప్పింది.

లోపల ఏదో పనిలో వున్న కల్పన పరిగె త్తినట్టే వచ్చింది. తల్లిని చూడగానే ఆమె కళ్ళు మెరిసాయి.

"నాన్నగారు వచ్చారామ్మా?" అడిగింది ఆపేక్షగా తల్లిచేతిని అందుకుంటూ.

"లేదమ్మా! నేను ఒక్కర్తినే వచ్చాను. రాత్రంతా కలలో నువ్వే కనిపించావు. అందుకని నిన్ను చూడాలనిపించి వచ్చాను" అంది ఆవిడ.



"తాయారమ్మగారూ! మంచినీళ్ళు తీసుకు రండి" త్రిపురాంబ ఆదేశించింది.

మంచినీళ్ళు తాగి స్థిమితంగా సోఫాలో కూర్చుంది మహేశ్వరి. కల్పన తల్లికోసం కాఫీ కలపడానికి వంటగదిలోకి వెళ్ళింది. వియ్యపురాలికెదురుగా కూర్చున్న త్రిపురాంబ కళ్ళు ఆవిడని నిశితంగా గమనిస్తున్నాయి. ఆవిడ చెవులకి వున్న ముత్యాల దిద్దులను చూస్తూ "డైమండ్ దిద్దులేమయ్యాయి? పెట్టుకోలేదేం? " ఆరాగా అడిగింది.

"బ్యాంక్ లాకర్‌లో పెట్టేశాను. మీ అన్నయ్యగారు ఇంటిపట్టున వుండరు. లంకంత కొంపలో నేనొక్కర్తినీ వుండాలి. దొంగల భయం" చెప్పింది మహేశ్వరి.

"మీ అబ్బాయి, కోడలు కులాసాగా వున్నారా? అమెరికానుంచి ఇప్పట్లో రారా? "

"ఏమోనండీ. వాళ్ళ ఇష్టం. అయినా అమెరికా వెళ్ళిన వాళ్ళు తిరిగి ఇక్కడకి వస్తారా? అక్కడేం అయస్కాంతం వుందో తెలియదు గానీ అక్కడే అతుక్కుపోతున్నారు"

"నిజమేలెండి. మీరు, అన్నయ్యగారు వెళ్ళి సరదాగా అమెరికా అంతా చూసిరండి"

"మీ అన్నయ్యగారు ఎప్పుడూ బిజినెస్ వ్యవహారాలలో తలమునకలవుతూ వుంటారు. తీరిక ఎక్కడిది? "

చిరునవ్వుతో తనని పలుకరించిన స్రవంతిని ఆప్యాయంగా చూసి నవ్విందావిడ.

"బాగున్నావా స్రవంతీ! మా కల్పన ఎప్పుడూ నీ గురించే చెబుతూ వుంటుంది"

అతిసహజంగా నటిస్తున్న ఆవిడని మనసులోనైనా మెచ్చుకోకుండా వుండలేకపోయింది స్రవంతి.

"బాబాయ్‌గారు రాలేదాండి? "

"లేదమ్మా! ఆయన బిజీగా వున్నారు"

"వెళ్ళి వంట ఎంతవరకు అయిందో చూడు" త్రిపురాంబ స్వరంలో అసహనం తొంగిచూసింది.

అది స్రవంతి మనసుని చివుక్కుమనేలా చేసింది. ఆమె లేచి వంట గదిలోకి నడిచింది.

తాయారమ్మగారు హల్వా తయారీలో వుంది. "వంటయిపోయిందాండి? " అడిగింది.

"స్వీటు చేస్తే అయిపోయినట్టే" అందావిడ.

స్రవంతి డైనింగ్ టేబిల్‌మీద కంచాలు పెడుతుండగా అక్కడకి వచ్చింది త్రిపురాంబ.

"స్టీలు కంచాలు తీసెయ్యి. వియ్యాలవారు మన ఇంటికి వస్తే వెండి కంచాలలో భోజనం పెట్టాలని తెలియదా? " అంది ముఖం చిట్లిస్తూ.

"నాకు తెలియదండీ!" స్రవంతి తప్పుచేసిన దానిలా తలవంచుకుంది.

"తెలియకపోతే తెలుసుకో!" అంది. ఆ స్వరం అధికారికంగా వుంది.

స్రవంతికి తల తీసేసినట్టయింది. అత్తగారికి తనపై వున్న అయిష్టత అంతా ఆమె కళ్ళల్లో స్వరంలో ప్రతిఫలిస్తోంది. అది ఆమె మనసుని కోస్తోంది.

భోజనాలయ్యాక మహేశ్వరి కల్పన గదిలోకి వెళ్ళింది. ఆ వెనుకనే ఆ గది తలుపులు మూసుకుపోయాయి. చాలాసేపటి తర్వాత బయటకి వచ్చిన కల్పన ముఖం మామూలుగా లేదు.

"నేను వెళ్ళొస్తాను వదినగారూ!" అంది మహేశ్వరి.

"అదేమిటి? మీ అల్లుడు వచ్చేదాకా వుండరూ? అయినా పొద్దుట వచ్చి సాయంకాలం కాకుండానే వెళ్ళిపోడం ఏమిటి? నాలుగు రోజులు వుండండి" అంది త్రిపురాంబ.

"మరోసారి వస్తాను. వరలక్ష్మి వ్రతానికి కల్పనని మావూరికి పంపండి"

"ఏం చేయించుకున్నారు? " త్రిపురాంబ అడిగిన దానికి అర్థం 'కల్పనకి ఏం చేయిస్తున్నారు? ' అని పరోక్షంగా అడగడమే అని





తెలుసు.

"ఆరు కాసులు కొనివుంచాను. గాజులు చేయిస్తాను"

త్రిపురాంబ విప్పారిన ముఖంతో కల్పనని మురిపెంగా చూసింది. ఆమె ముఖం మామూలుగా లేకపోవడం గమనించి అంది.

"మీ అమ్మగారు వెళ్ళిపోతున్నారని బెంగ పెట్టుకున్నావా, కల్పనా! పోనీ ఆవిడతో వెళ్ళి మీ ఇంట్లో నాలుగురోజులుండిరా!"

కల్పన నవ్వి వూరుకుంది.

"నేనూ అదే అంటున్నాను. వచ్చి నాలుగురోజులుండమని" అంది మహేశ్వరి.

"తరువాత వస్తానులే" అంది కల్పన.

మహేశ్వరి ఎక్కిన కారు కదిలి ముందుకి సాగింది.

★ ★ ★

కల్పన గది తలుపులు గడియపెట్టుకుని, మంచంమీద పడుకుంది. ఆమెకి అశాంతిగా వుంది. తల్లి ఆవిడ గుండెబరువుని తీర్చుకుని, తన తలపై కొండంత బరువుపెట్టి వెళ్ళింది. ఆవిడ చెప్పిన నిజాలని జీర్ణంచేసుకోలేకపోతోందామె.

శ్రీధర్ ఇంటికి వచ్చేటప్పటికి కల్పన కటికచీకట్లో పడుకుని వుంది. వేళగానివేళలో పడుకుని వున్న భార్యని చూసి ఆదుర్దా ప్రకటించాడతను.

"ఏమయింది? ఒంట్లో బాగాలేదా? " తన పక్కన కూర్చుని అడుగుతున్న భర్తని చుట్టేసి వెక్కివెక్కి ఏడవడం మొదలుపెట్టింది.

"ఏమయింది? " అతను ఎంత అడిగినా ఆమె చెప్పలేదు.

"నీ మనసులోని బాధ ఏమిటో చెప్పనిదే నాకెలా తెలుస్తుంది చెప్పు? "

"మా నాన్నగార్కి బిజినెస్‌లో చాలా నష్టంవచ్చిందిట" ఆమె వెక్కిళ్ళమధ్య చెప్పినది విని అతను నిర్విణ్ణుడయ్యాడు.

"వున్న డబ్బంతా అప్పులు తీర్చడానికే సరిపోయిందిట. మా అమ్మ నగలన్నీ అమ్మేసారుట. ఇల్లు అమ్మేసి చిన్న ఫ్లాట్ కొనుక్కుందామనుకుంటున్నారుట. కారు అమ్మకానికి పెట్టారుట. ఇవాళే మా అమ్మ కారులో చేస్తున్న ఆఖరి ప్రయాణం" కల్పన మళ్ళీ ఏడవసాగింది.

శ్రీధర్ అసహాయంగా చూశాడు.

"ఏం చేస్తాం? వ్యాపారమంటేనే అంత. లాభం వచ్చిందా కనకవర్షం. నష్టంవస్తే తేరుకోలేని దెబ్బకొడుతుంది"

"ఈ విషయం మీ అమ్మగారికి తెలిస్తే నన్నెంత చులకనగా చూస్తారు? అసలే డబ్బుకి, హోదాకి ప్రాణమిచ్చే మనిషి"

"అవును. అయినా ఈ విషయాలన్నీ మా అమ్మకి తెలియవలసిన అవసరం ఏముంది? "

"నేను చెప్పకపోయినా ఆవిడకి ఇవాళ కాకపోయినా రేపయినా తెలుస్తుందిగా? మా అమ్మావాళ్ళు ఇంక మీదట మనకి ఘనంగా కానుకలు ఇవ్వలేరుగా? "

"ఏమిటి ఇచ్చేది? పెళ్ళయి నాలుగేళ్ళు కావస్తోంది. నేను కొత్త పెళ్ళికొడుకునా? "

"ప్రతి పండుగకి ఇచ్చేవాళ్ళు ఇప్పుడు హఠాత్తుగా ఇవ్వడం మానేస్తే ఎంత చులకన? స్రవంతిని చిన్నబుచ్చినట్టే నన్నూ చిన్నబుచ్చుతారు"

శ్రీధర్‌కి ఆమె ధోరణి చూస్తే తండ్రి ఆస్తి పోయినందుకు ఆమె బాధపడుతున్నట్టు లేదు. తనకి ఆయన కానుకలు ఇవ్వలేనందుకు, అత్తగారు తనని చులకన చేస్తుందని బాధపడుతోంది అన్పించింది. తల్లి విషయం అతనికి తెలుసు. కల్పన పుట్టింటి నుంచి ఘనమైన కానుకలు తెచ్చుకుంటోంది కాబట్టే ఆమె అంటే ఇష్టం ఆవిడకి.

అతను తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. 'ఈ సమస్యని తనే పరిష్కరించాలి. ఎలా? '

★ ★ ★

ఉదయం ఎనిమిది గంటలకి శ్వేత ఇంట్లో చిన్నచిన్న పనులవీ చేసి స్నానంచేసి పూజా

మందిరం దగ్గర కూర్చుంది.

కల్లోలిత సాగరంలా వున్న ఆమె మన సుని దైవంముందు కూర్చోగానే ఏదో తెలియని ప్రశాంతత ఆవరించుకుంది. ఆమె అక్కడవున్న వెండికుందులలో నూనెపోసి వత్తులు వేసింది. దైవానికి నమస్కరించి దీపం వెలిగించబోయిన ఆమె అత్తగారి పిలుపుతో ఉలిక్కిపడి తల తిప్పింది.

"ఆ కుందులు మా పుట్టింటివాళ్ళు నాకిచ్చినవి. నువ్వు దీపం వెలిగించుకోవాలనుకుంటే మీ అమ్మ నడిగి కుందులు తెచ్చుకో"

ఆవిడ స్వరంలో శాసనంలేదు. మంచు కన్నా చల్లని భావమేదోవుంది. అది ఆమెని పీటమీదనుంచి దిగ్గునలేచి నిలబడేలా చేసింది. స్నానం చేసి లోపలకి వస్తున్న మామగారు అన్నారు.

"పాపం! పూజచేసుకుందామని కూర్చున్న పిల్లని లేపావేమిటి రాజ్యం! ఆ అమ్మాయికి అత్తవారింటికి మొదటి సారిగా వస్తున్నప్పుడే వెండికుందులు తెచ్చుకోవాలని ఎలా తెలుస్తుంది పాపం! ఈసారి వెళ్ళినప్పుడు తెచ్చుకుంటుందిలే. ఈరోజుకి పూజచేసుకోనియ్యి"

"పోన్లే పూజ చేసుకోమ్మా" అందావిడ దయతలుస్తున్నట్టు.

శ్వేత మనసు తుఫాన్ వచ్చినప్పటి సముద్రంలా వుంది. ఆమెకి పూజ చెయ్యబుద్ధికాలేదు. పాలిష్‌డ్‌గా ఒక్కొక్క కోరికనే బయటపెడుతున్న అత్తగారు, ఓదారుస్తున్నట్టు మాట్లాడుతూనే ఆవిడ కోరికలను బలపరుస్తున్న మామగారు!

ఆమె యాంత్రికంగా అక్కడనుంచి బయటకి రాబోయింది.

రాజేశ్వరమ్మ పూజ చేసుకుంటోంది. "కృష్ణా, గోదావరీ, మధ్యప్రదేశే... అమ్మాయ్ శ్వేతా!

"ఏమిటత్తయ్యా"

"బెండకాయలు తరిగిపెట్టు"

శ్వేత నిర్లిప్తంగా ఆవిడనోసారి చూసి కత్తిపీట తెచ్చి బెండకాయలు తరగడం మొదలుపెట్టింది.

"సమస్త దేవతా ప్రీత్యర్థం... మరీ అంత చిన్న ముక్కలు తరగకు. కూర ముద్దయిపోతుంది"

ఆవిడ నోరు మంత్రాలని ఉచ్చరిస్తోంది. కళ్లు మాత్రం శ్వేతపైనే వున్నాయి.

ఆవిడని చూస్తే శ్వేతకు నవ్వొచ్చింది.

మోహన్ వంట గదిలోకి వచ్చాడు.

"అమ్మా! అన్నం పెట్టు. నేను ఇవాళ త్వరగా వెళ్లాలి"

"వస్తున్నా! అమ్మా కనకదుర్గా! చల్లగా చూడు తల్లీ"

ఆవిడ నమస్కరించి ఇవతలకి వచ్చి కంచం పెట్టింది. అప్పటికి శ్వేత కూర వేయించడం అయిపోయింది. ఆమె కూర గిన్నె తెచ్చి అన్నం గిన్నె పక్కనే పెట్టింది.

కొడుక్కి అన్నం వడ్డించి అతను తింటుంటే విసనకర్రతో విసురుతూ అంది.

"రద్దీగావున్న సిటీ బస్సులలో ఆఫీసుకి వెళ్లడానికి ఎంత అవస్థ పడుతున్నావురా? ఒక స్కూటర్ కొనుక్కోవచ్చుగా? "

"ఏం పెట్టి కొనుక్కోమంటావు? "

"అదేమిట్రా, అలాగంటావు? నీకేం లోటని! పెళ్లిలో అలకపాన్పు మీద స్కూటర్ కావాలని అడిగితే మీ మామగారు ఇవ్వలేకపోయేవాడుట్రా? అసలు ఆ మాట కొస్తే ఇప్పుడడిగితే మాత్రం ఇవ్వడా? "

శ్వేత చేతుల్లోని గరిట జారి కిందపడింది. "స్కూటరా? " ఆమె గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి.

భర్త ఏం సమాధానం చెబుతాడోనని ఆమె ఆత్రంగా ఎదురు చూస్తోంది.

"ఆషాఢం వస్తోందిగా? ఆషాఢపట్టీగా స్కూటర్ ఇమ్మందాం"

శ్వేత ముఖం వెలవెలపోయింది. తను అక్కడ వుండగానే తన తండ్రి నుంచి ఇంకా ఏ కానుకలు గుంజాలా, ఏ రకంగా




గుంజాలా అని మంతనాలు చేస్తున్న ఆ తల్లీకొడుకులని ఆమె నమ్మలేనట్టు చూస్తోంది.

"నిజమేరోయ్! ఆ మాటే మరచిపోయాను" ఆవిడ అభినందనగా అంది.

శ్వేత కళ్లలో నిండుతున్న నీటికి పరిస రాలు అలుక్కుపోతున్నట్టు కన్పిస్తున్నాయి. ఆమె గదిలోకి వెళ్లిపోయింది. పెళ్లయి పట్టు మని పది రోజులు కాలేదు. తను కాపురానికి వచ్చి రెండు రోజులు పూర్తికాలేదు. అత్తమామల నిజస్వరూపాలు బయటపడి పోయినందుకు ఆమెకి ఆశ్చర్యంగా వుంది. అంతకుమించి బాధగా వుంది. క్రిందటి రోజు అత్తగారు పెళ్లయిన కొత్తలోనే నీ అవసరాలకి భర్త ముందు చెయ్యి జాపకు అని తల్లి తెచ్చిన స్వీట్లు అమ్మిన డబ్బు తన కివ్వబోవడం కేవలం తన దగ్గర డబ్బు వుందో లేదో తెలుసుకోవడంకోసమే. ఆవిడ కనబరిచిన మంచితనం నటన అని తెలుసు కోలేని తను తన దగ్గర వెయ్యి రూపాయ లున్నాయని చెప్పింది. ఆ డబ్బు తన దగ్గ రున్న విషయాన్ని తల్లిద్వారా తెలుసుకున్న అతను తన దగ్గరనుంచి ఆ డబ్బు తీసుకో వడం కోసమే తనపై ఇష్టాన్ని, ప్రేమని నటించాడు.

శ్వేత తల తిరిగిపోతుండగా మంచం మీద కూలబడింది.

మోహన్ గదిలోకి వచ్చి షర్టు వేసుకు న్నాడు. ఆమె తెచ్చిపెట్టుకున్న నవ్వుతో అతన్ని చూస్తూ అడిగింది.

"సాయంకాలం ఆఫీసునుంచి త్వరగా వస్తారా? "

అతను జవాబివ్వకుండా ముందు గది లోకి వెళ్లాడు. రాజేశ్వరమ్మ వీధి గడప దగ్గర నిలబడివుంది.

అతను భార్యవైపు చూడకుండా తల్లితో చెప్పాడు.

"నేను ఆఫీసుకి వెళ్లొస్తానమ్మా"

"మంచిది నాయనా!" అందావిడ:

శ్వేత మనసు ఆశాభంగంతో గాయపడింది.

★ ★ ★

"హాయ్ అమ్మమ్మా!" వర్ష వస్తూనే త్రిపురాంబని కౌగలించుకుంది.

"కళ్లు కాయలు కాసేయే తల్లీ! ఎన్నాళ్లయింది నిన్ను చూసి? ఇంత చిక్కిపోయావేమిటమ్మా" ఆవిడ మనుమరాలి బుగ్గలు పుణికి ముద్దు పెట్టుకుంటూ అంది.

"నా వయసు అమ్మాయిలు లావుగా వుంటే ఏం బాగుంటుందమ్మమ్మా? మా కాలేజీలో లావుగావున్న అమ్మాయిలకి అబ్బాయిలు రకరకాల పేర్లుపెట్టి ఏడిపిస్తారు తెలుసా? "

"నిన్నూ ఏడిపిస్తారేమిటే? "

"ఏడిపించరుగానీ వాళ్లతో ఫ్రెండ్‌షిప్ చెయ్యాలని ఏడుస్తారు"

"నిజమే" ఆశ్చర్యంగా అడిగింది త్రిపురాంబ.

"నిజం అమ్మమ్మా! నా క్లాసుమేటు ఒకబ్బాయి నాకోసం చావడానికి సిద్ధమయ్యాడు తెలుసా? "

"ఏమిటీ"

వర్ష చెప్పసాగింది. "కిషోర్ అని మన ఆంధ్రా అబ్బాయే. ఏదో క్లాసుమేట్ కదా అని నాలుగుసార్లు మాట్లాడాను. అంతే! నేను వాడిని ప్రేమిస్తున్నాననుకుని తెగ రెచ్చిపోయాడు. నాకు వాడిని కాస్త ఏడిపించబుద్ధేసింది. ఐలవ్‌యూ అన్నానోసారి! అంతే గురుడు గాలిలో తేలిపోయాడు. నా చుట్టూ తిరగడం మొదలుపెట్టాడు. ఫ్లవర్ బొకేలు, గిఫ్ట్‌లు, గ్రీటింగ్ కార్డ్లు తెగ డబ్బు తగలేశాడు. పరీక్షలు మొదలవబోతుండగా అడిగాడు. 'నీ ఫ్యూచర్ ప్లానేమిటి వర్షా? మనం ఎప్పుడు పెళ్లి చేసుకుందాం' అని. 'పెళ్లా? నిన్నా? అద్దంలో నీ మొహం ఎప్పుడైనా చూసుకున్నావా? ' అనడిగేను. నేనిచ్చిన షాక్‌తో నిద్ర మాత్రలు మింగాడు..."

"చచ్చిపోయాడా? "

"లేదులే. సమయానికి వాడి ఫ్రెండ్స్ చూసి హాస్పిటల్‌లో పడేశారు గనుక బతికి పోయాడు"

వర్ష నవ్వుతోంది.

"అసలు వాడికి నా కాళ్ల దగ్గర నిలబడే తాహతు కూడా లేదమ్మమ్మా! వాళ్ల నాన్న బ్యాంకులో గుమాస్తాట. వీడేదో తనని ఉద్ధరిస్తాడని అప్పుచేసి మరీ వీడిని చదివిస్తున్నాడుట. జీతం రాళ్లతో బతికే ఒక గుమాస్తా కొడుకు కనీసం ఒక స్కూటరైనా మెయింటైన్ చెయ్యలేని వాడికి నన్ను పెళ్లి చేసుకోవాలని ఆశ! నిన్ను నేను పెళ్లి చేసుకోనని చెప్పినప్పుడు వాడి మొహం చూడాలి"

వర్ష నవ్వుతోంటే అదేదో పెద్ద జోక్ అన్నట్టు త్రిపురాంబ, కల్పన, వరలక్ష్మి కూడా నవ్వడం స్రవంతిని ఆశ్చర్యపరిచింది. ఒక అమాయకుడైన యువకుడు అహంకారి అయిన ఆడపిల్లని ప్రేమించి ఆమె కూడా తనని ప్రేమిస్తోందని భ్రమపడి, ఆమె తనని ప్రేమించడం లేదని తెలుసుకుని విరక్తితో ఆత్మహత్య చేసుకోబోవడం వీళ్లకి జోక్‌లా వుందా?

"నీకేం తక్కువ? ఇంజనీరింగ్ చదివిన అమ్మాయివి. మీ నాన్న ఆస్తికి ఒక్కగానొక్క వారసురాలివి. ఏ రాజకుమారుడో నిన్ను వెతుక్కుంటూ వస్తాడు" అంది త్రిపురాంబ మురిపెంగా మనుమరాలిని చూస్తూ.

కాఫీ కప్పులున్న ట్రేని టీపాయ్‌పై పెడుతున్న స్రవంతిని చూసి ఎవరన్నట్టు కళ్లెగరేసింది వర్ష తల్లివైపు చూస్తూ.

"రవి భార్య స్రవంతి" చెప్పింది వరలక్ష్మి.

"ఓ! నువ్వేనా స్రవంతివి? మా రవి మామయ్య నిన్ను ఏరికోరి పెళ్లి చేసుకున్నాడంటే ఏ దేవకన్యలాగో వుంటావనుకున్నాను. ఏవరేజ్‌గా వున్నావు" అంది ఆమెని నఖశిఖపర్యంతం పరీక్షగా చూస్తూ.

రూపురేఖలలోనే కాదు అహంలో, గర్వంలో కూడా ముమ్మూర్తులా తల్లి పోలికలతో వున్న వర్షని ఒకసారి నిర్లిప్తంగా చూసి లోపలికి వెళ్లిపోయింది స్రవంతి.

"మామయ్య ఈ అమ్మాయిని చేసుకుంటానంటే మాత్రం నువ్వెలా ఒప్పుకున్నావే అమ్మమ్మా" అని వర్ష అడగడం, సమాధానంగా త్రిపురాంబ "నుదుటి రాతని ఎవరు తప్పించగలరమ్మా" అని నిట్టూర్చడం వినిపించింది ఆమెకి.

★ ★ ★

స్రవంతి మనసంతా శూన్యంగా వుంది. తన పెళ్లయి రెండు నెలలు. ఈ రెండు నెలల్లోనూ మరచిపోలేని మధురానుభూతులు, హృదయాన్ని స్పర్శించే జ్ఞాపకాలూ లేవు.

ఆమె కిటికీ దగ్గర నిలబడి భర్త కోసం ఎదురు చూస్తోంది. కొత్తలో అతనికోసం ఎదురు చూడడంలో ఆనందం పొందేది. కిటికీ దగ్గర నిలబడి చిరపరిచితమైన అతని పదధ్వని కోసం ఒళ్లంతా చెవులు చేసుకుని నిరీక్షించడం, అతను సడి చెయ్యకుండా వచ్చి తనని వెనుక నుంచి కౌగిలిలో బంధించి తన చెవిలో ముద్దు పెట్టుకున్న క్షణంలో మనసు పులకించేది. తనువు అతని చేతులలో తంత్రులు మీటిన వీణ అయ్యేది. తను అతనికోసం ఎంతగా ఎదురు చూస్తోందో అతను కూడా తన కోసం అంతగా తపించిపోతున్నాడనే భావనే ఆనందాన్నిచ్చేది. రోజులు గడుస్తున్న కొద్దీ ఆ ఎదురుచూపులో ఆనందానికి బదులు యాంత్రికత చోటు చేసుకుంది. పెళ్లయిన రెండు నెలలకే తమ మధ్య యాంత్రికత చోటుచేసుకోవడం ఎంత దురదృష్టం? ఆమె చెవులు అప్రయత్నంగానే కారు హారన్ కోసం ఎదురు చూడసాగాయి. పోర్టికోలోకి కారు వచ్చి ఆగింది. అది శ్రీధర్ కారు. మళ్లీ ఆలోచనలు. అత్తగారు ఆ ఉదయం అన్యాపదేశంగా చేసిన హెచ్చరిక గుర్తు వస్తోంది.

ఆ ఉదయం అందరూ బ్రేక్‌ఫాస్ట్ తింటూండగా అంది త్రిపురాంబ.




"నిన్న రాత్రి శాస్త్రిగారు వచ్చారురా!"

"ఏ శాస్త్రిగారు? జాతకాలు చూసే శాస్త్రిగారేనా? " అడిగాడు శ్రీధర్.

"అవును. మీ ఇద్దరి జాతకాలు చూపించాను. నీ జాతకం బాగానే వుంది. రవి జాతకానికే దోషం వుందిట. నవరత్నాల వుంగరం చేయించి కుడిచేతి వుంగరం వేలికి పెట్టుకోమన్నారు"

"పదివేలు పెడితే నవరత్నాల వుంగరం వస్తుంది కదమ్మా! రేపే ఆర్డరిద్దాం" అన్నాడు రవి.

"తప్పుతుందా మరి? శ్రీధర్‌కైతే వాళ్ల మామగారు కొనిచ్చారు. నీకు నేనే కొనాలి" అందావిడ నిట్టూరుస్తూ.

జగ్గులోనుంచి అందరి గ్లాసులలోకి మంచినీళ్లు వంచుతున్న స్రవంతి ముఖం వెలవెల పోయింది. అత్తగారి స్వరంలో తన తండ్రి అల్లుడికి వుంగరాన్ని కూడా చేయించలేని అసమర్థుడనే భావాన్ని స్పష్టంగా చదవగలిగింది. ఆమె మనసుని వేదన మెలిదిప్పుతోంది.

తనని ఈ ఇంట్లో మనిషిగా ఎవరూ గుర్తించరు. తను కట్నకానుకలు తేలేదని అత్తగారికి తనపై చిన్నచూపు. ఆవిడ చేతిలోని త్రాసు కల్పన వైపే మొగ్గుతున్న విషయాన్ని తను గుర్తించకపోలేదు. ప్రతి చిన్న విషయంలోను తన ఎదురుగా కల్పనని పొగడడం చూస్తే ఆమెలోని ఆత్మన్యూనతా భావం రోజురోజుకీ పెరిగిపోతోంది. తను ఏ విషయంలో చూసినా కల్పనకంటే తక్కువ స్థితిలోనే వుందనే విషయం తనకి తెలుసు. కాని ఆ విషయాన్ని మరొకరు ఎత్తి చూపిస్తే కలిగే బాధ అది. ఏ పని చేస్తున్నా రెండు కళ్లు చులకన భావంతో తననే గుచ్చిగుచ్చి చూస్తున్న ఫీలింగ్ దానితో తడబడి ఏ పని చేసినా ఏదో ఒక పొరపాటు చెయ్యడం.

స్రవంతి కన్నీళ్లు తుడుచుకుంది. అత్తగారు తన తండ్రి లేమిని ఎత్తిచూపడం ఆమెకి బాధగా ఉంది. తను సుఖపడుతుందనే ఆశతో గొప్ప సంబంధం తనని వెదుక్కుంటూ వచ్చిందనే సంతోషంతో వున్నంతలో ఘనంగా తన పెళ్లి జరిపించిన తండ్రి గుర్తుకొస్తున్నాడు.

వెనుక అడుగుల చప్పుడయింది. ఆమె వెను తిరిగి చూసింది. రవి... అతని ముఖంలో అలసట స్పష్టంగా కనబడుతోంది.

"ఇవాళ ఆలస్యంగా వచ్చారేం? పని ఎక్కువగా వుందా? " చిరునవ్వుతో అడిగింది.

"అవును" అన్నాడతను బట్టలు మార్చుకుని టవల్ కట్టుకుంటూ.

స్రవంతి అతను విడిచిన బట్టలని కిందకి తీసుకెళ్లి ఉతికే బట్టల దగ్గరవేసి వచ్చింది.

డైనింగ్ టేబిల్ తుడుస్తున్న తాయారమ్మగారు "మీరు అన్నం తినరా స్రవంతి గారూ? " అనడిగింది.

"ఆయన స్నానం చేస్తున్నారు. రాగానే వస్తాను" అంది.

"రవిగారు భోజనం చేసేశారు. ఇంక మీరూ నేనే మిగిలాం. రండి మీరు తినేస్తే మిగిలినవన్నీ సర్దుకుని ఇంటికెళ్తాను"

"మీరు తినేసి మిగిలినవన్నీ సర్దేయ్యండి" అంది స్రవంతి ఫ్రిజ్‌లో నుంచి మంచినీళ్ల బాటిల్ తీసుకుంటూ.

ఆమెకి ఆ కుటుంబంలో నచ్చనిది మరొకటి. ఆ కుటుంబ సభ్యులంతా కలిసి భోజనం చెయ్యరు. ఎవరూ బయటనుంచి వచ్చేవాళ్లకోసం ఆగరు. ఎవరికి ఆకలేస్తే వాళ్లు తినెయ్యడమే. ఆమెకి తన పుట్టిల్లు గుర్తుకొచ్చింది. అందరూ కలిసే భోజనం చేస్తారు. తల్లి ఎవరికి ఏం కావాలో కనుక్కుంటూ కొసరికొసరి వడ్డిస్తుంది. తమకి ఐశ్వర్యం లేకపోవచ్చు కాని అందరినీ కట్టిపడేసే ఆప్యాయతానురాగాలు వున్నాయి.

ఆమెపైకి వచ్చింది. రవి స్నానం ముగించి వచ్చి అద్దం ముందు జుట్టు దువ్వుకుంటు

న్నాడు.

"భోజనం చేద్దాం రండి" పిలిచింది ఏమీ ఎరగనట్టు.

"నా భోజనం అయింది. నువ్వు తినిరా" అన్నాడతను.

"ఒక్కర్తినీ ఎలా తినను"

"తాయారమ్మగారు వుందిగా? ఆవిడతో కలిసి తిను"

అతి మామూలుగా చెబుతున్న అతన్ని దిగ్భ్రమగా చూసింది ఒక క్షణం. మరుని ముషం ఆమె ముఖం పాలిపోయింది.

మరుక్షణం నవ్వు తెచ్చిపెట్టుకుంటూ అంది.

"అదికాదు... పోనీ మీరు నాకు కంపెనీ ఇవ్వచ్చుగా? "

"నేనా? బాగా అలసిపోయాను. ఒక్క అడుగు వేసే ఓపిక కూడా లేదు. నువ్వు వెళ్లి తినేసిరా" అన్నాడు పడుకుంటూ. ఒక క్షణం అతనివైపు చూసి గది తలుపులు వేసి మంచినీళ్లు తాగి వచ్చి తనూ పడుకుంది.

దిగ్గున లేచి కూర్చుంటూ అన్నాడతను, "ఏమిటిది, చిన్నపిల్లలా? వెళ్లి అన్నం తినచ్చుగా? బాగా ఆకలనిపించి ఇంట్లోకి వస్తూనే అన్నం తినేశాను. అయినా నువ్వు నాకోసం ఆగడమెందుకు? ముందే తినేసి నాకు అన్నం వడ్డించవచ్చుగా? " అన్నాడు విసుగ్గా.

"ఇప్పుడేమయిందని? నాకు తినాలని లేదు. మీరు నన్ను భోజనానికి పిలవలేదని నాకేమీ కోపంలేదు" అంది నవ్వేస్తూ.

"నీ ఇష్టం! నీకు తినాలని లేకపోతే నేనేం చెయ్యను. అతను గోడవైపు తిరిగి పడుకున్నాడు. కొన్ని క్షణాల తర్వాత అతను గాఢ నిద్రలో మునిగిపోయాడనడానికి సూచనగా అతని గురక వినిపించింది.

స్రవంతికి భర్త తత్వమేమిటో అర్థం కావడంలేదు. తను లేకపోతే ఫ్యాక్టరీ మూతపడుతుందన్నట్టు మాట్లాడతాడు. ఈ రెండు నెలల్లోనూ అతను ఏ రాత్రీ పదకొండు గంటలు దాటితేగాని ఇంటికి రాలేదు. అయిదు నిముషాలు "అవసరం" కోసం మేల్కొని వుండడం, తరువాత గాఢనిద్రలో మునిగిపోవడం. తెల్లవారి లేచిన దగ్గర నుంచి ఒకటే ఉరుకులు, పరుగులు. స్రవంతి పక్కకి తిరిగి చూసింది. అతను ప్రశాంతంగా నిద్రపోతున్నాడు. చెయ్యి జాస్తే అందేంత దూరంలో వున్నా అతనికి, తనకి మధ్య ఎన్నో యోజనాల దూరం వున్నట్టనిపిస్తోంది. ఆమె అశాంతిగా కళ్లు మూసుకుంది.



శ్వేత డాబా మీద బట్టలు ఆరేస్తోంది. ఆ ఇంటి యజమానురాలు వర్ధనమ్మ కూడా బట్టలు ఆరవెయ్యడానికి అప్పుడే డాబామీదకి వచ్చింది.

శ్వేత ఆవిడని చూసి పలుకరింపుగా నవ్వింది. ఆవిడ వాత్సల్యంగా ఆమెవైపు చూసి, "మీ అత్తగారేం చేస్తోంది? " అనడిగింది.

"వంట చేస్తున్నారు" అంది శ్వేత.

వర్ధనమ్మగారు అటు, ఇటు చూసి గొంతు తగ్గించింది.

"మీ అత్తగారు నిన్ను బాగానే చూసుకుంటోందా? " శ్వేతకి ఆవిడ ఎందుకలా అడుగు

తోందో అర్ధంకాలేదు. పొరుగింటి కలహం వినవేడుక అని కొంతమందికి పొరుగింటి వాళ్ళ గొడవలు వినడానికి ఇంపుగా వుంటాయి. తను నోరుజారితే కొంపలంటు కునే ప్రమాదం వుంది.

"మా అత్తగారు చాలా మంచివారు. నన్ను తల్లిలా చూసుకుంటారు పిన్ని గారూ? " అంది.

"తల్లిలాగానా, సవతి తల్లిలాగానా? " ఆవిడ వ్యంగ్యంగా నవ్వింది.

"ఆవిడ నిన్ను ఎంత బాగా చూస్తున్నదీ నాకు తెలుసమ్మాయ్! నువ్వు కథ చెప్తే విన డానికి నేను చిన్నపిల్లని కాను"

శ్వేత ముఖం ఎర్రబడింది. ఆమె తల తిప్పుకుని త్వరత్వరగా బట్టలు ఆరెయ్యడం మొదలుపెట్టింది.

"ఆవిడ సంగతి వదిలెయ్యి. మీ ఆయనో? " శ్వేత ఆవిడని చురుగ్గా చూసి తల తిప్పుకుంది.

"మా ఆయనకి నేనంటే ప్రాణం. ఆయన నన్ను ప్రేమించినంతగా లోకంలో ఏ భర్తా ఏ భార్యనీ ప్రేమించి వుండడు... అని చెబు తావు. నాకు తెలుసు. కానీ ఇష్టంలేనిదే ప్రేమ ఎలా పుడుతుందే వెర్రిదానా? "

"అంటే? " శ్వేత భ్రుకుటి ముడిపడింది. వర్ధనమ్మ గొంతు మరింత తగ్గించింది.

"మీ ఆయనకి నిన్ను పెళ్ళి చేసుకోవడం అసలు ఇష్టంలేదు. మీ అత్త బలవంతాన పెళ్ళికి ఒప్పించింది"

శ్వేత గుండె వేగంగా కొట్టుకుంటోంది. "నిజమా? " అప్రయత్నంగా అడిగింది.

"నేనెందుకు అబద్ధం చెబుతానమ్మా? మీరు వుంటున్న వాటాకి, మా వాటాకి మధ్య గోడేకదా అడ్డం? గోడకి చెవులు వుంటాయని మరచిపోయిన మీ అత్తగారు కొడుక్కి నిన్ను పెళ్ళి చేసుకోవడం వలన వచ్చే లాభాలను వివరించింది. అవన్నీ చెవు లారా నేను విన్నాను"

శ్వేత తల తిరిగిపోతోంది. "తనని మోహన్ పెళ్ళిచేసుకోవడం వెనుక స్వార్థం వుందని భర్త, అత్తమామల మాటలు, ప్రవ ర్తన వల్ల అర్థమవుతూనే వున్నా అవన్నీ నిజాలనే నిజాన్ని మూడోవ్యక్తి ద్వారా విన్న ఆమె జీర్ణంచేసుకోలేకపోతోంది.

"నువ్వు నల్లగా వున్నావని నచ్చలేదని కొడుకు చెప్పినా, ఆరు నెలల కిందట మీ సంబంధాన్ని కాదనుకున్న మీ అత్త మళ్ళీ తనంతట తానుగా మీ సంబంధం కోసం ఎందుకు వచ్చిందో తెలుసా? "

శ్వేత సాధ్యమైనంత మామూలుగా వుండ డానికి ప్రయత్నిస్తూ అంది "తెలియదండీ"

"మీ నాన్నగారికి నువ్వు, మీ అక్క ఇద్దరే ఆడపిల్లలు కావడం వలన ఆయన ఆస్తి అంతా మీకే చెందుతుందని ఆవిడ ఆశ. అందుకే కొడుకుని నీతో పెళ్ళికి ఒప్పించింది. మీ ఆయనే కాదు మీ అత్తగారు, మామ గారు కూడా వట్టి డబ్బు మనుషులు. డబ్బు కోసం ఎంతకైనా తెగించగలరు. అదేదో సినిమాలో చెప్పినట్టు అత్తలు వెలిగిస్తే పేలని గ్యాస్ స్టవ్‌లు కోడళ్ళు వెలిగిస్తే పేలి పోతాయి. వాళ్లతో జాగ్రత్తగా మసలుకో! నువ్వు నా బిడ్డలాంటి దానివని ఇవన్నీ చెబుతున్నాను" ఆవిడ ఖాళీ బకెట్టుతో కిందకి వెళ్ళిపోయింది.

శ్వేత బట్టలు ఆరెయ్యడం మరచిపోయి అలాగే నిలబడిపోయింది.

"వర్ధనమ్మగారు చెప్పినట్టు వీళ్లు తన ప్రాణం తియ్యరు. అనుక్షణం మాటలతో హింసిస్తారు. అన్నింటికంటే దారుణమైన విషయం తన కెదురుగానే తన తండ్రి నుంచి ఇంకా ఏ కానుకలు గుంజాలా అని మంతనాలాడతారు. మోహన్ తన మెడలో తాళికట్టలేదు. తన తండ్రి ఇచ్చిన డబ్బు మూటకి తాళి కట్టాడు. రెండు మనసులని కలిపి, రెండు జీవితాలని ముడివేసేదే వివా హబంధం అని, అది డబ్బుతో నిలబెట్టుకు నేది కాదని వీళ్ళకి ఎలా చెప్పాలి? అసలు ఎప్పటికైనా ఈ మనుషులలో మార్పు

వస్తుందా?'

ఆమె కళ్లలో నీళ్లూరుతున్నాయి.

★ ★ ★

శ్రీధర్ గదిలోకి వస్తూనే బ్రీఫ్‌కేస్ తీసి కొంత డబ్బు కల్పనకిచ్చాడు "ఇది జాగ్రత్త పెట్టు"

"మీ అమ్మగారికివ్వలేకపోయారా?"

"ఇది మన డబ్బు. అమ్మకెందుకిస్తాను"

"మనదా?" ఆమెకి అతను చెప్పేది అర్థం కాలేదు.

"అవును" అంటూ అతను ఆ డబ్బు ఎలా వచ్చిందో చెప్పాడు. ఆమె ఆనందాతిరేకంతో అతన్ని ముద్దు పెట్టుకుంటూ అంది.

"మీరెంత మంచివారండీ!"

అతను గర్వంగా నవ్వేడు. "ఇది ఆరంభం మాత్రమే. ఇంకా మనకి బోలెడు డబ్బు వస్తుంది"

ఆ రాత్రి కల్పనకి హఠాత్తుగా గుర్తువచ్చింది. తల్లి ఇక్కడికి వచ్చినప్పుడు తనకి గాజులు చేయిస్తున్నానని అత్తగారితో చెప్పిన విషయం. ప్రస్తుత పరిస్థితులలో ఆవిడ తనకి కానుకలిచ్చే స్థాయిలో లేదు. 'భర్త రహస్యంగా తనకి ఇచ్చిన డబ్బుతో గాజులు కొనుక్కుని తన తల్లి చేయించిందని అత్తగారితో చెప్తే?' అలా చేస్తేగాని ఆవిడ ముందు తన పరువు నిలబడదు.

తనకి వచ్చిన ఆలోచనని వెంటనే భర్తతో చెప్పింది.

"నేను నీకు డబ్బు ఇచ్చింది నువ్వలా చెయ్యాలనే కదా! ఈ డబ్బు వరంగల్ పంపి మీ అమ్మగారిచేత గాజులు చేయించి... ఇవన్నీ ఎందుకు? ఎవరికీ తెలియకుండా ఇక్కడే కొనుక్కుని శ్రావణ మాసానికి అక్కడకి వెళ్ళినప్పుడు పట్టుకెళ్ళు"

కల్పనకి గర్వంగా వుంది. "తన ఆలోచనలని సమర్థించే భర్త దొరికాడు. తను అదృష్టవంతురాలు!" అనుకుంది.

★ ★ ★

ఆషాఢ మాసానికి శ్వేతని పుట్టింటికి తీసుకెళ్ళమని వియ్యంకుడు రాసిన ఉత్తరాన్ని అందుకున్నాడు రఘురామయ్య. రెండు రోజుల తరువాత మంచిరోజు చూసుకుని విజయవాడ వచ్చాడు. ఆయనకి కూతుర్ని చూస్తే ఆమె కాపురం సజావుగా లేదేమో అనే అనుమానం వచ్చింది. కళ్లు లోతుకు పోయి చిక్కి సగమైపోయిన కూతుర్ని చూసేప్పటికి ఆయన కళ్లలో నీళ్లూరాయి.

"అదేమిటమ్మా, బొత్తిగా పాడయిపోయావ్?" ఆప్యాయంగా అడిగాడు.

"ఏంలేదు నాన్నా! విజయవాడలో ఎండలు ఎక్కువకదా?" అంది శ్వేత నవ్వుతూ. ఎందుకోగాని అది తెచ్చిపెట్టుకున్న నవ్వుగానే తోచిందాయనకి.

శ్వేత రాజమండ్రి వచ్చిన రెండోరోజు రాత్రి నిద్రపట్టక గదిలోనుంచి బయటకి వచ్చిన జానకమ్మ వరండాలో కూర్చునివున్న కూతురిని చూసి ఆశ్చర్యపోయింది. ఆమె దగ్గరగా వచ్చి భుజంపై చెయ్యి వేసింది. శ్వేత ఉలిక్కిపడి తల్లివైపు చూసింది. వీధిలో వెలుగుతున్న ఫ్లోరోసెంటు దీపపు వెలుతురులో ఆమె చెంపలమీద కన్నీళ్లని చూసి ఆవిడ ఆదుర్దాగా కూతుర్ని పొదివి పట్టుకుంటూ అడిగింది.

"ఏమయిందమ్మా, ఎందుకేడుస్తున్నావ్?"

శ్వేత చప్పున కన్నీళ్లు తుడుచుకుంటూ సిగ్గుపడుతున్నట్టుగా తలదించుకుని అంది.

"ఏంలేదమ్మా? ఆయనని వదిలివచ్చాను కదూ? అందుకే"

కూతుర్ని మురిపెంగా చూస్తూ అందావిడ. "ఇంకెంత? నెలరోజులలో మీ ఆయన దగ్గరకి వెళ్ళిపోదువుగానిలే"

తను చెప్పిన అబద్ధాన్ని తల్లి నమ్మినందుకు రిలీఫ్‌గా ఊపిరి పీల్చుకుని "పడుకుంటానమ్మా! నిద్ర వస్తోంది" అని గదిలోకి వెళ్ళిపోయింది.

జానకమ్మకి తన పెళ్ళయిన తొలిరోజులు




గుర్తువచ్చి మధురమైన మందహాసం పెద వులపై నర్తిస్తుండగా గదిలోకి వచ్చింది. అప్పుడే రఘురామయ్య మంచినీళ్ళ కోసం లేచాడు.

"నువ్వు నిద్రపోలేదా జానకీ!"

"ఇప్పుడే లేచాను" అని ఆవిడ భర్తకి మంచినీళ్లిస్తూ రహస్యంలా చెప్పింది.

"అల్లుడిని విడిచి ఉండలేక బెంగతో పాపం అమ్మాయి కన్నీళ్లు పెట్టుకుంటోం దండీ. కొత్తగా పెళ్లయినవాళ్లు ఒకచోట ఉండకుండా ఈ ఆషాఢం పీడ ఒకటి" అంది నవ్వుతూ.

రఘురామయ్య భృకుటి ముడిపడింది. "శ్వేత ఏడుస్తోందా? ఎందుకు ఏడు స్తోంది? కారణం నువ్వు దాన్ని అడిగావా? లేక వాళ్లాయన్ని విడిచి ఉండలేక అని ఊహించుకున్నావా? "

"అడిగాను. అదే చెప్పింది"

"అత్తవారింటినుంచి పుట్టింటికి వచ్చిన ఆడపిల్ల అర్ధరాత్రి లేచి కూర్చుని ఏడవడా నికి భర్త విరహం కారణం కాదు జానకీ! ఏదో జరుగుతోంది. శ్వేత దాస్తోంది"

"అంటే" ఆవిడ ముఖంలో నవ్వు ఎగిరి పోయింది.

"నాకెందుకో అది అత్తవారింట్లో సుఖంగా లేదనిపిస్తోంది."

జానకమ్మ కళ్లు వెడల్పయ్యాయి. ఆవిడకి శ్వేతని తను మొదటిసారి అత్తవారింట్లో దింపినప్పటి వియ్యాలవారి ప్రవర్తన గుర్తుకు వస్తోంది. తను సారెలో తెచ్చిన స్వీట్లు చాలవని ఆవిడ ముఖం గంటు పెట్టుకోవడం, తను అయిదు వందలు తీసి వ్వగానే ఆవిడ నిస్సంకోచంగా ఆ డబ్బు తీసుకోవడం గుర్తుకువచ్చింది. కట్నం చాల లేదని, కానుకలు తెమ్మని వాళ్లు శ్వేతని వేధించడం లేదుకదా! ఆవిడ కళ్లల్లో నీళ్లూ రాయి.

"నా భయం కేవలం ఊహే అయితే ఫర్వాలేదు జానకీ! అది నిజం కాకూడదనే ఆశిద్దాం"

జానకమ్మకి నిద్ర పట్టడంలేదు. భర్త మాటలతో ఆవిడ గుండెల్లో పుట్టిన భయం ఇంతై అంతై అన్నట్టు క్షణాలలో పెరిగిపో యింది.

తెల్లవారి జానకమ్మ యాంత్రికంగా ఇంటి పనులు చేసుకుంటోంది. ఆవిడ మనసులో రాత్రి భర్త అన్న మాటలు బలంగా నాటు కుపోయాయి. శ్వేత నిజంగానే అత్తవా రింట్లో సుఖంగా లేదేమో అన్పిస్తోంది. రఘురామయ్యకి ఎప్పుడూ నవ్వుతూ, హుషారుగా తిరిగే కూతురు ఒకచోట స్తబ్దంగా కూర్చుండిపోవడం చూస్తే వెలితిగా వుంది. ఆయనలో కలిగిన అనుమానం పెనుభూతంలా పెరిగి భయపెడుతోంది. ఆయన ఎంత పరధ్యాసగా వున్నాడంటే కాఫీ చల్లారిపోవడం కూడా గమనించలేదు. ఏదో పనిమీద అటుగా వచ్చిన జానకమ్మ భర్త పక్కన తను పెట్టిన కాఫీగ్లాసు అలాగే వుండడం గమనించి, "మీరింకా కాఫీ తాగనే లేదా? చల్లారిపోయింది. వేడిచేసి తెస్తానుం డండి" అని కాఫీ గ్లాసుతో లోపలకి వెళ్ళింది. శ్వేత పెరటి వరండాలో కూర్చుని వుంది.

ఆవిడ కూతుర్ని పలుకరించే ప్రయత్న మేమీ చెయ్యకుండా వేడిచేసిన కాఫీ గ్లాసులో పోసి భర్తకిస్తూ అంది.

"శ్వేతని చూస్తే నాకు భయంగా వుందండీ. ఎలాంటి పిల్ల ఎలా అయిపో యింది? " ఆ మాటలంటున్నప్పుడు ఆవిడ గొంతు వణికింది.

"దాన్ని పిలిచి అడగనా? "

"అడిగి చూడండి"

ఆయన కూతుర్ని పిలిచారు. పరధ్యాసగా వున్న ఆమె పలకలేదు. మరో రెండుసార్లు పిలిచాక ఆమె వాస్తవానికి వచ్చింది.

"ఏమిటి నాన్నగారూ? "

"నిన్నొక విషయం అడగనా అమ్మా? "

"అడగండి"

"నువ్వు అక్కడ... అదే మీ అత్తవారింట్లో సుఖంగా వున్నావా?"

తండ్రి అలా అడగగానే ఆమె ఓ క్షణం ఏం జవాబివ్వాలో తెలియనట్టు చూసింది. అంతలోనే నవ్వేస్తూ అంది.

"అదేమిటి నాన్నా మీకెందుకొచ్చిందా అనుమానం?"

"నిన్ను చూస్తుంటే నాకలా అనిపిస్తోం దమ్మా!"

"అదేంలేదు నాన్నగారూ! ఏమైనా బాధ లుంటే మీతో కాకుండా ఇంకెవరితో చెబు తాను?" శ్వేత ఉత్సాహాన్ని నటిస్తూ ఏవేవో కబుర్లు చెప్పసాగింది.

"ఆయనకి నేనంటే ప్రాణం! మా అత్త గారు నన్ను కన్నకూతురిలా చూసుకుం టారు. మామగారైతే సరేసరి"

రఘురామయ్యలోని ఆందోళన మటుమా యమై ఏదో తెలియని రిలీఫ్ కలిగింది.

"హమ్మయ్య! ఎంత భయపడ్డాడు? అయినా వాళ్ళు మాత్రం రాక్షసులా ఏమిటి? కోరి శ్వేతని కోడలిగా చేసుకున్నది బాధపెట్టడానికా?" కూతురి కాపురాన్ని గురించి ఆయన పడ్డ బెంగ అంతా చిత్రంగా మటుమాయమైపోయింది. జానక మ్మలోనూ అదే ఫీలింగ్.

"కూరలయిపోయాయి. వెళ్ళి తెస్తారా?"

"ఆc! వెళ్తున్నాను. శ్వేతకి గుత్తొంకాయ కూరంటే ఇష్టం. మంచి వంకాయలు తెస్తాను. చెయ్యి" ఆయన క్షణాలలో స్నానం ముగించి సంచీ తీసుకుని మార్కె ట్టుకి వెళ్ళారు.

ఆరోజు శనివారం అని గుర్తువచ్చి శ్వేత తలస్నానం చేసింది. పెరట్లో పూలుకోసి దేముడి దగ్గర పెట్టింది. దీపం వెలిగిస్తున్న ఆమెకి హఠాత్తుగా అత్తగారు గుర్తువచ్చింది.

"ఈ కుందులు మా పుట్టింటివాళ్లు నాకిచ్చి నవి. నువ్వు దీపం వెలిగించాలనుకుంటే మీ అమ్మని అడిగి కుందులు తెచ్చుకో" ఆవిడ



సుతిమెత్తని శాసనం గుర్తువచ్చి ఆమె కళ్ళు నీటితో నిండిపోయాయి.

తను అత్తవారింట్లో కష్టాలు పడుతోందే మోనని ఆరాటపడుతున్న తల్లినీ తండ్రినీ తను సుఖంగా వుందని, తనని భర్త, అత్త మామలు ప్రాణప్రదంగా చూసుకుంటున్నా రనే అందమైన అబద్ధాలతో నమ్మించింది.

కాని, ఆషాఢపట్టీగా స్కూటర్ కావాలనే భర్త గొంతెమ్మ కోరికని, అత్తగారు బలపరి చిందని తండ్రికి ఎలా చెప్పాలి? హాలాహ లాన్ని కడుపులో దాచుకుని పైకి నవ్వుతూ ఎలా నటించగలదు? ఎన్నాళ్ళిలా? ఆమె చెక్కిళ్ళని అశ్రుధారలు తడిపేస్తున్నాయి.

"శ్వేతా" తల్లి పిలుపుతో ఉలిక్కిపడి తన కన్నీళ్లని దాచుకునేందుకు వ్యర్థప్రయత్నం చేస్తూ తలదించుకుని సజ్జలోని పూలని ఒక్కొక్కటీ తీసి మందిరంలోని వెంకటేశ్వ రుని పటానికి అలంకరిస్తోంది.

జానకమ్మ ఆమెని డిస్టర్బ్ చెయ్యడం ఇష్టంలేక అలాగే నిలబడి ఆమె ప్రతీచర్యని గమనిస్తోంది. శ్వేత చివరగా దేముడికి నమస్కరించి లేవబోతుంటే అంది.

"శ్వేతా! నువ్వు పూజించే ఆ దేముడి పాదాల సాక్షిగా చెప్పు. నువ్వు అత్తవా రింట్లో సుఖంగానే వున్నావా?"

తల్లి అలా అడగ్గానే శ్వేత తత్తరపడింది. ఏం జవాబివ్వాలో తెలియక కంగారుప డింది.

"చెప్పమ్మా! దైవం ముందు అబద్ధాలు చెప్పద్దు"

ఆమె సజల నయనాలతో దేముడిపటం వైపు చూసింది. అభయహస్తంతో వున్న వెంకటేశ్వరుడు "నా ముందు అబద్ధాలాడ తావా?" అంటున్నట్టు అనిపించింది.

దుఃఖం ముంచుకురాగా వెక్కిళ్ళ మధ్య చెప్పింది.

"ఆయన నన్ను డబ్బు కోసమే పెళ్ళి చేసు కున్నారటమ్మా! ఆ నిజాన్ని అతను మా మొదటిరాత్రే చెప్పాడు. ఆ విషయాన్ని మేం అద్దెకి వుంటున్న ఇంటి యజమానురాలు

నిర్ధారించింది కూడా. ఆయన నన్ను పెళ్లి చేసుకోనని, నేనతనికి నచ్చలేదని చాలా గొడవ పెట్టారుట. నాన్నగారి ఆస్తికి నేను, అక్క ఇద్దరమే వారసులం కాబట్టి ఇదంతా మాకే చెందుతుందని, నాకొచ్చే ఆస్తిని అతను అనుభవించాలని అతని తల్లిదండ్రులు బలవంతంగా నాతో పెళ్ళికి ఒప్పించారుట"

"అమ్మా! శ్వేతా!" రఘురామయ్యగారి ఆర్త నాదంలాటి పిలుపు విని ఉలికిపాటుతో ఇద్దరూ అటు చూశారు. ఆయన ఎప్పుడు అక్కడకి వచ్చాడో తెలియదుగాని, ఆయన ముఖం చూస్తే కూతురు చెబుతున్నదంతా విన్నారనే అన్పిస్తోంది. కూరల కోసం బజారుకి వెళ్ళిన తండ్రి ఇంత త్వరగా ఇంటికి వస్తాడని కాని, తన సంసారాన్ని గురించిన గుండెలు బద్దలయ్యేలాంటి నిజం వింటాడని కాని ఊహించని శ్వేత నిశ్చేష్టురాలయింది.

"నీ జీవితం నాశనమవడానికి కారకుడిని నేనే తల్లీ! నీ పెళ్లి చెయ్యకుండానే చచ్చిపోతానేమో అనే బాధతో బెంగతో ఒకసారి నిన్ను తిరస్కరించిన వాళ్ళు మళ్ళీ నిన్ను కావాలని ఎందుకు కోరుకుంటున్నారో తెలుసుకోలేకపోయానమ్మా! నా చేతులతో నేనే నిన్ను అగ్నిగుండంలోకి తోసేశానమ్మా!" ఆయన పశ్చాత్తాపంతో కరిగి కన్నీరవుతూ అంటున్న ఈ మాటలు ఆయన హృదయాన్ని చీల్చుకుని వస్తున్నట్టున్నాయి.

"ఏమండీ!" జానకమ్మ స్పృహలోకి వచ్చిన దానిలా ఒక్కంగలో ఆయన్ని సమీపించి ఆయన్ని పొదివి పట్టుకుంది.

"మీరు ఆందోళన పడద్దు. సంసారం అన్నాక సవాలక్ష గొడవలుంటాయి. అయినా ఇప్పుడేమయిందని? వాళ్లు అడిగిన అడ్డమైన గొంతెమ్మ కోరికలూ తీర్చడానికి మనం సిద్ధంగా లేము. ఈసారి ఏదైనా అడిగితే పెద్ద మనుషులని తీసుకుని గడ్డిపెట్టి వద్దాం! బుద్ధి వస్తుంది"

"నేను పాపినమ్మా! ఈ పాపిష్టివాడిని క్షమించమ్మా!" ఆయన కూతురి చేతులని పట్టుకుని బావురుమన్నాడు.

"నాన్నా! మీరు అప్‌సెట్ కాకండి ప్లీజ్! ఇందులో మీ తప్పేంవుంది? మీరు బలవంతంగా నా పెళ్ళి చెయ్యలేదుగా. నేను ఇష్టపడే చేసుకున్నానుగా?" శ్వేత తండ్రిని ఓదార్చాలని ప్రయత్నించినకొద్దీ ఆయన దుఃఖం రెట్టింపవుతోంది.

కొద్దిసేపటి తరువాత స్థిమితపడి కూతురితో అన్నారు.

"నువ్వు ఇంక ఆ ఇంటికి వెళ్ళద్దమ్మా శ్వేతా! నీకు పెళ్ళి కాలేదనే అనుకుంటాను. నిన్ను నా గుండెల్లో పెట్టుకుని కాపాడుకుంటాను. నేను, మీ అమ్మ బతికివుండగా నీకే లోటు రాదు"

"అలాగే, వెళ్ళనులెండి. మీరు ఇంక ఆ విషయాలన్నీ ఆలోచించకుండా ప్రశాంతంగా వుండండి" శ్వేతకి తండ్రిని చూస్తే భయం వెయ్యసాగింది ఆయనకి హార్ట్‌ఎటాక్ వస్తుందేమోనని. ఆమె భయపడినంతా జరిగింది. ఆ సాయంకాలం ఆయనకి గుండె నొప్పి వచ్చింది.

★ ★ ★

ప్రవంతి సూట్‌కేసు సర్దుకుంటోంది. రవి గదిలోకి వచ్చి మంచంమీద కూర్చుంటూ అడిగాడు.

"ఇవాళ సాయంకాలమే కదూ, నీ ప్రయాణం?"

"అవును" అందామె తల ఎత్తకుండానే. పెట్టెమూత వేసి అతనివైపు చూస్తూ అడిగింది.

"నేను నెలరోజులపాటు మీకు దూరంగా వెళ్ళిపోతున్నానంటే మీకేమన్పించడం లేదూ?"

"నాకు అలాంటి పట్టింపులు లేవు. అమ్మ ఏదో ఆచారం అంటోంది"

"పోనీ వెళ్ళడం మానెయ్యనా?"

"అమ్మ వెళ్ళమందిగా వెళ్లు"

"నేను నెలరోజులు మీకు కన్పించనంటే మీకు ఏమీ బాధగా అన్పించడంలేదూ?" ఇందాకటి ప్రశ్ననే రిపీట్ చేసింది.

"పనిలోపడితే నాకేమీ గుర్తుండదు"

ఆమెకి ఆ సమాధానంతో చాలా ఆశా భంగం కలిగింది. తన ఎడబాటు అతనికి బాధని కలిగిస్తుందని అతను ఆ భావాన్ని వెల్లడిస్తాడని ఆశించిన ఆమెకి నిరాశే మిగిలింది. ఆమె కళ్ళు చెమ్మగిల్లుతున్నాయి.

కోటి కోరికలతో ఆ ఇంటికోడలిగా అడుగుపెట్టిన తనకి అడుగడుగునా ఆశాభంగమే మిగిలింది. అత్తగారి దృష్టిలో తనొక అన్‌వాంటెడ్ గెస్ట్. ఆడబడుచు దృష్టిలో తిండి, బట్ట మొహం ఎరుగనిది. ఆ భావం తరచు ఆవిడ మాటలలో వ్యక్తమవుతూనే వుంటుంది. కాని భర్త! అతను మనస్ఫూర్తిగా తనని ఇష్టపడి పెళ్ళి చేసుకోలేదా?"

ఆమె సూటుకేసు పట్టుకుని మెట్లు దిగి కింద హాల్లో పెట్టి వచ్చింది. డైనింగ్ టేబిల్ దగ్గర కూర్చున్న శ్రీధర్, కల్పన ఆ సూట్‌కేసుని చూశారు. వాళ్లిద్దరి కళ్లు కలుసుకుని మాట్లాడుకున్నాయి. శ్రీధర్‌కి ముందునుంచి స్రవంతిపై మంచి అభిప్రాయం లేదు. ఆమె ఆస్తిలో అంతస్తులో తమతో ఏమాత్రం సరితూగని కుటుంబం లోనుంచి రావడం అందుకు కారణం. ముఖ్యంగా ఆమెపట్ల తల్లి వైఖరిని గమనించాక, ఆ చులకనభావం రెట్టింపయింది.

స్రవంతి ఆషాఢమాసం నెల్లాళ్లూ పుట్టింట్లో వుండడానికి వెళ్తోందని కల్పన ద్వారా విన్నాడు. డబ్బులేని అమ్మాయిలు డబ్బున్న ఇంటికోడళ్లయితే పుట్టింటివాళ్ళకి అత్తింటిని దోచి పెడతారని అతనికో గొప్ప నమ్మకం.

స్రవంతి మెట్లెక్కి తిరిగి పైకి వెళ్ళేదాకా ఆగి అన్నాడు.

"ఎంత పెద్ద సూటుకేసు సర్దిందో చూశావా? ఏం పట్టుకుపోతోందో ఇక్కడ నుంచి"

"ఏమో! ఎవరికి తెలుసు?"

"తెలుసుకో!"

"ఎలా?"

అతను చెప్పాడు. కల్పన మెట్లెక్కి పైకి వెళ్ళింది. రవి అప్పుడే మెట్లు దిగుతున్నాడు.

"ఆఫీసుకా?" అడిగిందామె చిరునవ్వుతో.

"అవును" అన్నాడతను. అతని కారు స్టార్టయ్యేదాకా ఆగి అప్పుడు పిలిచింది స్రవంతిని.

"ఏమిటండీ?" ఆమె గదిలోనుంచి బయటకొచ్చింది. "నాది లైట్‌గ్రీన్ కలర్ జాకెట్టు వుండాలి. నిన్నటినుంచి కనిపించడంలేదు. నీ బట్టలలో కలిసిపోయిందేమో కాస్త చూస్తావా?"

"చూస్తాను" ఆమె తలవూపి తిరిగి గదిలోకి వెళ్ళింది. కల్పన ఆమె వెనుకే వచ్చింది. స్రవంతి బీర్వా తెరిచి అందులో నుంచి తను పెట్టెలో సర్దుకోగా మిగిలిన చీరలని, జాకెట్లని బయటికి తీసి మంచం మీద పెట్టింది.

"చూసుకోండి"

కల్పన జాకెట్లన్నింటిని పరీక్షించి "వీటిల్లో లేదు. నీ సూట్‌కేసులో వుందేమో!"

"సూట్‌కేసులోనా? నా దగ్గర వున్నది ఒకే ఒక లైట్‌గ్రీన్ చీర, జాకెట్టు, అవి ఇక్కడే వున్నాయి"

స్రవంతి పుట్టింటికి ఇక్కడనుంచి ఏదో మోసుకెళ్తోందని, అందుకే సూట్‌కేసు తెరిచి చూడ్డానికి ఇష్టపడడంలేదని కల్పన అనుమానం.

"పోనీ... చూడవచ్చుగా? నిన్న ఇస్త్రీకి అందరి బట్టలు ఇచ్చినప్పుడు కలిసిపోయాయేమో?"

"చూద్దాం పదండి" స్రవంతి మెట్లు దిగింది. కల్పన ఆమెని అనుసరించింది.

స్రవంతి సూట్‌కేసు తెరిచాక కల్పన బట్టలన్నీ వెతికింది.

"ఉహూ! లేదు. ఎక్కడపోయిందో" నిరా




శని ధ్వనింపచేస్తూ అంది.

"ఏం చేస్తున్నావు కల్పనా" శ్రీధర్ ఏమీ ఎరగనట్టు అక్కడకి వచ్చాడు.

"నా బ్లౌజు స్రవంతి బట్టలలో కలిసిపో యిందేమోనని వెతుకుతున్నాను" నవ్వింది.

"ఏమైనా వుందా? " అతను పెట్టెలోకి తొంగిచూశాడు.

"ఏమీలేదు"

ఆ ఇద్దరూ ఒకరి వెనుక మరొకరు అక్కడనుంచి నిష్క్రమించారు. స్రవంతి కల్పన కెలికిన బట్టలన్నీ తిరిగి సర్దుకుని సూట్ కేస్ తాళం వేసింది. ఆమె తిరిగి తన గదిలోకి వచ్చింది. అక్కడే సోఫాలో కూర్చుని, జరిగినదంతా నిశ్శబ్దంగా గమనించిన మామగారిని ఆమె చూడలేదు.

మాధవరావుగారు కల్పన, శ్రీధర్‌ల సంభాషణలోని అసహజత్వాన్ని గమనించి ఆలోచిస్తున్నాడు.

"ఏమైనా వుందా? "

"ఏమీలేదు"

కల్పన స్రవంతి బట్టలలో తన బట్టలు కలిసిపోయాయేమో అని చూస్తున్నాను అని శ్రీధర్‌తో చెప్పినప్పుడు "వుందా" అని అడగాలి. కాని, వాడు "ఏమైనా వుందా? " అని అడిగాడు.

అలాగే కల్పన 'లేదు' అని చెప్పడానికి బదులు 'ఏమీలేదు' అంది.

వినేవాళ్ళకి మామూలుగా ధ్వనించిన ఆ వాక్యాలలో లోతైన అర్థాన్ని ఆయన గమనించగలిగాడు. కల్పన స్రవంతి పెట్టెని తెరిపించినది తన బట్టలు ఆమె బట్టలలో కలిసిపోయాయేమోననికాదు. పుట్టింటికి ఇక్కడినుంచి ఏం పట్టుకుపోతోందో అనే అనుమానంతో! ఆ విషయాన్ని గ్రహించలేని స్రవంతి అమాయకత్వానికి ఆయనకి జాలేసింది.

కొద్దిసేపటి తర్వాత స్రవంతి చేతిలో నగల బాక్సుతో అత్తగారిదగ్గరకి వచ్చింది.

"ఈ నగలు మీ దగ్గర వుంచండత్తయ్యా!"

"ఏం, నగలు వేసుకోవా? " ఆవిడ స్రవంతి మెడలోని నల్లపూసల గొలుసుని తేరిపారి చూస్తూ అంది.

"ఒక్కర్తినీ వెళ్తున్నాను. అసలే రైళ్లలో దొంగతనాలు ఎక్కువగా వున్నాయి. అందుకే డైమండ్ దిద్దులు కూడా తీసి పెట్టెలోనే పెట్టాను. మీరు ఒకసారి చూస్తే"

త్రిపురాంబ తనకేమాత్రం ఆసక్తిలేనట్టు ముఖంపెట్టి నగలపెట్టె మూత తీసి చూసి అందులో తను పెళ్ళికి పెట్టిన నగలు అన్నీ వున్నాయని నిర్ధారణ చేసుకుని తృప్తిపడింది.

ఆ నగలు స్రవంతి ఒంటిమీద పెట్టుకుని ప్రయాణంచేస్తే కర్మవశాత్తూ నిజంగా దొంగలు దోచుకెళ్ళినా భార్య నమ్మదని మాధవరావుగారికి తెలుసు. స్రవంతే ఆ నగలని ఆమె తండ్రి అవసరానికిచ్చి దొంగలు ఎత్తుకెళ్ళారని నాటకమాడుతోందని నింద కూడా మోపగలదు" నగలు అత్తగారి చేతికిచ్చి కోడలు మంచి పనే చేసిందన్పించిందాయనకి.

రవి లోపలకి వస్తూ అడిగాడు. "నువ్వు రెడీయేనా? ఏమైనా తిన్నావా? "

"తిన్నాను"

"వెళ్దాం పద, ట్రెయిన్ టైమయింది"

స్రవంతి అత్తగారికి, మామగారికి చెప్పి వచ్చి కారు ఎక్కింది.

రైల్లో కిటికీ దగ్గర కూర్చుంది. రవి వాచీ చూసుకుంటున్నాడు.

"మీకేమైనా పనివుందా? "

"అవును ఆడిటర్‌గారి దగ్గరకి వెళ్ళాలి"

"మీరు వెళ్ళండి. ట్రెయిన్ ఇప్పుడే కదలదేమో" ఆమె అంటూండగానే రైలు కూత వేసి కదిలింది.

"వెళ్ళగానే ఫోన్ చెయ్యి" అన్న రవి మాటలు రైలు కూతలో కలిసిపోయాయి.

రైలు వేగంగా వెళ్తోంది. స్రవంతి కిటికీలోనుంచి బయటకి చూస్తూ కూర్చుంది. కళ్ళ ముందు అత్తగారి ముఖం. మరొకసారి ఆడ

బడుచుముఖం కన్పిస్తున్నాయి. అంతలోనే ఆ రూపాలు అలుక్కుపోయినట్టయి కల్పన, శ్రీధర్‌లు కన్పిస్తున్నారు. కల్పన తన పెట్టె తెరిపించి ఆమె బ్లౌజు తన బట్టలలో కలిసి పోయిందేమోనని వెతకడం గుర్తువస్తోంది.

"ఏమైనా వుందా? " శ్రీధర్ స్వరం.

"బ్లౌజ్ వుందా" అని అడగడానికి బదులు 'ఏమైనా వుందా' అని ఎందుకడిగాడతను?

'లేదు' అనడానికి బదులు 'ఏమీలేదు' అని కల్పన ఎందుకు జవాబిచ్చింది? '

ఆమెకి హఠాత్తుగా మరో విషయం గుర్తు వచ్చింది. కల్పన చెప్పినట్టుగా నిన్న అందరి బట్టలూ ఇస్త్రీకివ్వలేదు. ఇవాళ ప్రయాణ మని తనొక్కర్తే ఇచ్చింది. అంటే! కల్పన తన పెట్టెని తెరిపించినది ఆమె బట్టలకోసం కాదు. తను పుట్టింటికి ఏంమోసుకుపో తోందో అనే అనుమానంతో' అసహాయమైన కోపంతో అవమానంతో వణికిపోయిందామె.



కూతురు పైకి నవ్వుతూ తిరుగుతున్నా ఆమె మనసులో అంతర్లీనంగా ఏదో బాధ వుందన్పించింది అన్నపూర్ణమ్మకి. ఆవిడలోని తల్లి మనసు కూతురి మనసులోని బాధ ఏమిటో తెలుసుకోవాలని ఆరాట పడసా





గింది.

అవిడ భర్త దగ్గర తన సందేహాన్ని, భయాన్ని వెళ్ళగక్కింది. "గొప్పింటి సంబంధం వెతుక్కుంటూ వచ్చేసరికి మనస్థి తిగతులని మరిచిపోయే దాని పెళ్ళి చేశాం. అది ఆ ఇంట్లో సుఖంగా లేదేమోనని నాకు అనుమానంగా వుందండీ"

చలపతిరావు భార్య అనుమానాన్ని తనూ బలపరిచా ను.

"నిజమే! స్రవంతిని చూస్తే నాకూ అదే అనుమానం వచ్చింది. నేను తప్పు చేశానం టావా? నా కూతురు పెద్దింటి కోడలు కావాలని, అది సుఖపడాలని కోరుకోవడం తండ్రిగా నా తప్పంటావా? " ఆయన మాటలో అధైర్యం లేదు. తను చేసిన పనిలో తప్పొప్పులను సమీక్షించుకున్నట్టు వున్నాయా మాటలు.

"పెళ్ళిలో ధుమధుమలాడుతున్న వియ్యా పురాలి ముఖం, ఆడబడుచు ముఖం చూస్తే వాళ్ళకి మనసంబంధం ఇష్టంలేదనే అన్పిం చింది" అంది అన్నపూర్ణమ్మ.

ఆయన సాలోచనగా చూస్తుండిపో యాడు. ఆ రాత్రి ఆ దంపతులిద్దరికీ నిద్ర పట్టలేదు. స్రవంతి అత్తవారింట్లో సుఖంగా లేదేమో అనే భయం ఆ ఇద్దరినీ కుదిపే స్తోంది. ఆమె భర్తతో వేరు కాపురంలో వుంటే సమస్యవుండదు. కాని, ఉమ్మడి సంసారంలో వుంది. త్రిపురాంబ పెళ్ళిలో తమతో ప్రవర్తించిన తీరు చూస్తే ఆవిడ స్రవంతికి కోడలికి ఇవ్వవలసిన గౌరవాన్ని ఇస్తుందా అనే అనుమానం ఎవర్కైనా కలు గుతుంది. ఆవిడ చూపులలో తమపై వ్యక్త మయిన చులకన భావాన్ని ప్రతీచర్యలో మాటల్లో వ్యక్తమయిన అహాన్ని, ఆవిడ గమనించకపోలేదు.

కూతురి కాపురం సవ్యంగా వుందా లేదా అని అడిగి తెలుసుకోవాలి. ఒకవేళ సవ్యంగా లేకపోయినా తామేం చెయ్యలేరు. అదివేరే సంగతి.

మరునాడు కూతుర్ని అడిగింది.

"మీ అత్తవారింటి విశేషాలేమిటే స్రవంతీ"

"ఏమున్నాయి? అంతా మామూలే" నవ్విందామె.

"మీ అత్తగారు మంచివారేనా? నువ్వంటే ఇష్టమేనా? "

"అదేమిటమ్మా, అలా అడుగుతున్నావ్? "

"నాకెందుకో నువ్వా ఇంట్లో సుఖంగా లేవేమో అన్పించింది" తల్లి మనసులోని ఆరాటాన్ని గమనించిన స్రవంతి కళ్ళు చెమ్మగిల్లాయి. ఆమె లేని ఉత్సాహాన్ని తెచ్చి పెట్టుకుంటూ అంది.

"మా అత్తగారు మితభాషి. అందువలన చూసేవాళ్ళకి గర్విష్ఠి అన్పిస్తారు కాని, చాలా మంచి వారమ్మా! నాకసలు ఆ ఇంట్లో పనేమీ వుండదు. వంటచెయ్యడానికి తాయారమ్మగారుంది. పై పనులు చెయ్యడానికి నౌకర్లున్నారు. అన్నీ పైపైన చూసుకోడమే!

"అల్లుడుగారు మంచివారేనామ్మా? "

"చాలామంచి వారమ్మా! నేనంటే ప్రాణం"

అన్నపూర్ణమ్మ, చలపతిరావుల గుండెలు కుదుటపడ్డాయి.

★ ★ ★

రఘురామయ్యకి హార్ట్ఎటాక్ వచ్చిందని తెలిసి ఆయన పెద్దకూతురు శ్యామ, అల్లుడు చంద్రం హైదరాబాదునుంచి వచ్చారు. చంద్రం అటు మామగారికి ఇటు అత్తగారికి కొండంత అండగా నిలబడి వాళ్ళకి కొడుకులులేని లోటుని తీర్చాడు. డాక్టర్లు రఘురామయ్యకి ప్రాణాపాయం తప్పింది కానీ, హైదరాబాదు తీసుకెళ్ళి ఏంజియోగ్రామ్ చేయించాలని చెప్పారు.

"మీ ఆయన రాలేదేమే! నాన్నకి ఒంట్లో బాగాలేదని అతనికి తెలియదా? " శ్యామ అడిగింది చెల్లెలిని.

"తెలియపరచలేదు" అంది శ్వేత మ్లానమైన ముఖంతో.

"అతను ఇక్కడకి రాకపోవడమే మంచిది లేవే! వస్తే అతన్ని చూస్తే మీ నాన్న కోలుకోరు" అంది జానకమ్మ.

"అదేమిటమ్మా? " ఆశ్చర్యంగా అడిగింది శ్యామ.

ఆవిడ చెప్పిన విషయాలని విని శ్యామ, చంద్రం నిర్ఘాంతపోయారు. "డబ్బు మనుషులన్నమాట" ఏహ్యంగా, తిరస్కారంగా అంది శ్యామ.

"ఆషాఢ పట్టీగా స్కూటర్ కావాలన్నారా? " విస్తుపోయాడు చంద్రం.

"అసలు ఫలానాది కావాలని డిమాండ్ చెయ్యడమేమిటి? మామగారు సంతోషంగా ఏదిస్తే అది పుచ్చుకోక! ఇప్పుడేం చెయ్యాలనుకుంటున్నారత్తయ్యా? "

"నీకిచ్చినట్టే రెండువేల రూపాయలు ఇస్తాము. నచ్చితే తీసుకుంటాడు. లేకపోతే మానేస్తాడు"

"అతనికి మీరు స్కూటర్ కొనిచ్చారని, నాకు ఇవ్వలేదని నేనేం బాధపడను కాని, మీరిలా మొండికేస్తే వాళ్ళు శ్వేతని బాధపెడతారేమో!"

జానకమ్మ ఉలిక్కిపడింది. "తను ఆ కోణంనుంచి ఆలోచించలేకపోయిందే? "

ఆవిడ కళ్లలో నీళ్ళూరుతుండగా అంది. "మా పరిస్థితి నీకు తెలియనిదేమీ కాదు చంద్రం. మీ మామగారు బాగానే సంపాదించారు. కాని, లక్షలకి లక్షలు డబ్బు మా దగ్గర మూలుగుతోందా? ఆయనకి వచ్చే పెన్షన్, బ్యాంకులో వున్న డబ్బుపై వచ్చే వడ్డీలతో సంసారాన్ని ఈదుతున్నాం. ఇద్దరు ఆడపిల్లలకి పెళ్ళిళ్లు చేశాం. ముందుముందు పురుళ్ళని, బాలసారె అని బోలెడు ఖర్చు శ్వేతని వాళ్ళు బాధపెడతారని భయపడి ఇప్పుడు స్కూటర్ కొనిస్తే భవిష్యత్తులో ఏ పండుగకో ఏ రిఫ్రిజరేటరో, కలర్ టీవీయో అడిగితే? ఇప్పుడు మీ మామగారి అనారోగ్యం! డాక్టర్లు చెప్పిన ఆ టెస్ట్‌లు చేయించడానికి ఎంత ఖర్చవుతుందో, పరీక్షలో ఏం బయటపడుతుందో! వైద్యానికి ఎన్ని వేలు ఖర్చవుతుందో" నిస్సహాయంగా



వుంది ఆవిడ స్వరం.

"మీరు ఆయనకి స్కూటర్ కొనద్దమ్మా! బావగారికి కానుకగా ఏం ఇచ్చారో ఆయనకీ అంతే ఇవ్వండి" అంతవరకు మౌనంగా వున్న శ్వేత అంది. "నేను కాపురానికి వెళ్ళిన మరునాడే వెండి కుందులు తెచ్చుకోమన్న మనిషి ఆవిడ నువ్వు సారెలో ఇచ్చిన స్వీట్లు అమ్మించి, సొమ్ముచేసుకుంది. మంచి తనం నటించి, నాన్నగారు నా ఖర్చులకోసం వెయ్యిరూపాయలు ఇచ్చారని నేనే చెప్పేలా చేసి మా ఆయన ఆ డబ్బు లాక్కునేలా చేసింది" శ్వేత గాద్గదికమైన స్వరంతో చెబు తుంటే ఆమె అత్తవారిలో ధనకాంక్ష ఎంతగా వ్రేళ్లూనిపోయిందో తెలుసుకున్న శ్రోతలు నిశ్చేష్టులయ్యారు.

★ ★ ★

"అన్నయ్యగారికి గుండెనొప్పి ఏమిటి? నిక్షేపంలా వుండే మనిషి. ఏమ్మా, శ్వేతా! ఒక్కఫోన్ చేస్తే నేను రెక్కలు కట్టుకుని వాలకపోయేదాన్నా? కష్టాలలో ఆదుకోలేక పోయాక, ఇంక బంధువులెందుకు? బంధుత్వం అనే మాటకి అర్థమేమిటి?" రాజేశ్వరమ్మ వస్తూనే వియ్యంకుడి ఆరోగ్యం విషయంలో ఆందోళన వ్యక్తపరిచింది.

జానకమ్మ గుండెలు పీచుపీచుమంటు న్నాయి. భర్త ఆవిడని చూసి ఎలా స్పంది స్తాడో, మళ్ళీ గుండెనొప్పి వస్తుందేమో!

"ఆ సమయంలో నాకేం తోచలేదత్తయ్య గారూ" అంది శ్వేత అణకువగా. "ఇంతకీ మీకీ విషయం ఎవరు చెప్పారు?"

"మా అన్నయ్య అల్లుడు ఈ వూళ్ళోనే వున్నాడుగా? అతను చెప్పాడు. ఇంతకీ డాక్టర్లేమంటారు?"

శ్వేత మెల్లిగా విషయం చెప్పింది. వింటున్న రాజేశ్వరమ్మ భ్రుకుటి ముడిప డింది.

కాఫీ టిఫిన్‌లాంటి మర్యాదలు యథావి ధిగా పొందాక, "ఒకసారి అన్నయ్యగారిని చూస్తాను" అందావిడ.

"పడుకున్నారు" అంది జానకమ్మ ఇబ్బం దిగా. నిజానికి రఘురామయ్య నిద్రపోడం లేదు. చంద్రంతో మాట్లాడుతున్నాడు. అనూహ్యంగా వియ్యపురాలిని ఆ ఇంటిగేట్లో చూసిన జానకమ్మ భర్త వున్న ఆ గది తలుపులని మూసి మరీ వచ్చింది.

"పోన్లెండి" అందావిడ.

"మామరిదిగారు రాలేదేం" శ్యామ కావా లనే అడిగింది.

"ఆషాఢమాసం అత్తారింటికి ఎలా వస్తాడూ? ఆషాఢం వెళ్లగానే మంచిరోజు చూసి పంపుతాను"

"పిల్లనిచ్చిన మామగారికి ఒంట్లో బాగుం డకపోతే చూడ్డానికి రావడానికి ఆషాఢం ఏమిటండీ?" శ్యామకి ఆవిడని చూస్తే ఒళ్ళు మండిపోతోంది. వచ్చిన దగ్గరనుంచి ఆ ఇంటిని, ఇంట్లోని వస్తువులని డేగకళ్లతో పరిశీలనగా చూడ్డమే. బహుశా వియ్యం కుడి ఆర్థికపరిస్థితిని అంచనావేస్తోందేమో!

రాజేశ్వరమ్మ మాటకి మాట చెబుతున్న శ్యామని మింగేసేలా చూస్తూ "ఇంతకీ మీ ఆయన వచ్చారా?" అంది.

"ఎందుకు రాలేదు? మా నాన్నగారికి ఒంట్లో బాగాలేదని తెలియగానే నాతోబాటు ఆయనా వచ్చారు. మా ఆయన అని చెప్పు కోడం కాదుకాని, చాలా మంచివారు. ఇంటి అల్లుడిలా కాదు కొడుకులా ఆప్యాయతను పంచుతున్నారు. మానాన్నగారి పక్క వదల కుండా ఆయనకి సపర్యలు చేస్తున్నారు. ఇంకోవారం రోజులు సెలవు పొడిగించుకుం టానన్నారు"

వింటున్న రాజేశ్వరమ్మ గుండె గుభేలు మంది. భోజనాలయ్యాక శ్వేతని డాబాపైకి పిలిచింది.

"అమ్మాయ్ శ్వేతా! మీ నాన్నగారికి ఎంత వయసువుంటుంది?"

"అరవై ఒకటి అనుకుంటానండి" ఆమెకి ఆవిడ ఆ ప్రశ్న ఎందుకడిగిందో అర్థంకా లేదు.





"మీ నాన్న విల్లు రాశారా? "

"తెలియదత్తయ్యా!" ఆవిడ ప్రశ్నలోని ఆంతర్యాన్ని ఊహిస్తూ అంది.

"నువ్వెత్త అమాయకురాలివమ్మా! మీ అక్క చాలా గడుసుది. మీ బావ ఆఫీసుకి సెలవుపెట్టి మరీ వచ్చి మీనాన్నకి సపర్యలు ఎందుకు చేస్తున్నాడంటావ్? "

"మా బావ చాలా మంచివారత్తయ్యా!"

"కాదే! వెర్రిముఖమా! మీ నాన్నని మంచి చేసుకుని ఈ ఇల్లు, డబ్బు అన్నీ తన పేర రాయించుకోడానికి. తనకే మీపై బోలెడు ప్రేమవున్నట్టు నటిస్తున్నాడు"

శ్వేత తృణీకారం, నిరసన వ్యక్తమయ్యేలా ఆవిడనో చూపు చూసి మౌనంగా వూరుకుంది.

"నేను చెప్పేదేమిటంటే, మీనాన్న ఆస్తినంతటినీ మీ అక్కా బావల పరం చెయ్యక ముందే జాగ్రత్తపడు. ఇల్లు, డబ్బు నీ పేర రాయించుకో!. మీ అక్కని అన్యాయం చేసిన పాపం మనకెందుకులే, ఆస్తి చెరిసగం పంచి ఇమ్మను. హార్ట్ఎటాక్ వచ్చినవాడు ఏ నిముషంలో ఎలా వుంటాడో ఎవరు చెప్పగలరు? "

శ్వేతకి అర్థమయింది. ఈవిడ పనిగట్టుకుని విజయవాడనుంచి తమ ఇంటికి వచ్చినది తండ్రిని చూసి వెళ్ళాలని కాదు. ఆస్తి రాయించుకోమని సలహా ఇవ్వడానికి.

"చూడండి అత్తయ్యా! ఈ ఆస్తి మా నాన్నగారి స్వార్జితం. దాన్ని మాకు రాసిమ్మని అడగడానికి నాకు కాని, మా అక్కకి కాని ఎలాంటి హక్కులేదు. ఆయన ఆస్తి మాకే ఇవ్వాలని రూలూలేదు. ఆయన స్వశక్తితో సంపాదించిన ఈ ఆస్తి ఆయన ఇష్టానుసారం ఏ ధర్మ సంస్థలకో రాసిచ్చినా కూడా అడిగే హక్కు మాకు లేదు. ఆయన ఆస్తిపై మాకు ఆశాలేదు. మానాన్నగారు మమ్మల్ని చదివించారు. ఆయన శక్తివంచనలేకుండా డబ్బు ఖర్చుపెట్టి పెళ్ళిళ్ళు చేశారు. ఎప్పుడైనా పుట్టింటికి వచ్చి గుప్పెడు పసుపు కుంకుమలు వాళ్ళనుంచి పుచ్చుకోవాలనే ఆశ తప్ప వాళ్ళని పీడించి ఆస్తిని రాయించుకోవాలనే అత్యాశ నాకు కాని మా అక్కకి కాని లేదు" శ్వేత స్వరంలో ఆవేశంకాని కోపం కాని లేవు. నచ్చచెబుతున్నట్టువుంది.

రాజేశ్వరమ్మ నిరుత్తరురాలయింది. మెల్లిగా అయినా, స్పష్టంగా, ఖచ్చితంగా తన ప్రతిపాదనని త్రోసిపుచ్చిన కోడలిపై ఆవిడకి ఆగ్రహం కలిగింది.

ఆవిడ పళ్ళు కొరుక్కుంటూ కిందికి దిగి వచ్చింది. కాస్సేపటితరువాత రాజేశ్వరమ్మ వెళ్ళిపోయింది.

శ్వేత ముఖం మామూలుగా లేదని గమనించి అడిగింది శ్యామ.

"అలా వున్నావేం? ఏమంటోంది మీ అత్తగారు? "

శ్వేత చెప్పింది. వింటున్న శ్యామ ఏహ్యతతో, జుగుప్సతో వణికిపోయింది "ఆవిడ ఇక్కడకి వచ్చినది నాన్నని చూడడానికి కాదు నీకీసలహా ఇవ్వడానికన్నమాట"

"అంతేగా మరి!"

"సిగ్గులేకపోతే సరి" చీత్కరిస్తూ అంది. "మన ఆస్తి విషయం ఆవిడకెందుకు? ఇది పూర్తిగా మన కుటుంబ వ్యవహారం. దీంట్లో ఆవిడ జోక్యం అనవసరం"

"ఆస్తి వస్తుందనే కదక్కా నన్ను కోడలిగా చేసుకున్నారు" నిర్జీవంగా నవ్వింది.

"అయితే మాత్రం? ఒకసారి గుండెనొప్పి వచ్చినంత మాత్రాన నాన్నగారికేదో... అయిపోతుందనే? నీకు ధైర్యం చెప్పవలసింది పోయి... ఛీ ఛీ!"

"ఇవన్నీ అమ్మకి తెలియనివ్వకు"

"ఎందుకు తెలియనివ్వద్దూ? తెలియనివ్వాలి. నీ అత్తవారిని ధనపిశాచం ఆవహించిందని వాళ్ళు అడిగిన కానుకలు ఇస్తే ఆ పిశాచం దాహం తీరదని, అమ్మా నాన్నలు తెలుసుకోవాలి. నువ్వా ఇంట్లో కాపురం చెయ్యగలవో లేదో, వాళ్ళే కాదు నువ్వూ నిర్ణ

యించుకోవాలి" ఆవేశంగా అంది శ్యామ.

శ్వేత కళ్ళలో నీళ్ళూరుతున్నాయి. తన పెళ్ళయి నలభై రోజులు. అప్పుడే తన కాపురం సజావుగా సాగుతుందో లేదో తెలియని సందిగ్ధంలో పడింది.

ఆమె వ్యధగా నిట్టూర్చింది.

★ ★ ★

"అక్కా" పరిగెత్తుకుంటూ వచ్చింది అవంతి. "బావగారు వచ్చారు"

స్రవంతి చేస్తున్న పని వదిలేసి సంభ్రమంగా వచ్చింది. రవి హాలులో కూర్చుని తండ్రితో మాట్లాడుతున్నాడు. ఆమె పాదాలకి వున్న చిరుమువ్వల శబ్దం విని, అతను తలతిప్పి చూశాడు. ఒక్కక్షణం ఇద్దరి చూపులూ కలుసుకున్నాయి. ఆక్షణంలో అతని కళ్ళలోని మెరుపు ఆమెకి కొత్తగా వుంది. ఎవరో వీణతంత్రులని లాగి వదిలినట్టుగా ఆమె అణువణువునా సన్నని ప్రకంపనలు.

"ఎలా వచ్చారు?" అడిగింది తనలో చెలరేగే భావ సంచలనాన్ని అతికష్టంమీద అదుపులో పెట్టుకుంటూ.

"ట్రెయిన్‌లో" చెప్పాడు తను చిరునవ్వుతో.

నవ్వింది స్రవంతి. "నా ఉద్దేశం ఆషాఢ మాసంకదా! అత్తవారింటికి ఎలా వచ్చారని?"

"నాకు అలాంటి పట్టింపులు లేవని నీకు మొదటే చెప్పాను కదా! మీకు వుంటే వెళ్ళిపోతాను"

"మాకు అలాంటి పట్టింపులేం లేవు బాబూ! నువ్వు నిరభ్యంతరంగా ఇక్కడ వుండచ్చు. స్రవంతీ! అల్లుడికి కాఫీ తీసుకురామ్మా" చెప్పాడు చలపతిరావు.

స్రవంతి వంటగదిలోకి వచ్చింది. పూజ ముగించి ఇవతలకి వస్తున్న తల్లితో అంది.

"అమ్మా! ఆయన వచ్చారు"

"ఎవరు? అల్లుడే!" సంభ్రమాశ్చర్యాలతో తల మునకలయిందావిడ.

"అవును... ఆషాఢమాసం. మీరిద్దరూ ఒక గడప దాటకూడదుకదామ్మా!"

"సింగినాదం కదూ? నాకలాంటి చాదస్తాలేవీ లేవు. కాఫీ కలుపు. నేను అల్లుడిని పలుకరించి వస్తాను"

స్రవంతి శరీరం ఉద్విగ్నతతో కంపిస్తోంది. రవి మొదటిసారిగా తమ ఇంటికి వచ్చాడు. తమ పెళ్ళయ్యాక అతన్ని మూడు నిద్రలకి ఇక్కడకి పంపమని అత్తగారిని అడిగిన తండ్రికి ఆశాభంగమే మిగిలింది. అతను అతిసామాన్యంగా వున్న తమ ఇంట్లో ఎడ్జస్ట్ అవగలడా? ఆమె ఆలోచిస్తూనే కాఫీ తెచ్చి అతనికి ఇచ్చింది.

అల్లుడిని పలుకరించివచ్చి అన్నపూర్ణమ్మ అవంతి సహాయంతో గది సర్దింది.

రవి గదిలోకి రాగానే స్రవంతి అడిగింది.

"ఆషాఢమాసంలో అత్తగారి దగ్గర వుండకూడదని నన్ను ఇక్కడకి పంపేశారు మీ అమ్మగారు. మరి అత్తవారింటికి వెళ్ళొద్దని మీకు చెప్పలేదా?"

"చెప్పింది. నేను వింటేగా?"

"నిజమా? ఆవిడ మాట లెక్కచెయ్యకుండా తమరు ఇక్కడకి ఎందుకొచ్చినట్టో?"

అతను హఠాత్తుగా ఆమెని దగ్గరకి లాక్కున్నాడు.

"నీకోసం"

"నిజమా?"

"నిజం స్రవంతీ! నువ్వు లేని ఆ ఇంట్లో నాకసలు అడుగుపెట్టబుద్ధికాలేదు" తమకంగా ఆమెని హత్తుకుపోతూ అన్నాడు.

"నేను లేనప్పుడు నా జ్ఞాపకాలతో మీ మనసు పులకరిస్తే అది ప్రేమ. మీ శరీరం పులకరిస్తే అది కామం. ఎక్కడో చదివేను"

"నాకు అవన్నీ తెలియవు.. నువ్వు లేకపోతే, నాకు ఆ ఇంట్లో ఏమీ తోచేది కాదు. పిచ్చెక్కినట్టుండేది. పనిపిల్ల గది వూడ్చడానికి వచ్చింది. దాని కాలిమువ్వల శబ్దం విని నువ్వేననుకున్నాను"

"నేనే అనుకుని రంగిని ఇలాగే పట్టుక





న్నారా?" పకపక నవ్వింది స్రవంతి.

"ఛీ! ఏయ్! నిన్నూ" అతనామెకి ఊపిరి సలపనివ్వకుండా చేశాడు.

స్రవంతికి గర్వంగా వుంది. ఆశ్చర్యం గానూ వుంది. పగలంతా ఫ్యాక్టరీలోని యంత్రాల మధ్య ఒక యంత్రంలా గడిపే అతనిలో రాత్రి తన దగ్గర గడిపే ఆ అయిదు నిముషాలలో కూడా యాంత్రిక తనే చూసింది. కాని అతనిలో ఇంత రస జ్ఞుడైన వ్యక్తి వున్నాడని, ఆ వ్యక్తి తన శరీ రాన్ని వీణలా మార్చుకుని గొప్ప వైణికు నిలా శృతి చెయ్యగలడని ఆమె ఈ క్షణాన్నే తెలుసుకుంది. గతంలో అతని చేతలకి శరీరం ఉద్రిక్తత పొందేది. కాని, ఇప్పుడు ఆమె మనసు కూడా పరవశిస్తోంది.

★ ★ ★

రెండురోజులు ఎంత వేగంగా గడచిపో యాయో స్రవంతికే తెలియదు. రవి అవం తితో వాసుతో కేరమ్స్ ఆడాడు. అత్తగారితో, మామగారితో బోలెడు కబుర్లు చెప్పాడు. స్రవంతిని తన ప్రేమామృతంలో ఓలలాడిం చాడు.

మూడవరోజు అతను ప్రయాణానికి ఉద్యుక్తుడవుతుంటే స్రవంతికి కన్నీళ్ళపర్యం తమయింది.

"అప్పుడే వెళ్తారా?"

"అప్పుడే ఏమిటి? నేను ఇక్కడకి వచ్చి ఇవాళ్టికి మూడు రోజులు"

"నాకు మూడు క్షణాల్లా గడిచిపోయాయి"

"ఈ దూరం శాశ్వతం కాదుగా, నువ్వు త్వరలోనే హైదరాబాదు వస్తావుగా?"

స్రవంతి కళ్ళలో నీళ్లూరుతున్నాయి.

"పోనీ, నువ్వూ నాతో వచ్చెయ్యి"

"మీ అమ్మగారు నన్ను లోపలకి రాని వ్వరు"

"హోటల్‌లో రూమ్ తీసుకుందాం. నేను ఫ్యాక్టరీలో వర్క్ అయిపోగానే నీ దగ్గరకి వచ్చేస్తాను"

"ఏం వద్దులెండి" అందామె కన్నీళ్లు తుడు చుకుంటూ.

రవిచంద్ర ప్రయాణమయ్యాడు. స్రవంతి తండ్రితో కలిసి అతన్ని సాగనంపడానికి స్టేషన్‌కి వెళ్ళింది. అతను ఎక్కిన రైలు కది లిపోతుంటే, ఏదో అదృశ్యహస్తం తనని ఒంటరితనం అనే లోయలోకి విసిరేసినట్టు ఫీలయిందామె. ఆ రాత్రంతా ఆమె నిద్రపో లేదు. తెల్లవారుఝామున మాగన్నుగా నిద్రపట్టింది. ఎండ ముఖాన్న పడి చురు క్కుమన్పించి, గాభరాగా లేచి ఇవతలకి వచ్చింది. తల్లీతండ్రీ మాట్లాడుకుంటున్న మాటలు విని అప్రయత్నంగానే ఆగిపో యింది.

"అల్లుడు చాలా మంచివాడు. అంత డబ్బున్న ఇంట్లో పుట్టి కూడా కొంచెం కూడా గర్వంలేదు. అల్లుడిలా కాదు, కన్న కొడుకులా కలిసిపోయాడు" అంటున్నాడు తండ్రి.

"అవునండీ. స్రవంతి కాదు మనం చాలా అదృష్టవంతులం" అంటోంది తల్లి.

"మళ్ళీ వీలుచూసుకుని అతన్ని రమ్మని చెప్పలేకపోయారా?"

"చెప్పాను, చూస్తానన్నాడు"

"అతనికి ఆషాఢ పట్టీ ఇవ్వాలి. అతను ఇక్కడకి వస్తాడోలేక మనమే వెళ్ళి ఇవ్వాలో?"

స్రవంతికి అత్తగారు గుర్తువచ్చింది. ఆషాఢ పట్టీగా నవరత్నాల వుంగరం తెమ్మని అన్యాపదేశంగా ఆవిడ చేసిన హెచ్చరిక గుర్తువచ్చింది. ఆమె మనసు చేదు తిన్నట్టయింది. ఆలోచనలతోనే ముఖం కడుక్కుని ఇవతలకి వచ్చింది. తల్లి కాఫీ గ్లాసు అందిస్తూ అడిగింది.

"అల్లుడు ఏమంటాడమ్మా? ఆషాఢ పట్టీ మనం పట్టికెళ్ళి ఇవ్వాలా? అతనే వస్తాన న్నాడా?"

"నేను అడగలేదమ్మా" పొడిగా అంది.

"అథమపక్షం రెండువేలయినా అత నికివ్వకపోతే బాగుండదు" అంది అన్నపూ



ర్ణమ్మ.

"అవును" అన్నాడు చలపతిరావు.

"మళ్ళీ శ్రావణమాసం వస్తోంది. వర లక్ష్మీ పూజకి వియ్యపురాలు ఇక్కడకి వచ్చి నప్పుడు బట్టలు పెట్టాలి"

"అవును" అన్నాడు ఆయన.

"ఇంకా ఇద్దరు పిల్లలున్నారు. అవంతి చదువు, దాని పెళ్ళి, వాసు చదువు, ఇవన్నీ ఎలా గట్టెక్కుతాయో" భవిష్యత్తు గురించి భయం విన్పిస్తోందావిడ స్వరంలో.

"ఆ భగవంతుడే ఏదో దారి చూపిస్తాడు"

స్రవంతికి తన గుండెనెవరో పిండినట్టవు తోంది.

పది గంటలకల్లా ఆ ఇల్లు నిశ్శబ్దంగా అయింది. తండ్రి ఆఫీసుకి, తల్లి, చెల్లెలు కాలేజీకి వెళ్ళాక వాడిపోయిన చొక్కాబొత్తాలు కుడుతున్న తల్లి దగ్గర కూర్చుంటూ అడిగింది స్రవంతి.

"అసలు ఆషాఢమాసంలో అత్తగారు, కొత్త కోడలు ఒక ఇంట్లో వుండకూడదని అల్లుడు అత్తవారింటికి రాకూడదనే ఆచారం ఎలా మొదలయిందమ్మా? ఆషాఢ పట్టీ ఎందుకివ్వాలి"

"నాకూ సరిగ్గా తెలియదు స్రవంతీ! కాని నేను విన్నది చెబుతాను... విను. పూర్వకా లంలో వ్యవసాయాధారంగా జీవించే వారు. మూడొంతులకి పైగా రైతు కుటుంబాలే వుండేవి. ఆషాఢమాసంలో వర్షాలు ప్రారం భమై ఆకుమడులు పోయడం, ఊడ్పుల సీజన్ మొదలవుతుంది కదా! సాధారణంగా పెళ్ళి ముహూర్తాలు ,వేసవి కాలంలో వుంటాయి. వేసవి వెళ్ళగానే వర్షాలు. వర్షం కురిస్తే రైతులకి చేతినిండా పని. కొత్త పెళ్ళికొడుకు భార్య మోజులో పడి వ్యవసా యాన్ని నిర్లక్ష్యం చేస్తాడని ఆ నెలంతా కొత్త పెళ్ళికూతుళ్ళని పుట్టింటికి పంపేవారు. అది 'ఆచారం' అంటే విధిగా పాటిస్తారు కాబట్టి ఆచారమయింది. ఇంక కానుకలం టావా, ఎవరి తాహతునిబట్టి వాళ్ళు ఇస్తారు"

స్రవంతికి ఆ క్షణంలో అత్తగారు గుర్తురా లేదు. కల్పన గుర్తువచ్చింది. పెళ్ళయి మూడేళ్ళయినా ఆమె పుట్టింటికి వెళ్ళినప్పు డల్లా ఘనమైన కానుక తెస్తుందని అత్త గారు ఆమెని పొగడడం గుర్తొచ్చి ఆమె మనసులో ఆత్మన్యూనతాభావం పెరిగిపో సాగింది. తండ్రి రెండువేలు రవికి ఆషాఢ పట్టీగా ఇస్తే అత్తగారు తనని పురుగుని చూసినట్టు చూస్తుంది. ఎలా? ఏం చెయ్యాలి? ఏదో ఒకటి చేసి, రవికి నవర త్నాల ఉంగరం చేయించాలి. ఆమె తీవ్రంగా ఆలోచిస్తోంది.

"బాగున్నారా అమ్మాయిగారూ?" నాగమ్మ పలకరింపుతో ఉలిక్కిపడి తలతి ప్పింది.

"ఆ! నువ్వెలా వున్నావే ఎప్పుడొచ్చావే! మీకూ ఆషాఢం పట్టింపు వుందేమిటే?" అడిగింది అన్నపూర్ణమ్మ.

"అత్తాకోడళ్ళిద్దరూ ఆషాఢంలో ఒక గడప దాటకూడదుటకదమ్మా! అందుకే వచ్చాను" నాగమ్మ అంట్ల గిన్నెలు తోముతూ చెప్పింది.

"పుట్టింటికొచ్చిన దానివి సుఖంగా కూర్చుని తినక మీ అమ్మ వెనుక పనికెం దుకొచ్చావే?"

"దాని అత్తగారు శ్రావణమాసంలో దీన్ని, మొగుడిని వేరు కాపురం పెట్టిస్తుందిటమ్మా! ఇత్తడి బిందెలు, వంట పాత్రలు నన్ను కొన మని పురమాయించింది. నా మొగుడు రిక్షా లాగి సంపాదించినదంతా ఆడి తాగు డికే సరిపోతుంది. అంధుకే రేపటినుంచి ఇద్దరం చెరొక పని చేసుకుని వూడ్పు చేలోకి పనికెళ్తాం" నాగమ్మ తల్లి నూకాలమ్మ బట్టలు ఉతకడం ఆపి చెప్పింది.

స్రవంతి నాగమ్మని అభినందనగా చూస్తోంది. తల్లి కష్టసుఖాలలో పాలుపం చుకుంటున్న దాన్ని చూస్తే ఆమెకి కన్నీళ్ళొ చ్చాయి. నాగమ్మ కాయకష్టం చేసి సంపా

దించిన డబ్బుతో పాత్రసామాను కొనుక్కుని అత్తగారిని మెప్పించగలదు. మరి తను తనేం చేసి అత్తగారిని మెప్పించగలదు? నవరత్నాల ఉంగరం చేయించడానికి పదివేలకిపైగా అవుతుంది. ఎలా అంత డబ్బు సమకూర్చుకోడం? ఉంగరం కావాలనే కోరిక రవికి వుండనీ మాననీ, ఆ ఉంగరాన్ని తన తండ్రి కానుకగా ఇచ్చాడని తెలిశాకైనా అత్తగారికి తనపై వున్న చులకన భావం పోతుందేమో! కల్పనకి తనమీది చిన్నచూపు పోతుందేమో? ఆలోచిస్తున్న ఆమెకి ఒక పరిష్కారమార్గం కనిపించింది.

★ ★ ★

ఆ రోజు శ్వేత నిద్రలేచేప్పటికి ఆలస్యమయింది. రాత్రంతా నిద్రపోలేదామె. ఆషాఢ మాసం వెళ్ళిపోయి ఆరోజునుంచి శ్రావణ మాసం మొదలవుతుంది. తను అత్తవారింటికి వెళ్ళాలి. ఆ ఇల్లు, ఆ మనుషుల మనస్తత్వాలను తలచుకుంటే ఆమెకి జీవితాంతం ఆ ఇంట్లో వుండాలంటే భయం వెయ్యసాగింది.

ఆమె ముఖం కడుక్కుని వచ్చేసరికి జానకమ్మ కాఫీ అందిస్తూ చెప్పింది. "మీ నాన్నగారు నిన్ను పిలుస్తున్నారు"

శ్వేత తండ్రిదగ్గరకి వెళ్ళింది. "పిలిచారా నాన్నా!"

"అవునమ్మా! అలా కూర్చో" అన్నారాయన. ఆయన తనతో ఏదో ముఖ్యమైన విషయాన్ని మాట్లాడ్డానికే పిలిచాడని ఆయన ముఖం చూస్తే అర్థమయిందామెకి.

"నువ్వు నీ అత్తవారింటికి వెళ్ళాలనుకుంటున్నావామ్మా? " తండ్రి అలా అడగ్గానే ఏం జవాబివ్వాలో తెలియక తడబడింది.

"వాళ్ళు డబ్బు మనుషులని, డబ్బుకోసమే నిన్ను పెళ్ళిచేసుకున్నారని నీ మాటలవల్ల తెలుస్తోంది. నీ వ్యక్తిత్వాన్ని గౌరవించని ఆ మనుషుల మధ్యకి తిరిగి వెళ్ళాలనుకుంటున్నావా? "

"వెళ్ళక చేసేదేముంది నాన్నా? "

"శ్వేతా! నిత్యం మనం వార్తాపత్రికలలో చదువుతూంటాం. వరకట్నం చాలదని అమ్మాయిని అత్తవారు బాధపెట్టారని ఉరిపోసుకునో, కిరసనాయిలు పోసుకుని అంటించుకునో ఆమె ఆత్మహత్య చేసుకుందనీ. ఇలాంటి కేసులలో అమ్మాయి తల్లిదండ్రులనేది ఒక్కటే మాట. వియ్యాలవారు కోరిన కట్నకానుకలని పెళ్ళిలో సమకూర్చలేకపోయామని, సమకూర్చేలోగానే ఇలా జరిగిందనీ. నా అభిప్రాయం ఏమిటంటే ఇలాంటి సంఘటనలలో తప్పు పూర్తిగా అమ్మాయి అత్తవారిది కాదు. ఆమె తల్లిదండ్రులది కూడా. కట్నకానుకలకోసం వేధించే అత్తవారింటికి పంపడమే తల్లిదండ్రులు చేస్తున్న పెద్ద తప్పు"

"పెళ్ళయిన ఆడపిల్ల పుట్టింట్లోనే వుండిపోవాలని ఏ తల్లీతండ్రీ కోరుకోరు కద నాన్నా? "

"నిజమే... తమ కూతురు అత్తవారింట్లో సుఖపడాలనే ఏ తల్లిదండ్రులయినా కోరుకుంటారు. కాని అత్తవారిల్లు అగ్నిగుండమై ఆమెకి భద్రత లేకపోతే? "

శ్వేత జవాబు చెప్పలేకపోయింది.

"కట్నంతో పెళ్ళి అనే భద్రతని కొనుక్కోడం, కానుకలతో అత్తింటివాళ్ళని మెప్పించాలనుకోడం ఒట్టి ప్రయత్నాలు. వివాహబంధాన్ని తెంచుకోడం అంత సులువు కాదని నాకూ తెలుసు. కాని ఆడపిల్లకి అత్తింట్లో రక్షణ లేనప్పుడు పుట్టింటివాళ్ళు ఆ భద్రతని కలగచెయ్యాలి. చాలామంది తల్లిదండ్రులు ఈ విషయాన్ని విస్మరించి, అత్తవారడిగిన గొంతెమ్మ కోరికలు తీర్చడానికే సిద్ధపడుతున్నారు. పెళ్ళయిన అమ్మాయి భర్తని వదిలి పుట్టింట్లో వుండడం నామోషీగా భావిస్తున్నారు"

"నా పరిస్థితి అంత ఘోరంగా లేదులెండి నాన్నగారూ! మా ఆయన, అత్తమామలు నన్ను బాధపెడుతున్నట్టు కనిపించరు. పోలీసువాళ్ళ దెబ్బల్లా లోలోపల బాధపెడ



తారు" నవ్వింది శ్వేత ఆ నవ్వు నిర్జీవంగా వుంది.

"అందుకే అడుగుతున్నానమ్మా! నీకు అతనితో వైవాహిక జీవితాన్ని కొనసాగించాలని వుందా? "

కొన్ని క్షణాల నిశ్శబ్దం తరువాత అంది.

"కొన్నాళ్ళకైనా వాళ్ళు మారతారనే ఆశ నాలో వుంది నాన్నా! కొన్నాళ్ళు ఓర్పు వహిస్తాను. ఎన్నాళ్ళయినా వాళ్ళ ధోరణిలో మార్పు లేకపోయినట్టయితే మీ దగ్గరకే వచ్చేస్తాను"

"ఎలాంటి పరిస్థితులెదురైనా ప్రాణం తీసుకోడంలాంటి పిచ్చిపనులు చెయ్యనని నాకు మాట ఇవ్వమ్మా" చెయ్యి జాపాడు రఘురామయ్య.

తండ్రి చాపిన చేతిలో చెయ్యి వేసింది శ్వేత.

★ ★ ★

వియ్యంకుడిని, వియ్యపురాలిని అవసరమైనదానికంటే ఎక్కువ మర్యాదను కనబరుస్తూ ఆహ్వానించింది రాజేశ్వరమ్మ. రఘురామయ్య అలాంటి నటనకి పడిపోయేరకమేమీ కాదు. ఆయన పొంగిపొరలి వస్తున్న ఆగ్రహాన్ని దిగమింగుకుని పైకి ప్రశాంతంగా కనిపించడానికి చాలా కష్టపడవలసి వచ్చింది.

మోహన్ ఆఫీసుకి వెళ్ళడానికి తయారై కాబోలు బయటకి వచ్చాడు. మామగారిని చూసి "బాగున్నారా? " అనడిగాడు.

"ఆఁ! ఇప్పటివరకు బాగానే వున్నాను. అన్నాడాయన" ఆయన మాటలలోని వ్యంగ్యం చురుక్కుమనిపించి, అతని ముఖం నల్లబడింది.

"నాకు ఆఫీసుకి టైమయింది. వస్తాను" అని అక్కడనుంచి వెళ్ళబోయాడు.

"వెళ్దువుగానిలే! ఒక్కరోజుకి ఆలస్యంగా వెళ్తే కొంప మునిగిపోదుకాని అలా కూర్చో" అన్నాడు.

"మీరూ ఇలా రండమ్మా" అని రాజేశ్వరమ్మని పిలిచాడు.

ఆవిడకి వియ్యంకుడి ముఖం చూస్తే యుద్ధానికి సంసిద్ధమై వచ్చాడనే అన్పించింది. ఆవిడ వచ్చి భర్త పక్కనే కూర్చుంది.

ఆయన జేబులోనుంచి రెండువేల రూపాయలు తీసి అల్లుడి ముందుకి జాపాడు.

"అల్లుడుకి ఆషాఢ పట్టీ ఇవ్వడం ఆనవాయితీ. ఇదుగో రెండువేలు. నువ్వడిగినట్టు స్కూటర్‌కి డబ్బివ్వడానికి నేను లక్షాధికారిని కాను బాబూ! సామాన్య గృహస్థుని. అయినా కానుక అంటే సంతోషంగా ఇచ్చేది. అడిగి, పీడించి పుచ్చుకునేది కాదు"

మోహన్ ముఖంలో రంగులుమారాయి. అతను శ్వేతవైపు ఒక కోరచూపు విసిరాడు.

"ఎవరో పరాయి వాళ్ళకి మీ డబ్బు ధారాదత్తం చేస్తున్నట్టు బాధపడతారేమిటండీ? మీ అల్లుడికి స్కూటర్‌కొనిస్తే మీ అమ్మాయేగా ఎక్కుతుంది" శంకరం నవ్వుతూ అన్నాడు.

"ఇచ్చేవాళ్ళుంటే స్కూటరేంకర్మ! రాకెట్టే అడగచ్చు ఎవరో ఇచ్చిన సొమ్ముతో సుఖపడాలనుకోడమే తప్పు. స్వయంశక్తితో సంపాదించిన గంజే పరమాన్నం తిన్నంత తృప్తిని కలిగిస్తుంది"

"ఈ ఉపన్యాసం దేనికి చెబుతున్నారండీ? మేం స్కూటర్‌కి డబ్బిమ్మని పీడించామని మీ అమ్మాయి చెప్పిందా? "

"ఏం నిజం కాదా? వెండి కుందులు మీ అమ్మనడిగి తెచ్చుకో అన్నారుట. లేకపోతే దేముడి దగ్గర దీపం వెలిగించవద్దన్నారుట"

"మేం వేళాకోళంగా ఏదో అంటే అదేదో ఘోరమైన తప్పన్నట్టు మీ అమ్మాయి మీకు ఫిర్యాదుచెయ్యడమూ బాగుంది. అది నిజమే అనుకుని మీరు నన్ను నిలదియ్యడం మరీ బాగుంది" అంది రాజేశ్వరమ్మ.

"వేళాకోళం ఏమిటండీ? మీ నాన్నకి హార్ట్ఎటాక్ వచ్చింది ఎప్పుడెలా వుంటాడో




ఎవరికి తెలుసు? ఇల్లు, డబ్బు నీ పేర రాయించుకో అని చెప్పడం కూడా వేళాకోళ మేనా? "

రాజేశ్వరమ్మ స్థానంలో మరెవరైనా వుంటే వియ్యంకుడు ఆ మాట ముఖాన అడిగినందుకు సిగ్గుతో చచ్చిపోయేవారే. కాని ఆవిడ తొణక్కుండా అంది.

"కొన్ని విషయాలు మనకి తట్టనప్పుడు ఎవరైనా చెప్పవచ్చు అందుకు తప్పుగా అర్థంచేసుకుంటారా? అసలు మీకు ఇంత అనారోగ్యం వచ్చాక కూడా విల్లు రాయా లనే ఆలోచన రాకపోవడమే ఆశ్చర్యంగా వుంది"

కోపంతో నిలువెల్లా వణికిపోయాడు రఘురామయ్య. "నా ఆరోగ్యం విషయంలో మీకు వున్న శ్రద్ధకి కృతజ్ఞుడిని అక్కయ్య గారూ! ఇంక ఆస్తి విషయం. నా ఆస్తిని నా పిల్లలకి కాకుండా వేరెవరికో దానం చేసేంత త్యాగశీలిని కాను నేను. నా స్వార్జితమైన ఆస్తి నా తదనంతరం నా భార్యకి, నా భార్య తదనంతరం మాత్రమే నా పిల్లలకి చెందుతుంది. ఆస్తి ఇవాళే నా పిల్లలకి ధారాదత్తంచేస్తే పర్యవసానమేమిటో నాకు తెలుసు. వృద్ధాప్యంలో తినడానికి తిండిలేక వృద్ధశరణాలయాన్ని వెదుక్కోవాలి మేమి ద్దరం. మా జాగ్రత్తలో మేమూ వుండా లిగా? ఈలోగా ఇల్లు రాయించుకోమని, కానుకలుగా స్కూటర్ తెమ్మని, కలర్ టి.వి. తెమ్మని వేధించదలుచుకుంటే మాత్రం మా అమ్మాయిని ఒకక్షణం కూడా ఈ ఇంట్లో వుంచను. నాతో తీసుకెళ్ళడానికి సిద్ధంగా వున్నాను"

"మీరు చాలాదూరం వెళ్తున్నారు. ఇంత చిన్న విషయాలకే కాపురాన్ని కాదనుకుంటే ఈ భూమి మీద ఇన్ని సంసారాలు నిలబ డేవేకావు"

"నిజమే. కట్నం చాలలేదని, కానుకలు తెమ్మని, అత్తవారు ఎన్ని హింసలు పెడు తున్నా భరిస్తూ భర్తే సర్వస్వమనీ అత్తిల్లే స్వర్గమని ఆడపిల్లలు అనుకోకపోతే 'పెళ్ళ యిన మూడునెలలకే అగ్ని ప్రమాదంలో చనిపోయిన యువతి' అని ప్రతీరోజూ వార్తాపత్రికలలో మనం ఇన్ని వార్తలు చూసేవాళ్ళమేకాదు" ఎత్తిపొడుపుగా అన్నాడు.

ఇంక చాలన్నట్టు భర్తని కళ్ళతోనే వారిం చింది జానకమ్మ.

"శ్వేతని ముందు తిరస్కరించి మళ్ళీ ఆరు నెలల తరువాత మీ అంతట మీరే కోడలిగా చేసుకుంటామని ముందుకొచ్చినప్పుడు కూడా మీరు డబ్బుకోసమే ముందుకి వచ్చా రేమో అనే అనుమానం కలగలేదు. మేమి చ్చిన కట్నంతో తృప్తిపడ్డారు. మా సంతో షంకొద్దీ కానుకలివ్వగలంకాని మీరు కోరిన కానుకలని మాత్రం ఇవ్వలేము. డిమాండ్ చేసి పుచ్చుకునే దాన్ని కానుక అనరు"

రాజేశ్వరమ్మ, శంకరం మాట్లాడలేకపో యారు. మోహన్ అయితే వంచిన తల ఎత్తకుండా అలాగే కూర్చున్నాడు.

ఇప్పటికి ఈ డోస్ చాలు. ఈ మాత్ర మైనా తను అడగకపోతే శ్వేత వాళ్ళకి భయపడి వాళ్ళన్న మాటలని తమతో చెప్ప లేదు అనో లేక కూతురి కాపురం ఏమవు తుందో అని తాము వాళ్ళకి భయపడి అడ గకుండా వూరుకున్నామనో అనుకుంటారు అనుకున్నాడు రఘురామయ్య.

★ ★ ★

"కాకినాడలో ఎక్కడున్నావురా? " త్రిపు రాంబ ఆరాగా అడిగింది.

"స్రవంతి వాళ్ళింట్లోనే ఎందుకలా అడుగు తున్నావ్? " రవి అడిగేడు.

ఆవిడ కొడుకు వైపు రెప్పవాల్చకుండా అలాగే చూస్తోంది.

"నీకు ఆషాఢం పట్టింపు వుంది కాబట్టి స్రవంతిని ఇక్కడ వుండకుండా పంపేశావు. నాకు పట్టింపు లేదు కాబట్టి వాళ్ళింట్లోనే వున్నాను"

"నిజమేలే! ఏం పెట్టారు మీ మామ గారు? "



"పెట్టడమేమిటి?"

"అదే ఆషాఢ పట్టీ ఏం ఇచ్చారని?"

"నీ చాదస్తం నువ్వూను" రవి విసుక్కుంటూ అవతలకి వెళ్లిపోయాడు.

అతను వెళ్తున్న వైపే చూస్తూ మూతి మూడు వంకరలు తిప్పింది వరలక్ష్మి.

"పెళ్లాం బెల్లం అయింది నీ కొడుక్కి. మూడు రోజులు అసలు ఎలా వుండగలిగాడా ఇంట్లో? కూర్చోడానికి నాలుగు శుభ్రమైన కుర్చీలయినా లేవు. ఆవిడని చూశావా? వంట మనిషిలా వుంటుంది. ఆవిడకంటే మన తాయారమ్మగారు మంచి చీరలు కట్టుకుంటుంది. అసలు ఏం చూసి చేసుకున్నారమ్మా అంత గతిమాలిన సంబంధం?" కూతురి స్వరంలోని ఏహ్యాత, తిరస్కారాలు సూటిగా త్రిపురాంబ గుండెని తాకాయి. ఏ విషయంలోను భర్త జోక్యాన్ని సహించలేని ఆవిడ, తన మాటే చెల్లాలనీ తనదే పైచెయ్యి కావాలనే పట్టుదలతో వుండే ఆవిడ రవి పెళ్లి విషయంలో భర్త నిర్ణయాన్ని హర్షించలేకపోతోంది.

"అద్భుతమైన అందమా అంటే అదీలేదు. ఆస్తా? మనతో సరితూగే అంతస్తా? ఏమీ లేని ఒక సామాన్యమైన అమ్మాయిని ఎలా చేసుకున్నాడు? నాకు అనుమానం వీడు ఆ అమ్మాయితో ప్రేమలో పడ్డాడని"

"ప్రేమా? ఎక్కడి కాకినాడ? ఎక్కడ హైదరాబాదు? వాళ్లిద్దరికీ అసలు ముఖ పరిచయం కూడా వుందంటే నేను నమ్మను" అంది త్రిపురాంబ స్థిరంగా.

"అయితే ఖచ్చితంగా దీంట్లో ఏదో గూడుపుఠాణి వుంది"

"గూడుపుఠాణి లేదు, పల్లీ బఠాణిలేదు. రవి స్రవంతిని చూడగానే నచ్చిందన్నాడు. నాకు కూడా ఆ అమ్మాయిలో వంక పెట్టడానికేమీ కన్పించలేదు" మాధవరావుగారు ఎప్పుడు వచ్చారో తెలియదు ఆయన తీరికగా సోఫాలో కూర్చుంటూ అన్నాడు.

ముఖం ప్రసన్నంగా మార్చబోయి చేతకాక అలాగే ధుమధుమ లాడుతూ అడిగింది వరలక్ష్మి.

"రవి ఎక్కడ చూశాడు ఆ అమ్మాయిని?"

"పెళ్లి చూపులలో"

"ఎవరు చెప్పారు నాన్నా మీకింత గొప్ప సంబంధం?" వ్యంగ్యంగా అడిగింది.

"పెళ్లిళ్ల పేరయ్యగారు"

"రవికి ఆ సంబంధం మీరు చూసిన విషయం ముందే నాకు ఎందుకు చెప్పలేదు? అన్నీ నిర్ణయించుకుని వచ్చాక చెబుతారా?" ఎన్నాళ్లనుంచో వున్న మంటని కక్కేసింది వరలక్ష్మి.

"మీ అమ్మకే చెప్పలేదు. చెప్పానా త్రిపురా?"

ఆవిడ భర్తనోసారి మాడ్చేసేలా చూసి తల తిప్పుకుంది.

"శ్రీధర్ పెళ్లి విషయంలో మీ అమ్మ నన్ను సంప్రదించలేదు. నీ పెళ్లి కూడా ఆవిడ ఇష్టప్రకారమే జరిగింది. రవి పెళ్లి నా ఇష్టప్రకారం జరపడానికి నాకు హక్కు లేదా?"

"హక్కు మాట అటువుంచి అంత గతిమాలిన సంబంధం చెయ్యవలసిన అగత్యమేమిటి నాన్నా?"

"స్రవంతి ఈ ఇంటి కోడలు కావడానికి ఏమిటి అనర్హత? వాళ్లకి ఆస్తి లేదనేగా? ఆస్తి మనకి లేదా?" ఆయన అక్కడనుంచి లేచి వెళ్లిపోయాడు.

భ్రమరాంబ, వరలక్ష్మి పళ్లు కొరుక్కుంటూ అసహాయమైన కోపంతో ఉడికిపోయారు.

★ ★ ★

స్రవంతి తను తీసుకున్న నిర్ణయం తప్పా ఒప్పా అని ఆలోచించడంలేదు. ఎలాగైనా అత్తగారిని మెప్పించాలి. అంతే!

రిక్షా బజారు సెంటర్‌లో ఆగగానే ఆమె దిగి రిక్షా వాడికి డబ్బిచ్చి పంపింది. చకచకా నడుస్తూ జ్యూయెలరీ షాపులున్న చోటకి వచ్చింది. శ్రీజ్యూయెలర్స్ అని పెద్ద




బోర్డువున్న ఆ షాపు షట్టర్స్ మూసేసి వున్నాయి. ఆమె ఇంకా ముందుకి నడిచింది. ఆ పక్కనే వున్న మరో నాలుగు జ్యూయెలరీ షాపులు కూడా మూతబడి వున్నాయి. మిగిలిన షాపులన్నీ తెరిచి వుండగా, ఒక్క జ్యూయెలరీ షాపులు మాత్రమే మూసి వుండడం ఆమెకి ఆశ్చర్యాన్ని కలుగచేసింది. పక్కనేవున్న ఫ్యాన్సీ షాపులోకి వెళ్లి ఆ షాపతన్ని అడిగింది.

"శ్రీజ్యూయెలర్స్ ఓనర్‌గారు రాత్రి చనిపోయారమ్మా! సంతాప సూచకంగా ఇవాళ జ్యూయెలరీ షాపులన్నీ మూసేశారు" అన్నాడతను.

స్రవంతి కర్తవ్య విమూఢంగా క్షణకాలం అలాగే నిలబడిపోయింది. రాత్రి ప్రయాణం, ఏం చెయ్యడానికీ టైములేదు. ఆమెకి తన ఆలోచన కార్యరూపంలోకి రానందుకు ఆశాభంగంగా అన్పించింది. చేసేదిలేక ఇంటికి బయలుదేరింది.

అన్నపూర్ణమ్మ కూతురి పాదాలకి పసుపు రాసి కొత్త చీర, చలిమిడి ఆమె ఒడిలో పెట్టింది.

స్రవంతికి కన్నీళ్లు వస్తున్నాయి. కన్నవాళ్లని విడిచిపెట్టి అత్తవారింటికి వెళ్తున్నప్పుడు కలిగే దుఃఖం కాదామెది.

తండ్రి రవిచంద్రకి ఆషాఢపట్టీగా ఇచ్చిన రెండు వేలు చూసి అత్తగారి కళ్లలో మెదిలే చులకన భావాన్ని తలచుకుని ఆమెకి నిస్సహాయతతో దుఃఖం వస్తోంది.

కూతురి కన్నీళ్లు చూసి తల్లికీ దుఃఖం వచ్చింది. కాని దుఃఖాన్ని నిగ్రహించుకుంటూ కూతుర్ని ఓదార్చింది.

"తప్పు! శుభమా అని అత్తవారింటికి వెళ్తూ అలా కన్నీళ్లు పెట్టుకోకూడదు. నేనసలు మీ అత్తగారికి ఆషాఢం పట్టింపు లేదేమో నిన్నిక్కడకి పంపరేమో అనుకున్నాను. ఏదో ఆ వంకన వచ్చి నెల రోజులున్నావు. మళ్లీ వరలక్ష్మి వ్రతానికి పంపిస్తారేమోలే"

"మళ్లీ ఎప్పుడొస్తావక్కా" అవంతి, వాసు అడిగారు.

"త్వరలోనే వస్తానమ్మా! మీరు బాగా చదువుకోండి"

"అల్లుడిని అడిగానని చెప్పమ్మా! నేను నువ్వు వస్తున్నావని ఫోన్‌లో చెప్పాను. స్టేషన్‌కి వస్తానన్నాడు" అన్నాడు చలపతిరావు.

"మీరు స్రవంతితోబాటు వెళ్తే బాగుండేది. నన్ను వెళ్లమంటున్నారు. వంటకి ఇబ్బంది" అంది అన్నపూర్ణమ్మ.

"నేను లేనేమిటి? వంట బ్రహ్మాండంగా చేస్తాను" అంది అవంతి.

చలపతిరావు ఆటో పిలుచుకు వచ్చాడు.



తల్లీతండ్రీ వెళ్లాక శ్వేత గోడవారగా పెట్టిన తన పెట్టెని తీసుకుని గదిలోకి వెళ్లబోయింది. తమ గది తలుపు తాళం పెట్టి వుండడం గమనించి అత్తగారి దగ్గరకి వెళ్లింది.

"అత్తయ్యా! మా గది తలుపు తాళం వేసి వుంది. తాళం చెవి ఇస్తారా? "

"ఆ గది ఇంక మనది కాదమ్మా! అంత అద్దె కట్టలేమని నేనే వద్దన్నాను. ఎలాగోలా

సర్దుకుందాం. నీ పెట్టె మా గదిలో పెట్టుకో"

శ్వేత తలవూపి పెట్టెని అత్తగారి గదిలో పెట్టింది. పెట్టె తెరిచి బట్టలు తీసుకుని స్నానానికి వెళ్లింది. ఆమె స్నానం ముగించి తిరిగి గదిలోకి వచ్చేప్పటికి పెట్టెలో బట్ట లన్నీ కెలికినట్టున్నాయి. పనిమనిషి గదులు తుడవడానికి వచ్చినప్పుడు పెట్టె అంతా కెలికి తండ్రి తనకి ఇచ్చిన డబ్బు తీసేసిం దేమో అనే అనుమానం కలిగింది. ఆమె ఆందోళనగా బట్టలన్నీ తీసి చూసింది. పర్సులో పెట్టిన డబ్బు అలాగే వుంది. ఆమె గుండె తేలికపడింది. డబ్బు తీసుకుం దామనుకుని తను వస్తున్న అలికిడై తీసుకో లేక పోయిందేమో అనుకుంది. ఆమె బట్ట లన్నీ యథాతథంగా సర్ది పెట్టెని మంచం కింద తోసింది.

ఆ రాత్రి రాజేశ్వరమ్మ శ్వేతని పిలిచి చెప్పింది. "మీరు ఆ గదిలో పడుకోం డమ్మా. నేను, మీ మామగారు ముందు గదిలో పడుకుంటాం"

"ఎందుకత్తయ్యా?" శ్వేత మొహమా టంగా అంది.

"కొత్తగా పెళ్లయిన వాళ్లు మీరు. మాదే ముంది. ఎక్కడ పడుకున్నా ఒకటే"

అత్తగారు తనతో ప్రేమగా మాట్లాడడా నికి కారణం తండ్రి ఇచ్చిన డోస్ వలనా, లేక ఏదైనా ప్లానా అన్నది ఆమెకి అర్థం కాలేదు.

ఆ రాత్రి మోహన్ కురిపించిన ప్రేమ వర్షంలో తడిసి ముద్దయిపోయిందామె మనసు. భార్య భుజం మీద సేదదీరుతూ అన్నాడు.

"మా అమ్మ ఏదో వేళాకోళంగా అన్నదా నికి ప్రొద్దుట మీ నాన్నగారు ఎంత లెక్చర్ ఇచ్చారో చూశావా? ఆయన భయపడ డంలో అసహజమేమీ లేదనుకో. డబ్బు కోసం కోడలిని కిరసనాయిలు పోసి తగల బెడుతున్న దుర్మార్గులున్న సమాజం మనది. కాని మమ్మల్ని అలాంటి వ్యక్తులతో ఆయన జమ కట్టడం విచిత్రం"

శ్వేత మాట్లాడలేదు.

"మా అమ్మ మనసు ఎంత మంచిదో చూశావా? మనకోసం ఈ గదిని వదిలి, ఇరుగ్గా వున్న ముందు గదిలో వాళ్లు ముగ్గురూ సర్దుకుని పడుకున్నారు. అసలు మా నాన్నగారికి మంచం పరుపూ లేకుండా నిద్రపట్టదు.

"అరె" శ్వేతకి గిల్టీగా వుంది. "మనం వాళ్ల గదిలో పడుకోకుండా వుండవలసింది"

"నిజమే కాని ఈ ఇంట్లో వున్నవే మూడు గదులు. అందులో ఒకటి వంటిల్లు. ముందు గదిలో మనం పడుకుందామంటే రమేష్ ఎక్కడ పడుకుంటాడు?"

"అద్దె కట్టలేమని ఇంకో గది వద్దన్నారుట అత్తయ్యగారు"

"అవును. నిజమే... నాకు జీతం పెరిగే అవకాశాలు తక్కువ. అందుకే వచ్చే నెల నుంచి ఓవర్ టైమ్ చెయ్యాలనుకుంటు న్నాను. అప్పుడైతే మనకోసం ఆ గది అద్దెకి తీసుకోగలం"

శ్వేత మనసు ద్రవించిపోయింది.

"నిన్న పాలవాడు వచ్చి నానా గొడవ చేసిపోయాడు రెండు నెలల నుంచి పాలు పోయించుకుని డబ్బివ్వలేదని. తెల్లవారి ఎవరి దగ్గర అప్పుచెయ్యాలో?"

శ్వేతకి జాలేసింది.

"మా నాన్నగారు నా ఖర్చులకోసం పది హేను వందలు ఇచ్చారు. నాకు ప్రత్యేకంగా ఖర్చులేం వున్నాయి? ఆ డబ్బు తీసుకుని ఇబ్బంది నుంచి బయటపడండి" అంది పర్సులోనుంచి డబ్బు తీసి ఇస్తూ.

"థ్యాంక్‌యూ! ఈ నెలకి ఎలాగో పర్వా లేదు" అతను డబ్బుని తలగడ కింద దాస్తూ అన్నాడు.

"నేను ఉద్యోగం చేస్తాను" అంది.

"నీచేత ఉద్యోగం చేయించితే తప్ప ఇల్లు





గడవకపోతే అలాగే చేద్దువుగాని. ప్రస్తుతానికి ఆ ఆలోచనవద్దు. నిన్ను కష్టపెట్టడం ఇష్టంలేదు" అన్నాడు.

శ్వేత మనసు అతని అనురాగానికి వెన్న ముద్ద అయింది.

★ ★ ★

"కులాసానా వదినగారూ? మర్యాదగా పలుకరించిన అన్నపూర్ణమ్మని నిరసన, తృణీకారం మిళితమైన భావంతో ఒక్క చూపు చూసి "ఆc మీ దయవల్ల" అంది పుల్లవిరుపుగా త్రిపురాంబ.

"అన్నయ్యగారు కులాసాగా వున్నారా? "

"నిక్షేపంలా వున్నారు" అంటూనే ఏదో పని వున్నట్టు గదిలోకి వెళ్లిపోయింది.

అన్నపూర్ణమ్మ వియ్యపురాలి ప్రవర్తనతో చిన్నబుచ్చుకుంది. కూతురి పెళ్లయ్యాక మొదటిసారిగా ఆ ఇంటికి వచ్చిన ఆమెకి గుమ్మంలో అడుగు పెడుతూనే ఎదురయిన నిరాదరణ మనసు చివుక్కుమనేలా చేసింది. ఎందుకు ఈ ఇంటికి వచ్చానా అన్పించింది క్షణకాలం.

"బాగున్నారా అక్కయ్యగారూ? బావగారు కులాసానా? " గదిలోనుంచి మాధవరావుగారు వచ్చి మర్యాదగా పలుకరించాడు. అన్నపూర్ణమ్మ తేరుకుని సమాధానమిచ్చింది.

"స్రవంతీ! మీ అమ్మగారిని ఇక్కడే నిలబెట్టేశావేమిటి? గెస్ట్ రూమ్‌లో పక్క దుప్పట్లవీ మార్పించు. ముందు కాఫీ కలిపి తీసుకురా" ఆయన తన తల్లిపై చూపిస్తున్న ఆదరాభిమానాలకి స్రవంతి కళ్లు చెమర్చాయి.

"రవి ఏడి? "

"బావగారితో మాట్లాడుతున్నారండి? "

"మీరు ఊరినుంచి వచ్చిన విషయం వాడికి తెలుసా? "

"ఆయన స్టేషన్‌కి వచ్చి మమ్మల్ని ఇంటికి తీసుకొచ్చారుకదండీ? "

"లోపలకి వచ్చి మాట్లాడకుండా కొంపమునిగినట్టు వీధిలో మకాం పెట్టాడేమిటి? " ఆయన వీధిలోకి వెళ్లారు.

స్రవంతికి మామగారు తన తల్లిపై చూపిస్తున్న ఆదరాభిమానాలకి, కనీస మర్యాదకి ధైర్యం వచ్చింది.

"రామ్మా! కాఫీ తాగుదాం" అని వంట గదివైపు దారితీసింది. అన్నపూర్ణమ్మ సంశయంగా డైనింగ్ టేబిల్ దగ్గర ఆగిపోయింది.

కల్పన వచ్చి పలుకరించింది. "బాగున్నారండి? " అన్నపూర్ణమ్మ ఆమెతో మాట్లాడుతోంది. స్రవంతి కాఫీ గ్లాసులతో ఇవతలకి వచ్చింది.

మాధవరావుగారు తాయారమ్మగారిని పిలిచి చెప్పాడు.

"రవి అత్తగారు వచ్చారు. మామూలుగా వండే వంట కాకుండా ఏదైనా స్వీటు చెయ్యండి"

"అలాగేనయ్యగారూ? " అందావిడ.

అన్నపూర్ణమ్మ ఆ ఇంట్లోని మనుషుల మనస్తత్వాలను ఒక్క చూపులోనే గ్రహించింది.

కల్పనలోని అహం, త్రిపురాంబ ముఖంలో తనని చూడగానే పిలిచినట్టే వచ్చిన అయిష్టతని చూడగానే తను భయపడుతున్నది నిజమని గ్రహించి ఆవిడ శరాఘాతం తగిలిన వ్యక్తిలా విలవిలలాడుతోంది.

కల్పన తల్లి మహేశ్వరి ఆ ఇంటికి వచ్చినప్పుడు అత్తగారు ఎంత అగ్గగ్గలాడుతూ మర్యాదలు చేసినదీ గుర్తొచ్చిన స్రవంతికి ఆవిడ తన తల్లికి, కల్పన తల్లికి మధ్య చూపిస్తున్న తేడా అర్థమై మనసులో ముల్లు గుచ్చుకున్నట్టయింది. తను బాధపడుతున్న విషయాన్ని గ్రహిస్తే తల్లి కూడా బాధపడుతుంది. ఆమె అసలేమీ జరగనట్టుగా తల్లిని తన గదిలోకి తీసుకెళ్లింది.

"మా అత్తగారు చాలా మంచి మనిషమ్మా. కాని ఆవిడకి మూడ్ బాగా లేన

ప్పుడు సాక్షాత్తూ ఆ దేముడే దిగివచ్చినా సరిగ్గా మాట్లాడదు. ఇవాళ మనం వచ్చే ముందు ఇంట్లో ఏదో జరిగి వుంటుంది" అంది నవ్వేస్తూ.

"బాగా లేనిది మీ అత్తగారి మూడ్‌కాదు. ఆవిడతో ఆస్తిలో అంతస్తులో సరితూగని నాకు మర్యాద చెయ్యక్కర్లేదనే చులకన భావం" మనసులోనే అనుకుంది అన్నపూర్ణమ్మ.

స్రవంతి స్నానం చేసి వచ్చి అందరికీ బ్రేక్‌ఫాస్ట్ రెడీ చేసింది.

"మీ అమ్మగారిని కూడా రమ్మను స్రవంతీ!" మాధవరావు అన్నాడు.

"మా అమ్మకి బ్రేక్‌ఫాస్ట్ అలవాటులేదు మామయ్యగారూ!"

వరలక్ష్మి లోపలకి వస్తూనే అడిగింది. "నువ్వెప్పుడొచ్చావు? " నిజానికి ఆమెకి స్రవంతి ఈ రోజు వస్తోందనే విషయం ముందే తెలుసు.

"ఇవాళ ప్రొద్దుటే వచ్చాను" అంది స్రవంతి.

అప్పటికే స్నానం చేసి వచ్చిన అన్నపూర్ణమ్మ వరలక్ష్మిని మర్యాదగా పలుకరించింది.

"బాగున్నారా? "

"ఆఁ ఆయన కులాసాగా వున్నారా? " అని ఆవిడ సమాధానం కోసం ఆశించకుండానే "మా అమ్మ ఏది? " అనడిగింది స్రవంతిని.

"గదిలో వున్నట్టున్నారు" అంది.

"వెళ్తాను" అని వరలక్ష్మి తల్లి గదిలోకి వెళ్లింది.

"నీ పద్ధతి నాకేం నచ్చలేదు. ఆవిడ మొదటిసారిగా మన ఇంటికి వచ్చారు. కల్పనా వాళ్లమ్మగారు వస్తే ఇలాగే ప్రవర్తించావా? " అన్నాడు మాధవరావు.

"ఎవరికెలా మర్యాద చెయ్యాలో నాకు బాగా తెలుసు. మీరేం చెప్పక్కర్లేదు" గదిలోకి వస్తున్న కూతురిని చూసి ఆగిపోయింది త్రిపురాంబ.

"ఛీఛీ! నువ్వింక మారవు. మారతావని ఆశించడం కూడా నాదే బుద్ధి తక్కువ" ఉక్రోషంగా బయటకి వచ్చేశారు మాధవరావుగారు.

ఎర్రబడిన తల్లి ముఖాన్ని చూస్తూ, తల్లి దండ్రుల మధ్య జరిగిన వాగ్వివాదాన్ని ఊహిస్తూ అడిగింది.

"స్రవంతీ వాళ్ళమ్మగారు కూడా వచ్చిందే? రవికి ఆషాఢ పట్టీ ఏం తెచ్చారు? "

"ఆఁ! తెచ్చింది. వెండికంచాలు, భమిడిపళ్ళాలు" ఈసడింపుగా అంది.

"ఆవిడ ఇక్కడ, నాలుగైదురోజులు వుండే ప్రయత్నంలోనే వచ్చిందా? "

"ఆవిడకి వుండాలని వున్నా లేకపోయినా మీ నాన్న వుండమని బలవంతం చేసేలాగే వున్నారు. వచ్చిన దగ్గరనుంచి చూస్తున్నానుగా? "అక్కయ్యగారు అక్కయ్యగారు" అంటూ ఎంతలా అగ్గగ్గలాడిపోతున్నారో? "

"ఆయన ఎప్పుడూ అంతేగా? ఆయినవాళ్ళకి ఆకులలో కాని వాళ్ళకి కంచాలలో పెట్టే రకం" ఈసడింపుగా అంది. "కన్నకూతుర్ని ఇంటికి వస్తే ఎందుకొచ్చావన్నట్టు చూస్తారు. ఆవిడ ఎక్కువయిపోయింది"

తిరిగి గదిలోకి వచ్చిన మాధవరావుగారన్నారు.

"నువ్వు ఈ ఇంట్లో పుట్టి పెరిగినదానిని నీకు మర్యాద చెయ్యడమేమిటి? అదీగాక ఏడాదికోసారి వచ్చేవాళ్ళకి మర్యాద చెయ్యాలి తప్ప రోజూ వచ్చేవాళ్ళకి మర్యాదలేమిటి? "

"అంటే! నేను రోజూ మీ ఇంటికి వస్తున్నాననేగా? " ఉక్రోషంగా అంది.

"నువ్వు ఖాళీగా వున్నావు కాబట్టి వస్తున్నావు. నీకు అడుగడుగునా మర్యాద చెయ్యడానికి ఈ ఇంట్లోవాళ్ళకి ఖాళీ వుండద్దూ? అందుకే ఆడపిల్ల గ్రీష్మంలో వచ్చే వర్షంలా పుట్టింటికి వస్తూవుండాలి




శ్రావణ భాద్రపదాలలో వచ్చే వర్షంలా వద లకుండా వస్తుంటే చీదరగా వుంటుంది"

"చూశావా అమ్మా! నాన్న ఎలా అంటు న్నారో?" వరలక్ష్మి కళ్లల్లో నీళ్ళూరాయి.

"వరలక్ష్మి నా కూతురు. ఈ ఇంటి ఆడ బడుచు. దానికి ఈ ఇంట్లో అమర్యాద జరి గితే నేను సహించను"

తల్లీ తండ్రీ కీచులాడుకోడం వరలక్ష్మికి నచ్చలేదు.

ఇది నీ ఇల్లు. నీ ఆహ్వానం లేకుండా వచ్చేవాళ్లకి నువ్వు మర్యాద చెయ్యనవసరం లేదు" అని ఎగసన దోసింది.

"అహంభావంలో పెడసరంగా మాట్లా డ్డంలో ముమ్మూర్తులా తల్లిని పోలిన కూతురివైపు తిరస్కారంగా ఒక్కచూపు చూసి, మాధవరావుగారు అక్కడనుంచి నిష్క్రమించారు.

"నేను బయటికి వెళ్ళొస్తానమ్మా!" అంది స్రవంతి.

"అలాగే! వచ్చేప్పుడు నాకేదైనా టాబ్లెట్ వుంటే పట్రా! నిన్నటినుంచి కడుపునెప్పిగా వుంది" అంది అన్నపూర్ణమ్మ.

"మందులు ఇంట్లోనే వుంటాయి" అంటూ స్రవంతి అలమరలోనుంచి చిన్న మెడికల్ కిట్‌లాంటిది తెరిచింది. అందులో ఎమ ర్జెన్సీ కోసం కొనివుంచిన మందులున్నాయి. ఒకమాత్ర తీసి మంచినీళ్ళతోబాటు తల్లికి అందిస్తూ అడిగింది.

"ఏమైనా తాగుతావామ్మా?"

"వద్దు, కాస్సేపాగి కడుపునెప్పి తగ్గితే చూద్దాం"

"మాత్ర వేసుకుని, కాస్సేపు రెస్ట్ తీసుకో" అని స్రవంతి పర్సు తీసుకుని బయటికి వచ్చింది.

సోఫాలో పక్కపక్కన కూర్చుని ఏదో మాట్లాడుకుంటున్న వరలక్ష్మీ, త్రిపురాంబ ఆమెని చూసి మాటలాపారు.

"నేను బజారుకి వెళ్ళొస్తానత్తయ్యా"

"వెళ్ళు" అంది త్రిపురాంబ పొడిగా.

"ఒక్కర్తివీ వెళ్ళగలవా?" అడిగింది వర లక్ష్మి.

"వెళ్ళగలనండీ" చెప్పి బయటకి వచ్చింది. ఆమె వెళ్ళేదాకా ఆగిన ఆమె అడిగింది తల్లిని.

"స్రవంతీ వాళ్ళమ్మకి చీరపెట్టాలేమో?"

"అటునుంచి మనకి వచ్చేదేమైనా వున్నా లేకపోయినా ఈ మర్యాదలు తప్పవుగా?" అంది త్రిపురాంబ ఈసడింపుగా.

"రెండొందలు పెడితే ఉప్పాడ చీర వస్తుంది. అది పెట్టు"

"ఆః! లేకపోతే కంచిపట్టో, గద్వాల్ చీరో పెడతాననుకున్నావా?"

"గది వదిలి బయటకి రాదేం అసలు?"

అప్పుడే అక్కడకి వచ్చిన కల్పన చెప్పింది. "కడుపు నెప్పిగా వుందని పడుకు న్నారుటండీ"

"మన ఇంట్లో తాగిన ఫిల్టర్ కాఫీ అరగ లేదేమో?" వ్యంగ్యంగా అంది వరలక్ష్మి.

త్రిపురాంబ నవ్వింది.

"మీ చీర బాగుందండీ" అంది కల్పన.

"ఇదా! పోయినసారి మీ అమ్మగారు పెట్టి నదే" అంది వరలక్ష్మి.

"అవునా?" అంది. నిజానికి కల్పనకి ఆ చీర తల్లికొన్నదే అని తెలుసు. మరోసారి ఆమెచేత పొగిడించుకోవాలని కావాలనే అలా అడిగింది.

"రవి పెళ్ళిలో స్రవంతీవాళ్ళు పెట్టిన చీర మా పనిమనిషికిస్తే నీళ్ళలో ముంచగానే రంగు పోయిందని నాముఖాన కొట్టినంతప నిచేసింది"

"నా చీరా పనిమనిషికే ఇచ్చేశాను. ఇవాళ అది కట్టుకుంది. చూడలేదా మీరు" అంది కల్పన.

"మీ పెళ్ళిలో మీ అమ్మగారు పెట్టిన ఆలి వ్‌గ్రీన్ కలర్ కంచిపట్టుచీర నేను మొన్న మావారి ఫ్రెండ్ కూతురి పెళ్ళిలో కట్టు కుంటే అందరూ ఎంత బాగుందన్నారో"

కల్పన అతిశయంగా నవ్వింది.



వంటింట్లోనుంచి తాయారమ్మగారు రుస రుసలాడుతూ వచ్చింది. "నేను రేపటినుంచి నాలుగు రోజులు సెలవు పెడుతున్నానం డోయ్"

"మీరు సెలవు పెడితే ఎలాగండీ? " త్రిపురాంబ నిస్పృహాయంగా అంది.

"ఏమో మీ తంటాలు మీరు పడండి. ఇలా వచ్చీపోయే జనాలందరికీ వండడం నా వల్లకాదు"

"వచ్చేపోయే జనాలంటే ఎవరు? నేనేనా" వరలక్ష్మి ముఖం చిట్లిస్తూ అంది.

"మిమ్మల్నెందుకంటానండీ? " అంది తాయారమ్మగారు. ఆవిడ బాధ ఆవిడది. మహేశ్వరి రైలు దిగి వస్తూనే రెండు జరీ చీరలని ఆవిడకిస్తుంది. రెండూ గట్టిచీరలే. మడత నలగని రంగైనా పోని ఆ చీరలని తాయారమ్మగారు ఏడాది పొడుగునా కట్టుకుంటుంది. అన్నపూర్ణమ్మ వాలకం చూస్తే తనచేతిలో కనీసం పదిరూపాయలైనా పెట్టేట్టు కనిపించడంలేదు.

"వంటేం చేశారు? " వరలక్ష్మి మాటమారుస్తూ అడిగింది.

"ఏంచెయ్యలేదని అడగండి. రెండుకూరలు, పప్పు, పెరుగు పచ్చడి, సాంబారు ఇంకా కాజాలు చెయ్యాలి. ఆ పని అలాగే వుంది"

"ఇవాళేమిటి విశేషం? "

"వియ్యపురాలుగారు వచ్చారుకదూ? అందుకు. అయ్యగారు ఆర్డరు వేశారు. తప్పుతుందా? " ఆవిడ గొణుక్కుంటూ వెళ్ళిపోయింది.

గదిలో పడుకుని వున్న అన్నపూర్ణమ్మ కళ్ళలో నీళ్ళూరుతున్నాయి. స్రవంతి బయటకి వెళ్ళాక తను గదిలో కూర్చుంటే వియ్యపురాలు ఏమైనా అనుకుంటుందని ఆవిడ బయటకి రాబోయింది.

"మనింట్లో ఫిల్టర్ కాఫీ అరగలేదేమో" అని వరలక్ష్మి వ్యంగ్యంగా అన్న మాటలని స్పష్టంగా విన్న ఆవిడ స్థాణువయింది. ఆ స్వరంలోని చులకన భావం చురకత్తిలా ఆవిడ మనసుని కోస్తోంది. 'అంటే! ఎప్పుడూ చిక్కనికాఫీ తాగి ఎరుగని తను ఇక్కడ వీళ్ల ఇంట్లో తాగి అరగక కడుపునెప్పితో బాధపడుతోందనేనా ఆవిడ మాటలలోని భావం? తను తిండికి ముఖంవాచిందనేగా ఆవిడ మాటలకి అర్థం. చుట్టపుచూపుగా ఈ ఇంటికి మొదటిసారిగా వచ్చిన తననే ఇంత చులకనగా చూస్తున్నారే? ఇంక స్రవంతికి ఈ ఇంటి కోడలిగా ఇవ్వవలసిన మర్యాద ఇస్తున్నారా? '

ఆవిడకి కూతురు ఈ ఇంట్లో సుఖంగా లేదనే అనిపించింది. కలిగిన ఇంట్లో ఆమె సుఖపడుతుందనే దురాశతో ముందువెనుకలు ఆలోచించకుండా ఈ సంబంధానికి అంగీకరించిన తమ అవివేకానికి బాధ కలిగింది. ఆవిడ కళ్లల్లో నిండిన నీళ్లు చెంపలపైకి జారిపోతున్నాయి.

ఎవరో వస్తున్న శబ్దం విని కళ్లు రెండూ గట్టిగా తుడుచుకుని అటు చూసింది. స్రవంతి!

"కడుపునెప్పి తగ్గిందామ్మా? " ఆమె అడుగుతూ వచ్చి తల్లి పక్కనే కూర్చుంది.

"ఇందాకటి తీవ్రత లేదుగానీ ఇంకా కొంచెం వస్తోంది. ఒకపూట కడుపు మాడిస్తే అదే పోతుంది" అందావిడ నవ్వడానికి విఫలప్రయత్నం చేస్తూ.

స్రవంతి పర్సులోనుంచి డబ్బుతీస్తూ అంది. "అమ్మా! మధ్యాహ్నం భోజనానికి మా ఆయన ఇంటికి వస్తారు. అప్పుడు ఈ డబ్బు ఆయనకిచ్చి నవరత్నాల ఉంగరం చేయించుకోమని చెప్పు"

"ఇంత డబ్బు నీకెక్కడిది? "

"ఆయనే ఇచ్చారు. మా అత్తగారు మంచి మనిషేకాని, భేషజాలకి ప్రాణమిచ్చే వ్యక్తి. మీరు రవికి ఏ రెండువేలో, మూడువేలో ఆషాఢపట్టీగా ఇచ్చారంటే ఆవిడ సర్కిల్‌లో చిన్నతనంగా ఫీలవుతుంది. అందుకని మీ అల్లుడు రహస్యంగా తన అకౌంటులోనుంచి




ఈ డబ్బు తీసిచ్చారు. నువ్వు మా అత్తగారి ఎదురుగా ఈ డబ్బు మీ అల్లుడికియ్యి."

కూతురినే రెప్పవాల్చకుండా చూస్తున్న అన్నపూర్ణమ్మ అడిగింది. "అబద్ధం చెప్పడం కూడా చేతకాదు నీకు, నీ మెడలో గొలు సేది? "

"అది తెగిపోయింది"

"పెళ్ళిముందు చేయించిన గొలుసు. రెండు నెలలైనా అవకుండా తెగిపో యిందా? గొలుసు అమ్మి ఈ డబ్బు తెచ్చా వుకదూ? "

"అమ్మా! అది..." స్రవంతి తప్పుచేస్తూ పట్టుబడిన వ్యక్తిలా చూసింది.

"ఈ డబ్బు నిజంగా మేమే ఇచ్చినా మీ అత్తగారు నమ్మరు. ఎందుకంటే ఆవిడ దృష్టిలో మేము తిండిముఖం కూడా తెలి యని దరిద్రులం. అయినా మేము వేలకి వేలు బహుమతులనిచ్చే వాళ్ళమో కాదో ఆవిడకి తెలియదా? పెళ్ళిలోనే ఆవిడ మా తాహతేమిటో కనిపెట్టిందిగా? "

"అమ్మా! వాళ్ళు నిన్ను ఏమైనా అన్నారా? " స్రవంతి అడగలేక అడిగింది. అప్పటికే ఆమె ముఖం పాలిపోయింది.

"అది అప్రస్తుతం! అయినా ఇప్పుడు ఈ డబ్బు మీ ఆయనకి బహుమానంగా ఇచ్చి మా గొప్ప చాటుకున్నా మళ్ళీ ఏ పండుగకో అంత డబ్బు కానుకగా ఇవ్వడానికి ఏం అమ్మేస్తావు? "

స్రవంతికి కన్నీళ్ళు వస్తున్నాయి. "ఈ ఇంట్లో నీకు జరిగిన అవమానం ఏమిటో చెప్పకపోతే నాపై ఒట్టే" అంది తల్లి చేతిని తన తలపై పెట్టుకుంటూ.

అన్నపూర్ణమ్మ కళ్లలో నీళ్ళూరాయి. ఆవిడ వరలక్ష్మి అన్న మాటలనీ, ఖండించకుండా త్రిపురాంబ నవ్వడాన్ని చెప్పింది. వింటున్న ఆమె రక్తం సలసల మరిగిపోయింది. రోజంతా అందరి బట్టలూ ఉతికి బండెడు గిన్నెలుతోమే పనిమనిషికి కప్పు కాఫీ ఇవ్వ డానికి ముఖం చూసుకునే మనుషులు వీళ్లు. అలాంటివాళ్లు తన తల్లి కాఫీ ముఖం ఎరుగనిదని చులకనగా మాట్లాడతారా?

"స్రవంతీ! ఒక్క విషయం గుర్తుంచుకో! డబ్బుతో అభిమానాన్ని కొనలేం. మా నాయనమ్మ అంటూండేది. కడుపునిండా అన్నం తిన్నవాడు మరో ముద్ద ఎక్కువ యినా ఇంక చాలంటాడు. అదే డబ్బిస్తే ఎంత ఇచ్చినా తృప్తి పడడని. మీ అత్తవారు కూడా అందుకు అతీతులు కారు. కోడలిని కట్నం చాలదని కిరసనాయిలు పోసి తగ లబెట్టే అత్తగార్లకంటే ఇలాంటివాళ్లు మరీ ఘోరం. మీ అత్తవారిలా ఐశ్వర్యంతో మదించినవాళ్ళు కట్నం అడగరు. లాంఛనా లనీ కానుకలనీ ఆశిస్తారు. కట్నం పెళ్ళిలో ఒకసారే ఇచ్చేది. కానుకలు జీవితమంతా ఇస్తూనే వుండాలి. ఇలాంటివాళ్ళ ఆశకి అంగుడు వుండదు. ఆ ఆశ తీర్చాలని నువ్వు ప్రయత్నించి నీ వ్యక్తిత్వాన్ని దిగజా ర్చుకోకు"

స్రవంతికి కన్నీళ్లు వస్తున్నాయి. తను ఎంత తెలివితక్కువగా ప్రవర్తించిందీ తల చుకుని సిగ్గుతో వస్తున్న కన్నీళ్లవి. తను ప్రయాణమై వెళ్తూ పెళ్లిలో అత్తగారు పెట్టిన నగలన్నీ ఆవిడ చేతికిచ్చింది. ఆ నగలు తన ఒంటిమీద వుంటే దురదృష్టవ శాత్తు జరగకూడనిదేదైనా జరిగి ఏ ఒక్క నగైనాపోతే అది దొంగిలింపబడిందని చెప్పినా, అత్తగారు నమ్మదు. తండ్రి అవస రానికి తనే ఆయనకిచ్చిందని , ఆయన అమ్ముకుని తిన్నాడని అంటుందని భయం తోనే తను నగలని ఆవిడకి అప్పగించింది. కాని తన తండ్రి తనకి పెట్టిన గొలుసుని అమ్మితే మాత్రం ఆవిడకి అనుమానం రాదా? ఆమె అత్తగారు ఆ గొలుసు గురించి అడిగితే ఏం జవాబివ్వాలా అని భయపడింది.

రవి గదిలోకి వచ్చాడు. "రండి అత్తయ్యా భోజనం చేద్దాం"

"ఒక్కనిమిషం బాబూ!" అన్నపూర్ణమ్మ

తన పర్సులోనుంచి భర్త అతనికిమ్మని ఇచ్చిన రెండువేలూ అతని ముందుకి జాపింది.

"ఇదేమిటత్తయ్యా! ఎందుకిది? "

"కొత్త అల్లుడికి ఆషాఢపట్టీ ఇవ్వడం మన ఆచారం బాబూ! ఏదో మా శక్తికొద్దీ చంద్రుడికో నూలుపోగులా మేం నీకిస్తున్న చిన్న కానుక ఇది. నువ్వు తిరస్కరిస్తే బాధపడతాను"

రవి చప్పున ఆ డబ్బు అందుకుని, స్రవంతి చేతులలో పెట్టేశాడు.

"నువ్వే నాకేదయినా కొను. నాకేం కావాలో నాకే తెలియదు" అతని మాటలలోని నిష్కల్మషత్వానికి అన్నపూర్ణమ్మ మనస్ఫూర్తిగా నవ్వింది.

"నేను రాత్రి ట్రెయిన్‌కి వెళ్ళిపోతాను. టిక్కెట్టు తెప్పిస్తావా? " అంటూనే అతని సమాధానం కోసం ఆశించకుండా అతని చేతులలో కొంత డబ్బు పెట్టేసింది.

"అదేమిటి, ఇవాళేగా వచ్చారు? నాలుగు రోజులు వుండి వెళ్ళండి"

"అవంతికి వంట బాగా రాదు. మీ మామగారు అవస్థపడతారు. నేను మరో సారి వస్తానులే" అందావిడ. రవి ఫ్యాక్టరీకి ఫోన్‌చేసి ఆఫీస్‌బాయ్‌ని టిక్కెట్టు రిజర్వ్ చెయ్యమని చెప్పాడు.

"భోజనం చేద్దాం రండి"

"వద్దు బాబూ! నాకు కడుపు అప్‌సెట్ అయింది. ఇవాళ అసలే ప్రయాణం. రైలులో ఏమయినా అయితే కష్టం"

"కొంచెం మజ్జిగన్నమైనా తినమ్మా" అంది స్రవంతి.

"వద్దమ్మా! నాకు కడుపునెప్పి తగ్గలేదు. నువ్వెళ్ళి తినిరా" అంది ఆవిడ. తల్లి అబద్ధం చెబుతోందని, ఆడబడుచు మాటలతో ఆవిడ మనసు గాయపడిందని స్రవంతికి తెలుసు. ఆమె మనసు మండిపోతోంది. "మొదటిసారిగా తమ ఇంటికి వచ్చిన తల్లిని అవమానిస్తారా వీళ్ళు? "

ఆమె డైనింగ్‌హాల్‌లోకి నడిచింది. అప్పటికే అందరూ భోజనానికి ఉపక్రమించబోతున్నారు.

"మీ అమ్మగారిని భోజనానికి రమ్మను" అంది వరలక్ష్మి.

"మా అమ్మకి కడుపు అప్‌సెట్ అయిందండీ. అన్నం తినదు. పొద్దుట మన ఇంట్లో తాగిన ఫిల్టర్ కాఫీ అరగలేదుట" అంది స్రవంతి కూల్‌గా.

వరలక్ష్మి, త్రిపురాంబ ముఖాలు చూసుకున్నారు.

★ ★ ★

మరునాడు శ్వేత గదిలోకి వెళ్ళబోయినదల్లా మంచంమీద పడుకుని వున్న మామగారిని చూసి ఆగిపోయింది.

రాజేశ్వరమ్మ ఆ గది తలుపులు దగ్గరకి లాగి ఇవతలకి వస్తూ అంది.

"రాత్రంతా మీ మామగారు నిద్రపోలేదమ్మా! కింద పడుకున్నాంకదా! నడుమునెప్పితో ఒకటే బాధపడ్డారు. మీరు ఇవాల్టి నుంచి ముందుగదిలో పడుకోండి"

మరి రమేష్ ఎక్కడ పడుకుంటాడని శ్వేత అడగబోయింది. కాని అత్తగారిని అడగడానికి మొహమాటంగా అన్పించింది. మరోగంట తరువాత ఆమె ప్రశ్నకి సమాధానం దొరికింది.

చెరోక్యాంప్ కాట్ వేసుకుని, మరిది, భర్త ముందుగదిలో పడుకున్నారు. గోడవారగా వున్న కాస్త జాగా తప్ప తను పడుకోడానికి చోటు ఎక్కడుంది? ఆమె భర్తని సైగచేసి పిలిచింది.

మోహన్ బయటకి వచ్చాడు.

"నేను ఎక్కడ పడుకోను? "

"నీ ఇష్టం. వంటింట్లో పడుకో. లేదా ఆ మూల పడుకో"

తను వంటింట్లో పడుకోవాలా? శ్వేత కళ్ళలో నీళ్ళూరాయి.

చెట్టంత మరిదికెదురుగా ఆ గదిలో చాలీ చాలని జాగాలో ఎలా పడుకోవాలి?




వంటింట్లో పడుకోవాలంటే అత్తగారి గదిలో నుంచి వెళ్ళాలి. ఆమె సిగ్గుతో సగం చచ్చి గత్యంతరంలేక, ఆ ఇరుకుగదిలో వున్న కాస్త ఖాళీ జాగాలోనే పడుకుంది. ఎదురుగా మంచంమీద పడుకున్న మరిది తన వైపు దొంగచూపులు చూడడం, గతరాత్రి ప్రేమసాగరంలో తనని ఓలలాడించిన భర్త కనీసం తనవైపు చూడకుండా గుర్రుపెట్టి నిద్రపోవడం ఆమెకి ఏహ్యతని కలుగచేసింది.

తనని వంటింట్లో పడుకోమని ఎంత తేలిగ్గా చెప్పాడతను? అంతకంటే తమ కోసం మరో గదిని అద్దెకి తీసుకోలేని తన అసమర్థతని అతను అంగీకరిస్తే తను జాలి పడేదే! ఆమెకి నిద్రపట్టడంలేదు. ఫ్యాన్ ఆమె పడుకున్నచోటుకి దూరంగా వుండడం వలన దోమలు తెగకుడుతున్నాయి. ఆమెకి అత్తగారు కావాలనే తమకి గది లేకుండా చేసిందేమోనని అనుమానం వచ్చింది. అంతలోనే తననితానే నిందించుకుంది.

"ఛ! ఆవిడపై ఎందుకు దురభిప్రాయం కలిగింది తనలో? ఆవిడకి కొడుకుని, కోడలిని విడదీస్తే కలిగే లాభమేమిటి? " అనుకుంది.

★ ★ ★

తల్లిని ట్రెయిన్ ఎక్కించి వచ్చాక, అంతవరకు ఉగ్గబట్టుకున్న దుఃఖం స్రవంతిలో కట్టలు తెంచుకుంది. వెక్కి వెక్కి ఏడుస్తున్న భార్యని అసహాయంగా చూస్తూ అడిగాడు రవి.

"మీ అమ్మగారు నాలుగురోజులైనా వుండకుండా వెళ్ళిపోయారని బాధపడుతున్నావా? "

"కాదు. మా అమ్మ వెళ్ళగొట్టబడిందని బాధపడుతున్నాను"

అతని భ్రుకుటి ముడివడింది. "ఏమిటి నీ మాటలకి అర్థం? "

"మా అమ్మని మీ అక్కయ్య దారుణంగా అవమానించారు" అంటూ వరలక్ష్మి అన్న మాటలు ఆమె మాటలని ఖండించకుండా అత్తగారు నవ్వడం చెప్పింది.

"మీ అమ్మగారిని అవమానించవలసిన అవసరం మా అమ్మకేమిటి? తను మామూలుగానే అందేమో? మీ అమ్మగారు అపార్థం చేసుకున్నారేమో? "

"అపార్థమా? మీకు ఆ మాటలు అవమానకరంగా అన్పించలేదా? మీ ఇంట్లో తాగిన కాఫీ అరక్క మా అమ్మకి కడుపునెప్పి వచ్చిందా? ఏం మా ఇంట్లో కాఫీ కాకుండా చూరునీళ్లు తాగుతున్నామా? అంటే మేం తిండికి గతిలేనివాళ్ళమనేగా ఆవిడ మాటలకి అర్థం"

అతను జవాబివ్వలేనట్టు చూశాడు.

"నేను ఈ ఇంటికి వచ్చిన దగ్గరనుంచి చూస్తూనే వున్నాను. పిల్లిమీద, ఎలుకమీద పెట్టి నన్ను ఏదో ఒకటి అంటూనే వున్నారు. పెళ్ళికి ముందు కట్నం వద్దని, మీ అమ్మాయే మాకు కట్నమని నన్ను పెళ్ళి చేసుకున్నారు. నిజమే... మీ వాళ్ళకి కట్నం అక్కర్లేదు. కానుకలు కావాలి. వేలకివేలు డబ్బు, నవరత్నాలు, వజ్రాలు పొదిగిన ఉంగరాలు కానుకలుగా కావాలి. అవి ఇవ్వలేనివాళ్ళమనేగా మా వాళ్ళంటే అంత చిన్నచూపు. కల్పనా వాళ్ళమ్మగారు ఈ ఇంటికొచ్చినప్పుడు రాచమర్యాదలు చేసే మీ అమ్మగారు మా అమ్మ వస్తే ఉదాశీనంగా ఎందుకు ఊరుకున్నట్టు? మా అమ్మ అంతస్తులో మీతో తగనిదనేగా? "

స్రవంతి ఆవేశంతో, దుఃఖంతో వణికిపోతోంది. ఎన్నాళ్ళుగానో రగులుకుంటున్న అగ్నిపర్వతం బద్ధలై లావా విరజిమ్మినట్టు ఆ ఇంట్లో తను, తన తల్లి పొందిన అవమానం తాలూకు బాధని వెళ్ళగక్కుతోంది.

"నువ్వు ఆవేశంలో వున్నావు. మా అమ్మ మీనుంచి కానుకలని ఆశించే దుస్థితిలో లేదు. ఈ ఆస్తి అంతటికీ ఆవిడే సర్వాధికారి. నువ్వు మధ్యతరగతి అమ్మాయివని,

పుట్టింటినుంచి కానుకలు తేలేదని ఆవిడ నిన్ను చిన్నచూపు చూస్తోందనేది కేవలం నీ అపోహ మాత్రమే. ఆవిడ పెత్తనం లేకుండా మా నాన్నగారు నాకు నీతో పెళ్ళి నిర్ణయించారని మాత్రం కోపం వుంది. అది నాకు ఖచ్చితంగా తెలుసు"

"నేను డబ్బులేనిదాన్ననే ఆవిడకి నాపై అయిష్టతకి కారణం. నేను కాకుండా మరో ధనవంతుల అమ్మాయి మీకు భార్యగా వస్తే ఆవిడ నెత్తిన పెట్టుకునేదే! నాకు తెలుసు. ఆవిడ ఊపిరి డబ్బు, ఆవిడ ప్రపంచం డబ్బు. ఈ ఇంట్లో మనుషులు మాట్లాడరు. డబ్బే మాట్లాడుతుంది"

"ఏం, మీ వాళ్ళకి మాత్రం డబ్బు చేదా? మేం డబ్బున్నవాళ్ళమనేగా నిన్ను నాకిచ్చి పెళ్ళిచేశారు. అదే ఏ పేదవాడో వచ్చి అడిగితే నిన్నిచ్చి పెళ్ళి చేసేవారా? " రవి వ్యంగ్యంగా అడిగాడు.

స్రవతి గుండెల్లో సూటిగా గుచ్చుకుంది ఆ వ్యంగ్యబాణం. ఆమె నిరుత్తరయై చూస్తోంది.

"నువ్వు ఈ ఇంటికోడలివి. అన్నింటికంటే ముఖ్యంగా ఇది ఉమ్మడి కుటుంబం. ఈ కుటుంబ పరువు ప్రతిష్టలను కాపాడవలసిన బాధ్యత నీది. నీకు ఈ ఇంట్లో హక్కులు మాత్రమేకాదు: హద్దులు కూడా వున్నాయి. వాటిని అతిక్రమించే సాహసం చేస్తే పర్యవసానం దారుణంగా వుంటుంది"

రవి స్వరం పదునుగా వుంది. ఆ మాటలలో శాసనంకంటే హెచ్చరికే ఎక్కువగా ధ్వనిస్తోంది. అతను విసురుగా గదిలోనుంచి బయటికి వెళ్ళిపోయాడు.

స్రవంతి గదిమధ్యలో శిలలా నిలబడిపోయింది. తను ఈ ఇంట్లో అన్‌వాంటెడ్ గెస్ట్ అనుకుంటూంటే ఆమెకి దుఃఖం వచ్చింది. తల్లి అభోజనంగా తమ ఇంటినుంచి వెళ్ళిపోయిందనే వేదన దానికి తోడయింది.



కల్పన పుట్టింటికి వెళ్తోంది. "కారులో వెళ్ళు" అంది త్రిపురాంబ ఎంతో ఆప్యాయంగా.

"ఎందుకత్తయ్యా? ట్రైన్‌లో వెళ్తాను" అంది.

"డ్రైవర్ వున్నాడుకదమ్మా! తీసుకెళ్ళు" అందావిడ.

కల్పనకి ఆవిడ అతిప్రేమ ఇబ్బందిని కలుగచేస్తోంది.

తండ్రి ఇంద్రభవనంలాంటి ఇంటిని అమ్ముకుని, చిన్న ఫ్లాటులోకి మారిపోయిన విషయం భర్తకి, తనకి తప్ప ఇంట్లోవాళ్ళెవరికీ తెలియదు. ఇప్పుడు తను కారులో వెళ్తే గుట్టు రట్టవుతుంది. డ్రైవర్ వలన విషయం అందరికీ తెలిసిపోతుంది.

తర్వాత సూట్‌కేసు సర్దుకుంటూ భర్తతో అంది, "నేను ట్రైన్‌లో వెళ్తానంటే మీ అమ్మగారు కారులో వెళ్ళమని చంపుకు తింటారేమిటండీ? "

"నువ్వంటే మా అమ్మకి ఇష్టం" అందుకనే నిన్ను కారులో వెళ్ళమంటోంది. స్రవంతినైతే వెళ్ళమంటుందా చెప్పు? "

"మీ అమ్మగారికి నేనంటే ఎందుకిష్టమో తెలుసా? నేను విలువైన కానుకలను

తెస్తాను కాబట్టి"

"నువ్వు తెచ్చిన కానుకలు ఆవిడకో సమా?"

"ఆవిడ కోసంకాదు. ఆవిడ ప్రతిష్టకోసం" నిరసనగా అంది. ఆమెకి కారులో వెళ్ళాలనేవుంది. కానీ తండ్రి వేరే ఇంటికి మారిపోయిన విషయాన్ని డ్రైవర్ చెప్తే? తన పరువేమవుతుంది? ఆవలించకుండానే పేగులు లెక్కపెట్టగలిగే ఘటికురాలైన అత్తగారు మొత్తం కథ అంతా కూపీలాగితే? తండ్రి వ్యాపారంలో నష్టపోయి ఆయన ఆస్తిని పోగొట్టుకోవడంవల్లనే కదా తను కూడా కొన్ని సుఖాలను త్యాగం చెయ్యావలసి వస్తోంది అనుకుంది బాధగా.

కల్పన రైలుదిగి ప్లాట్ ఫారమ్‌మీద చేతిలో సూట్‌కేసుతో నిలబడింది. గతంలో అయితే తండ్రి కారు, డ్రైవర్‌తో సహా తన రాకకోసం ఎదురుచూస్తూ వుండేవాడు. ఇప్పుడు పరిస్థితులు తారుమారయ్యాయి. తండ్రికి తను ఇవాళ వస్తున్నట్టు తెలుసు. ఆయన తనని ఇంటికి తీసుకెళ్ళడానికి స్టేషన్‌కి వచ్చాడోలేదో తెలియదు. ఆమె తండ్రి కోసం కళ్ళతోనే వెతుకుతోంది.

"కల్పనా!" సమీపంలో తండ్రి స్వరం వినగానే ఆమెకి ప్రాణం లేచివచ్చినట్టయింది.

"నాన్నా! ఎలా వున్నారు?"

"బాగానే వున్నానమ్మా" అన్నాడాయన. "ఇటివ్వు" అన్నాడు కూతురి చేతిలోని సూట్‌కేస్‌ని తీసుకోబోతూ.

"ఫర్వాలేదు నాన్నా! బరువుగా లేదు"

"ఇటియ్యమ్మా! నేను ఇంతకంటే నీకేం చెయ్యగలను?" ఆయన స్వరంలో ధ్వనించిన దైన్యానికి ఆమె కళ్ళల్లో నీళ్ళూరాయి.

ఇద్దరూ బయటికి వచ్చాక ఆయన ఆటో మాట్లాడారు. ఇల్లు చేరేవరకు కల్పన మాట్లాడలేదు. ఆమెకి పెదవి విప్పితే దుఃఖం ముంచుకొచ్చేలా వుంది.

చవగ్గా వచ్చిందని కాబోలు ఊరికి దూరంగా కొత్తగా ఏర్పడిన ఆ కాలనీలో చిన్న ఫ్లాట్ అద్దెకి తీసుకున్నాడు కృష్ణమూర్తి. ఇల్లు బాగానే వున్నా, ఆ ఇంట్లో ఏదో వెలితి కన్పిస్తోంది.

మహేశ్వరి కూతుర్ని చిరునవ్వుతో ఆహ్వానించినా న్యూనతాభావంతో ఆవిడ మనసు ముడుచుకుపోతోంది. గతంలో కూతురు తమ ఇంటికివచ్చి అత్తవారింటికి తిరిగి వెళ్ళేటప్పుడు పాతికవేలు ఖరీదు చేసే కానుకలని ముట్టచెప్పేది. కానీ ఇప్పుడు తామున్న పరిస్థితులలో ఒక చీర తప్ప ఏమీ పెట్టలేమనే బాధ ఆవిడని దహిస్తోంది. శ్రావణ మాసానికి కల్పనకి గాజులు చేయించడం కోసం ఆరుకాసుల బంగారాన్ని కొని వుంచానని వియ్యపురాలితో గొప్పగా చెప్పడం గుర్తొచ్చింది. కల్పనని గాజులు లేకుండా పంపిస్తే వియ్యపురాలిముందు తను తలెత్తుకోగలదా? ఆవలించకుండానే పేగులు లెక్కపెట్టే త్రిపురాంబ కూపీలాగి తమ చరిత్రనంతటినీ తెలుసుకోగలదు. కూతురికి గాజులు చేయించలేకపోయాననే బాధకంటే వియ్యపురాలి దృష్టిలో తను చులకనైపోతుందనే భయమే ఎక్కువగా వుందావిడకి. ఆవిడ అన్యమనస్కంగానే కూతురితో మాట్లాడుతోంది.

"నాన్నగారు ఏం చెయ్యాలనుకుంటున్నారమ్మా?" కల్పన అడగలేక అడిగింది.

"చెయ్యడానికేముందిక? ఈ వయసులో ఆయనకి ఉద్యోగం ఎవరూ ఇవ్వరు. వ్యాపారం చెయ్యాలంటే లక్షలు పెట్టుబడి కావాలి. వున్న డబ్బేదో వడ్డీలకి తిప్పుతున్నారు. అసలు కదల్చకుండా వడ్డీలు పెట్టుకుని తింటూ కాలక్షేపం చేస్తున్నాం. అదృష్టమేమిటంటే మీ అన్నయ్యని బిజినెస్‌లో దింపకుండా అమెరికా పంపడం. వాడక్కడ ఉద్యోగం చేసుకుంటూ వాడి బతుకేదో వాడు బతుకుతున్నాడు"

"నాన్నగార్కి బిజినెస్‌లో నష్టం వచ్చినట్టు అన్నయ్యకి తెలియదామ్మా?"

"ఎందుకు తెలియదూ?"

"ఏమంటాడు? "

"అక్కడకి వచ్చేసి తనదగ్గరుండమంటాడు"

"పోనీ, అమెరికా వెళ్ళిపోవచ్చుకదమ్మా? "

"మీ వదిన రాక్షసి. దానితో నేను వేగలేనమ్మా? " నిరసనగా అంది.

"అన్నయ్య మీకేదైనా డబ్బు పంపుతానని చెప్పలేదా? "

"ఆవిడగారు మాకు డబ్బు పెట్టనిస్తుందీ! వాడు పిలిచినా మేం అక్కడకి రామని తెలుసు వాడికి. పైకి ప్రేమ ఒలకబోస్తూ మమ్మల్ని తన దగ్గరకి రమ్మని పిలుస్తాడు. అంతా నాటకం. అది సరే, ఏమంటుంది మీ అత్తగారు? "

"ఏమీ అనలేదు"

"నేను నీకు గాజులు చేయిస్తానని చెప్పిన విషయం గుర్తుచెయ్యలేదా? "

"లేదు. కానీ నేను గాజులు చేయించి తెచ్చుకున్నానమ్మా. అవి నువ్విచ్చావని మా అత్తగారికి చూపిస్తాను" రహస్యంగా అంటూ తల్లిని గదిలోకి తీసుకెళ్ళి సూట్ కేస్ తెరిచి గాజులు చూపించింది.

"ఇవి మీ అత్తగారికి తెలియకుండా చేయించుకున్నావా? ఎలా? "

కల్పన చెప్పింది. "ఆయన గాజులు చేయించుకోమని నాకు డబ్బిచ్చారు. నువ్వు నాకు కానుకలివ్వడం మానేస్తే మా అత్తగారు నన్ను చులకనగా చూస్తుందని ఆయన భయం"

మహేశ్వరి ముఖం విప్పారింది.

"అల్లుడిది చాలా మంచి మనసమ్మా. మా పరువు నిలబెట్టాడు. కన్నకొడుకు పరాయివాడయ్యాడు. అల్లుడు కన్నకొడుకుని మించి ఆదుకున్నాడు" అంది గద్గదస్వరంతో.

అల్లుడుచేసిన మంచిపని భార్యద్వారా విని కృష్ణమూర్తి కళ్ళు చెమర్చాయి. కొద్దిసేపు ఆ ముగ్గురూ శ్రీధర్ మంచి మనసుని పొగుడుతూ కానుకలతో తప్ప తృప్తిపొందని త్రిపురాంబ మనస్తత్వాన్ని విమర్శించుకున్నారు.

కల్పన పుట్టింట్లో మూడురోజులువుంది. ఆ మూడురోజులూ వాళ్ళు ముగ్గురూ అనేక విషయాలని మాట్లాడుకున్నారు. మాటలలో స్రవంతి ప్రసక్తి వచ్చింది.

"మీ మరిదికి ఆషాఢ పట్టీ ఏం ఇచ్చారే? " ఆరాగా అడిగింది మహేశ్వరి.

"రెండువేలు ఇచ్చారుట"

"రెండువేలా? " అదోలా నవ్వింది. "మేం మీ ఆయనకి పాతికవేల రూపాయలు, సూటు ఇచ్చాం. గుర్తుందా? ఆరోజు మేం తెచ్చిన పళ్ళు, స్వీట్లకే రెండువేలయింది"

"వాళ్ళమొహం! వాళ్ళు ఆ రెండువేలయినా ఇచ్చివుంటారంటావా? రవే గొప్ప కోసం అలా చెప్పివుంటాడు. లేకపోతే తనే ఆ డబ్బు అత్తగారికిచ్చి ఆవిడ ఇచ్చిందని స్రవంతిచేత చెప్పించాడో!"

"నిజమేలే! మీ ఆస్తి మహాసముద్రం. దాంట్లో రెండువేల రూపాయలనగా ఎంత? "

కొద్దిసేపటిక్రితం అల్లుడు గాజులు చేయించి తమ పరువు నిలబెట్టాడని గర్వపడిన సంగతి మర్చిపోయిన మహేశ్వరి స్రవంతి పుట్టింటి వాళ్ళ గురించి చులకనగా మాట్లాడింది.

★ ★ ★

కల్పన చేతిగాజులు చూస్తూనే త్రిపురాంబ ముఖం విప్పారింది.

"చాలా బాగున్నాయమ్మా! ఎంతయ్యాయి? "

"ఇరవై వేలయ్యాయి అత్తయ్యా? " గొప్పగా చెప్పింది.

"కొత్త డిజైన్. మీ అమ్మగారి సెలక్షనే సెలక్షన్" అని అక్కడే ఏదో పనిచేస్తున్న స్రవంతిని పనిగట్టుకుని పిలిచిందావిడ.

"స్రవంతీ! ఇలారా!"

"వస్తున్నానత్తయగారూ" ఆమె చేస్తున్న పనిని వదిలివచ్చింది.





"కల్పన గాజులు చూశావా? పాళ్ళమ్మ గారు చేయించారు"

"చాలా బాగున్నాయండీ" కల్పన చేతిగాజులు చూసి మనస్ఫూర్తిగానే అంది.

"పోయినసారి నెక్లెస్ ఇచ్చారుకదూ?" అందావిడ కావాలనే. కల్పనముందు స్రవంతిని చిన్నబుచ్చే ఉద్దేశ్యం తప్ప ఆవిడకి మరేమీలేదు.

"అవునత్తయ్యా" కల్పన మరింత గొప్పగా అంది.

"కల్పనమ్మగారికేం? అచ్చటాముచ్చటా తీర్చే తల్లీతండ్రీ వున్నారు" అప్పుడే అక్కడికి వచ్చిన తాయారమ్మ అంది.

"నిజమే! మా శ్రీధర్ చాలా అదృష్టవంతుడు" అని త్రిపురాంబ అంటుంటే స్రవంతి ముఖంలో మారుతున్న రంగులని వినోదంగా చూస్తోంది కల్పన.

'శ్రీధర్ అదృష్టవంతుడని అత్తగారు అన్న మాటలకి అర్థం ఏమిటి? రవి దురదృష్టవంతుడు. అతని అత్తగారు వేలకి వేలు ఖరీదుచేసే కానుకనివ్వలేరనేగా?' అనుకుంటూ పాలిపోయిన స్రవంతి ముఖాన్ని చూసి త్రిపురాంబ మనసు తృప్తిపడింది.

స్రవంతికి కల్పన గాజులని చూసి ఈర్ష్య కలుగలేదుకానీ, అత్తగారు తనని చిన్న చూపు చూస్తోందని బాధ కలిగింది.

ఆ రాత్రి తనేం అడిగినా, ముభావంగా ముక్తసరిగా సమాధానమిస్తున్న స్రవంతిని రవి అడిగాడు.

"ఏమయింది?"

"ఏమీలేదు అందామె అతనివైపు చూడకుండానే.

"అంటే ఏదో వుందన్నమాట. ఏం జరిగిందో చెప్పు?"

స్రవంతి జరిగింది చెప్పింది.

"మా అమ్మ ఏం మాట్లాడినా నిన్నే అన్నట్లు ఎందుకనుకుంటున్నావ్? మా అమ్మేకాదు. ఎవరేం మాట్లాడినా అది నీ గురించే అన్నట్టు ఎందుకు అపార్థం చేసుకుంటున్నావు?"

"అపార్థంకాదు. అర్థం చేసుకునే బాధపడుతున్నాను. పెద్ద రాణీగారు మంచిదంటే చిన్న రాణీగారు మంచిదికాదనేగా అర్థం?" ఉక్రోషంతో ఆమె ముక్కుపుటాలు అదురుతున్నాయి.

"నిన్ను అవమానిస్తే మా అమ్మకేం కలిసివస్తుంది? నువ్వు ఈ ఇంటి కోడలివి"

"ఆవిడకి ఆ మాట గుర్తుంటే కల్పనని ఒకలా, నన్నొకలా చూసేవారుకాదు"

"స్రవంతీ! నువ్వీ ఇంటికి వచ్చి మూడునెలలు కూడా పూర్తికాలేదు. అప్పుడే నీలో అసంతృప్తి, అసహనం బయలుదేరాయి. అలాంటిది జీవితాంతం ఈ ఇంట్లో వుండగలవా? ఒక విషయం చెబుతున్నాను. బాగా గుర్తుంచుకో. ఈ ఇంట్లో 'నేను' అనే మాట ఎప్పుడూ వినబడకూడదు. సర్దుకుపోవాలి. రాజీపడాలి. కొన్ని త్యాగాలు చెయ్యాలి. చిన్నచిన్న విషయాలకి కూడా వీధినపడి అల్లరవడం నాకిష్టంలేదు"

స్రవంతి హతాశురాలై అతన్ని చూస్తోంది. 'తన అవమానం అతనిది కాదా? సర్దుకుపోవాలా? ఎంతసేపూ కుటుంబ పరువుప్రతిష్టల గురించి మాట్లాడతాడే తప్ప తన గురించి మాట్లాడడేం? ఏమిటీ మనిషి తత్వం? తనకెదురుగానే తనని అన్యాపదేశంగా చులకన చేసే మనుషులమధ్య తనెలా గడపాలి?' ఆలోచిస్తున్న ఆమెకి కారడవిలో చిక్కుకున్నప్పటి నిస్సహాయత కలిగింది.

★ ★ ★

రాజేశ్వరమ్మ బజారునుంచి రాగానే శ్వేతని పిలిచి చెప్పింది "చీర కొనుక్కున్నాను. ఎలావుందో చెప్పు?"

"చాలా బాగుందత్తయ్యా" పరిశీలిస్తూ అంది.

"మూడువేల అయిదువందలయింది. వచ్చే శనివారం మా పెళ్ళిరోజు. ఆరోజు కట్టుకుందామని కొనుక్కున్నాను" ఇంటద్దె



కట్టలేక తమకోసం తీసుకున్న గదిని ఖాళీ చేసి, ఇంటావిడకి అప్పగించిన అత్తగారు అంత ఖరీదైన చీరని కొనుక్కోడం ఆమెకి ఆశ్చర్యాన్ని కలుగచేసింది. పాలవాడు బాకీ కట్టలేదని గొడవ చేసిపోయాడని వారంరోజుల కిందట భర్త తన దగ్గరున్న డబ్బు తీసుకోవడం గుర్తొచ్చింది. అత్తగారు చీర కొనుక్కున్నందుకు ఆమె బాధపడలేదు. కానీ ఇల్లు గడవని పరిస్థితులలో పట్టుచీర ఎలా కొనుక్కోగలిగిందా అన్నదే ఆమె ఆశ్చర్యం. తమ కుటుంబ ఆర్థికపరిస్థితి మరీ అంత దిగజారిపోలేదనడానికి రెండు రోజుల తరువాత ఆమెకి ఒక ఆధారం లభించింది.

ఆరోజు శ్వేత గదులు బూజులు దులిపే పనిపెట్టుకుంది. అత్తగారు వంటచేస్తోంది. ఆమెముందు గది దులపడం పూర్తిచేసి అత్తగారి పడకగదిని దులిపి, దుప్పట్లు మారుస్తోంది. పరుపు దులుపుతుంటే పరుపుకింద వున్న బ్యాంక్ పాస్‌బుక్ కిందపడింది. ఆమె దాన్ని యధాస్థానంలో పెట్టేయబోయి మళ్ళీ అంతలోనే ఆ ప్రయత్నాన్ని విరమించుకుంది. ఏదో తెలియని కుతూహలం ఆమెని ఆ పాస్‌బుక్‌ని తెరిచి చూసేలా చేసింది. వెంటనే ఆమె కళ్ళు సంభ్రమంతో పెద్దవయ్యాయి. బాంక్‌లో రెండులక్షల రూపాయలకి పైగా నిలవ వుంది. ఆమె తిరిగి దాన్ని యధాస్థానంలో పెట్టేసింది.

భర్తకి వచ్చే జీతం, మామగారి పెన్షన్‌తో ఇల్లు గడవాలన్నమాట నిజమే. కానీ ఆ ఇంట్లో ఎక్కడా లేమి అన్నదే కనిపించదు. అత్తగారు ఖరీదైన చీరలనే కడుతుంది. తిండికీ లోటులేదు. సంసారాన్ని నడుపుతూ, రమేష్‌ని చదివిస్తూ అంత డబ్బు బాంక్‌లో నిలవచెయ్యగలిగారంటే అత్తగారిది మరీ అంత లేని కుటుంబం కాదని లెక్కే. మరి ఆవిడ భర్త తన దగ్గర బీద అరుపులు అరవడంలో ఆంతర్యమేమిటి?

ఆలోచిస్తున్న ఆమెకి సమాధానం సులువుగానే దొరికింది. తనని మోహన్ ఇష్టపడి పెళ్ళి చేసుకోలేదు. తనద్వారా వచ్చే ఆస్తి కోసం ఆశపడి తనని పెళ్ళిచేసుకున్నాడు. ఆ ఆశ వాళ్ళ మాటలలో వ్యక్తమవుతూనే వుంటోంది. ఆమెకి భర్తతో తను శారీరకంగా మూడేళ్ళుగామూడుసార్లు కలిశానని గుర్తువచ్చింది. మొదటిరాత్రి తర్వాత ఈ మూడునెలల్లోను అతను రెండుసార్లే తనకి దగ్గరయ్యాడు. ఆ రెండుసార్లూ తనదగ్గర డబ్బు తీసుకున్నాడు. మొదటిసారి తను అత్తవారింటికి వచ్చినప్పుడు అత్తగారు ఎంత తెలివిగా తనదగ్గర డబ్బువున్నదీ తన నోటితోనే చెప్పించింది. రెండురోజులక్రిందట తను పుట్టింటినుంచి వచ్చి అత్తగారి గదిలో సూట్‌కేస్ పెట్టి స్నానంచేసి వచ్చేటప్పటికి బట్టలన్నీ చిందరవందరగా వుండడం గుర్తువచ్చింది. ఆరోజు పనిమనిషి తన పెట్టెలోని డబ్బుని దొంగిలించాలని ప్రయత్నించిందనుకుంది. కానీ ఆలోచిస్తుంటే అత్తగారే పెట్టె తెరిచిందని అర్థమయింది. తన దగ్గర డబ్బువున్న విషయం తెలిసి ప్రేమ నటించి అత్తగారు ఆ రాత్రి బెడ్‌రూమ్‌ను తమకోసం త్యాగంచేసింది. మరింత ప్రేమ నటించి భర్త తన దగ్గరనుంచి నాజూగ్గా డబ్బు లాక్కున్నాడు. డబ్బు ఇవ్వనిదే వేశ్య విటుడికి సుఖాన్నివ్వదు. తన భర్తా అంతే. డబ్బు తీసుకుని తనకి సుఖాన్నిచ్చాడు. ఆమెకి దుఃఖం వచ్చింది.

★ ★ ★

"నీ మెడలో గొలుసేది?" త్రిపురాంబ అడిగింది.

స్రవంతి ముందే ఆలోచించి పెట్టుకున్న జవాబుని చెప్పింది.

"బీరువాలో వుందత్తయ్యా"

"మెడలో వేసుకోకుండా బీరువాలో ఎందుకు పెట్టావు?"

"ఎక్కడికైనా వెళ్ళినప్పుడు వేసుకుంటాను. రోజూ ఎందుకు?" త్రిపురాంబ ఆ జవా

బుతో సంతృప్తి చెందలేదు. కోడలు పుట్టింటికి వెళుతున్నరోజు ఆ గొలుసుని ఆమె మెడలో చూసింది. తిరిగి ఆమె ఇక్కడికి వచ్చాక ఆమె మెడలోని నగలని పరిశీలించే అవసరం రాలేదావిడకి. స్రవంతి పుట్టింటికి వెళ్తూ తను పెళ్ళిలో పెట్టిన నగలన్నింటినీ తనకి అప్పగించడంతో ఆవిడ సంతృప్తి చెందింది. కానీ, ఇప్పుడు ఆమె మెడలో ఆమె తండ్రి పెట్టిన గొలుసు కనిపించకపోవడంతో ఆవిడకి అనుమానం వచ్చింది. ఆమెగానీ, ఆ గొలుసుని తండ్రికిచ్చేసి వుంటుందా అని. తన అనుమానాన్ని కూతురిదగ్గర బయట పెట్టిందావిడ.

"తండ్రికే ఇచ్చేసి వుంటుంది. ఆయన తాకట్టుపెట్టుకున్నాడో లేక అమ్మేశాడో?" అంది వరలక్ష్మి.

"అంత దారుణానికి ఒడిగడతాడంటావా?" అంది సందేహంగా.

"అవసరం ఎంత పనైనా చేయిస్తుంది"

ఇద్దరూ పూటకి గతిలేని సంబంధాన్ని రవికి కుదిర్చిన మాధవరావుగారిని కసితీరా తిట్టుకున్నారు.

తామిద్దరూ మాట్లాడుకుంటున్న మాటలని స్రవంతి విందని ఆ ఇద్దరిలో ఏ ఒక్కరికీ తెలియదు.

వాళ్ళు మాట్లాడుకున్నది స్పష్టంగా విన్న స్రవంతికి దుఃఖం వచ్చింది. తను భయపడినంతా అయింది. తను ఆ గొలుసుని తండ్రికిచ్చిందని, అవసరానికి ఆయన అమ్ముకున్నాడనే భయంకరమైన అపోహ వాళ్ళ మనసులలో కలిగింది. తనెంత తెలివితక్కువగా ప్రవర్తించింది, తల్లి ఊరికి వెళ్తూ ఆలస్యంచెయ్యకుండా మరునాడే జ్యూయెలరీ షాపుకి వెళ్ళి అమ్మేసిన గొలుసుని తిరిగి కొనమని చెప్పింది. కాని తను వెళ్ళేప్పటికే షాపతను గొలుసుని ఎవరికో అమ్మే|శాడు. అత్తగారికి అనుమానం రాకుండా అచ్చం అలాంటిదే మరో గొలుసు చేయించుకోవాలనుకుంది. కాని గొలుసు అమ్మగా వచ్చిన డబ్బు చాలదు. తను చేసిన తెలివితక్కువ పనివలన పరిణామం ఇంత దారుణంగా వుంటుందనుకోలేదు. తండ్రిపై పడిన నిందని ఎలా పోగొట్టుగలదు?"

"స్రవంతీ! నీకే ఫోన్? మీ అమ్మగారు" వరలక్ష్మి పిలుపుతో ఉల్కిపడి ఫోన్ దగ్గరకి నడిచింది.

"అమ్మా! ఎలా వున్నావ్?" ఆదుర్దాగా అడిగింది.

"బాగానే వున్నాను. నేను చెప్పిన పని ఏం చేశావు?"

"అదా! నేను వెళ్ళేప్పటికే గొలుసుని ఎవరో కొనుక్కున్నారు"

"మీ అత్తగారికి ఈ విషయం తెలిస్తే మర్యాదగా వుంటుందా?" అన్నపూర్ణమ్మ స్వరంలో నిస్సహాయత.

"గొలుసు అమ్మేసిన డబ్బు నీదగ్గరే వుందిగా? అచ్చం అలాంటిదే మరో గొలుసు చేయించుకో"

"ఆ డబ్బు సరిపోదమ్మా!" స్రవంతికి భయంగా వుంది తను తల్లితో మాట్లాడుతున్నది ఎవరైనా వింటారేమోనని.

"ఇవన్నీ ఉత్తరంలో రాయవచ్చుగా? ఫోన్‌లో ఎందుకు?"

"ఉత్తరం మీవాళ్ళెవరి చేతులలోనైనా పడుతుందని. సరే! నేనువుంటాను, ఎలాగైనా గొలుసు సంగతి చూడు" ఆవిడ ఫోన్ పెట్టేసింది.

స్రవంతి పెదవి నములుతూ వుండిపోయింది. ఆమెకి తల్లి మనసులోని ఆరాటం అర్థమయింది. తండ్రిపై అత్తగారు మోపిన నింద గురించి ఆవిడకి తెలిస్తే తట్టుకోగలదా? ఆమె కళ్ళలో నీళ్ళూరాయి. ఆమె నుదుటపట్టిన చెమటని తుడుచుకుని చుట్టూచూసి రిలీఫ్‌గా నిట్టూర్చింది. పరిసరాలలో ఎవరూ లేకపోవడం గమనించి తను తల్లితో మాట్లాడినది ఎవరూ వినలేదని తృప్తి పడింది. కాని తను ఇక్కడ

ఫోన్‌లో మాట్లాడుతుండగా, కార్డ్‌లెస్ ఫోన్‌లో గదిలోనుంచి కల్పన అంతా విందని ఆమెకి తెలియదు.

★ ★ ★

"ఇప్పుడు తెలిసిందా? రవికి వాళ్ళత్తగారు ఆ డబ్బు కానుకగా ఎలా ఇచ్చారో" అంది కల్పన. గొప్ప రహస్యాన్ని కనిపెట్టిన ఆనందం ఆమె ముఖంలో.

"కూతురు గొలుసు అమ్మిన డబ్బుతో అల్లుడికి కానుక ఇచ్చారన్నమాట" అన్నాడు శ్రీధర్. "ఇలాగైనా మా అమ్మ మెప్పుని పొందాలనుకుందేమో? అసలే దానికి ఇన్ ఫీరియారిటీ కాంప్లెక్స్. అందరికంటే తక్కువదాన్ననే బాధ" డ్రాయింగ్ రూమ్‌లో కూర్చున్న శ్రీధర్ అటువైపు వస్తున్న స్రవంతిని ఓరగా చూస్తూ అన్నాడు.

స్రవంతి చివ్వున తలఎత్తి చూసింది. శ్రీధర్ తననే చూస్తున్నాడు. ముందు తనని కాదేమోలే అనుకుంది. కాని కల్పన అతని చెవిదగ్గర రహస్యంగా ఏదో చెప్పడం, ఆ ఇద్దరూ తనని చూసి నవ్వుకోడం గమనించిన ఆమెకి ఆ మాటలన్నది తనని గురించే అని అర్థమయింది.

అతని మాటలలో "అది" అనే పదప్రయోగం ఆమె రక్తాన్ని ఉడుకులెత్తించింది. తమ్ముడి భార్యకి కనీసగౌరవాన్ని ఇవ్వని అతని కుసంస్కారానికి ఆమెలోని అణువణువు జుగుప్సతో కంపించింది. ఏమీ చెయ్యలేని నిస్సహాయతకి దుఃఖం తోడయింది. ఆమె పరుగులాంటి నడకతో అక్కడనుంచి తన గదిలోకి వెళ్ళిపోయింది. అవమానభారంతో నల్లబడిన స్రవంతి ముఖాన్ని చూస్తుంటే శ్రీధర్‌కి పైశాచిక ఆనందంలాంటిది కలిగింది. అతను అంతటితో వూరుకోలేదు. తల్లితో ఆ విషయాన్ని చెప్పాడు.

విన్న త్రిపురాంబ ముఖం జేవురించింది.

"వాళ్ళ తాహతుకి రవికి రెండువేలు కానుకగా ఇచ్చారంటేనే నాకు ఆ అనుమానం వచ్చింది. నా అనుమానం నిజమయింది. వాళ్ళ నాన్న పెట్టిన గొలుసునే అమ్మేసినప్పుడు నేను పెట్టిన నగలని అమ్మెయ్యదని గ్యారంటీ ఏమిటి? దాని నగలని నా ఆధీనంలోనే వుంచుతాను. ఏ పెళ్ళిళ్ళకో వెళ్ళినప్పుడు ఇచ్చి మళ్ళీ నాకు అప్పగించమంటాను"

శ్రీధర్‌కి తల్లి దృష్టిలో స్రవంతి విలువ మరింత దిగజారినందుకు సంతోషంగా వుంది.

★ ★ ★

ఆరోజు పది గంటలకి వచ్చింది వరలక్ష్మి.

"నిన్న రాలేదేమే" అడిగింది త్రిపురాంబ.

"నిన్న వర్షకేదో పెళ్ళి సంబంధం వుందంటే నేను, మీ అల్లుడు వెళ్ళాం"

"ఏ ఊరు? అబ్బాయికేం ఉద్యోగం? ఎలా వున్నాడు? " ఆవిడ ఆసక్తితో ప్రశ్నల పరంపరని కురిపించింది.

"నా మొహం! మరీ అంత పడిపోయే సంబంధం ఏమీకాదులే అమ్మా! వాళ్ళ ఫ్లాటు, ఆ ఇంట్లోని వస్తువులు చూస్తేనే అర్థమయింది వాళ్ళ స్థితిగతులేమిటో. టి.వి. కవరు కూడా సరైనది లేదు వాళ్ళింట్లో. అబ్బాయి అందగాడే. అమెరికాలో సాఫ్ట్‌వేర్ ఇంజనీరు. అయినా అబ్బాయిని చూసి పిల్లనిస్తామా ఏమిటి? అమెరికానుంచి ఎప్పుడైనా ఇక్కడకి వస్తే వర్ష అసలు ఆ ఇంట్లో వుండలేదు. ఒక్క బెడ్ రూమ్‌కైనా ఏ.సి. లేదు"

"పోనిద్దూ మరో సంబంధం చూద్దాం. వర్ష పెళ్ళికేం తొందర? ఇంకా ఇరవయ్యేళ్ళేగా? కొంపతీసి వాళ్ళని పెళ్ళిచూపులకి రమ్మని పిలిచారా ఏమిటే? "

"ఎందుకూ? అదొక దండగ. మా అమ్మాయి జాతకం తేలేదని అబద్ధం చెప్పి చల్లగా బయటపడ్డాం. అందుకే పిల్లనిచ్చే ఇల్లు, పిల్లని తెచ్చుకునే ఇల్లు కూడా చూసి మరీ పెళ్ళి చెయ్యాలి. ఇంటిని చూస్తే సగం,




మనుషులని చూస్తే మిగతా సగం అర్థమవుతుంది"

"ఆమాటా నిజమే! లేకపోతే అర్హతలేని వాళ్ళని అందలం ఎక్కించినట్టవుతుంది. మన అబ్బాయైనా, అమ్మాయైనా అత్తవారింటికి వెళ్తే శుభ్రమైన కాఫీ ఇవ్వగలిగిన వాళ్ళు అయివుండాలి కదా"

"వాళ్ళు మాత్రం నన్ను, మా ఆయన్ని చూసి ఎంత మర్యాద చేశారనుకున్నావ్? మేం వాళ్ళింటికి రావడమే మహద్భాగ్యం అన్నట్టు మాట్లాడారు. మన గుమ్మంలో నిలబడడానికి అర్హతలేనివాళ్లకి కూడా మనతో వియ్యమందాలని ఆశే" స్రవంతిని ఓరగా చూస్తూ అంది వరలక్ష్మి.

తనకి రవితో పెళ్ళి నిశ్చయమయినప్పుడు ఈవిడ ఇంకెన్ని మాటలు మాట్లాడి వుంటుందో అనుకున్న స్రవంతి ముఖంలో రంగులు మారాయి.

"కల్పన ఏదీ కనిపించదేం? "

"వరంగల్ వెళ్ళింది"

స్రవంతి కాఫీ కలపడానికి వెళ్ళింది. స్టవ్ మీద నీళ్ళు మరుగుతున్నాయి. ఆమె మనసు కూడా మరుగుతోంది.

ఏం చేస్తే వాళ్ళ మనసులలో తనపై వున్న చులకన భావాన్ని పోగొట్టగలదు?

తల్లి వెళ్ళిపోయిన రోజు రాత్రి రవి అన్న మాటలు ఆమె గుండెల్లో రేపిన గాయం ఇంకా మానలేదు.

'మేం డబ్బున్నవాళ్ళమనేగా మీ నాన్నగారు నిన్ను నాకిచ్చి పెళ్ళిచేశారు?' అతని మాటలు గుర్తొచ్చి ఆ అవమానం ఆమె మనసులో ముల్లులా గుచ్చుకుంటోంది. భార్యాభర్తలమధ్య డబ్బుతో తప్ప వేరే బంధంలేదా? డబ్బు కొన్ని అవసరాలను తీర్చుకోవచ్చు. డబ్బుతో చాలా సుఖాలను కొనుక్కోవచ్చు. కాని డబ్బుని మించి మనుషులను కలిపే బంధమేదో వుంది. అదేగా తనని ఈ ఇంట్లో కట్టిపడేస్తోంది. ఆమె ఆలోచనలలో నిమగ్నమై రవి లోపలకి వచ్చిన విషయాన్ని గమనించలేదు.

అతను ఆమెని చుట్టేస్తూ అడిగాడు. "ఇంకా నామీద కోపం పోలేదా? "

"కోపం కాదు... బాధ" అంది స్రవంతి.

"నువ్వు మా అమ్మని అన్నమాటలకి నేనెంత బాధపడాలి చెప్పు? "

"మొదటిసారిగా మన ఇంటికి వచ్చిన మా అమ్మకి జరిగిన అవమానానికి బాధగా లేదా? "

"వుంది... కాని ఏం చెయ్యమంటావు నన్ను, మా అత్తగారినెందుకు అవమానించావని మా అమ్మతో పోట్లాడనా? "

స్రవంతి మాట్లాడలేదు.

"నిజమే... మా వాళ్ళు మీ అమ్మగారి గురించి అలా మాట్లాడకూడదు. వాళ్ళ సంస్కారం అంతే అని సరిపెట్టుకో"

"మీరు మాత్రం అలా మాట్లాడవచ్చా? మీ డబ్బు చూసే మా నాన్నగారు మీతో నా పెళ్లి చేశారా? "

"నేను ఆయనకి నచ్చి వుండచ్చు. కాని మా ఫ్యామిలీ స్థితిగతులు తెలుసుకోకుండానే పెళ్ళి చేశారా? మీ నాన్నగారే కాదు ఏ తండ్రయినా తన కూతురికి కలిగిన సంబంధం చెయ్యాలని ఆమె సుఖపడాలనే కోరుకుంటాడు. నేను నిన్ను హేళన చెయ్యడానికో, బాధపెట్టడానికో ఆ మాటలనలేదు. నేను అన్నది నిజమో, కాదో కావాలంటే ఈసారి మీ ఊరికి వెళ్ళినప్పుడు మీ నాన్నగారిని అడుగు"

కొన్ని క్షణాల నిశ్శబ్దం తరువాత అంది. "నన్ను, నా వ్యక్తిత్వాన్ని గౌరవించని ఈ ఇంట్లో నేనెలా వుండగలను? ఇంట్లో ఎవరికీ నేనంటే ఇష్టంలేదు"

"నేను కూడా చాలామందికి నచ్చను. నువ్వు ఎవరికైనా నచ్చకపోతే ఆ సమస్య వాళ్ళది. నీది కాదు. అదీగాక ఏ వ్యక్తీ ప్రపంచాన్నంతటినీ మెప్పించేలా వుండడు. అయినా ఎవరి సంగతో నీకెందుకు? నాకు నువ్వంటే ఇష్టం. అది చాలదా? నీకు నేను

# పఠనముత్యాలు

★ సాహిత్యం ప్రజలను జ్ఞానవంతులుగా చేస్తుంది. వారు ఇంతకు పూర్వంకన్నా బాగా జీవించడానికి తోడ్పడుతుంది.

– ఇల్యా ఎహ్రెన్‌బర్గ్

★ వెలుగుతున్న దీపమే ఇతర దీపాలను వెలిగించగలదు. నేర్చుకున్నవారే ఇతరులకు నేర్పగలరు.

– టాగూర్

★ అణచివేతకు, అజ్ఞానానికి వ్యతిరేకంగా పోరాడడానికి మానవుడు చేపట్టిన అతి శక్తివంతమైన ఆయుధం పత్రికారచన!

– జేమ్స్‌గార్ఫీల్డ్

★ మనుషులు మారడానికి బోధనలకంటే పరిస్థితులే గణనీయంగా తోడ్పడతాయి.

– ఒకసూక్తి

★ సత్యాన్ని తెలుసుకోవడం, మంచిని జీవితంలోకి అనువర్తింపచేసుకోవడం - ఈ రెండే మహా వేదాంతులు నేర్పిన విషయాలు.

– వోల్టేర్

★ సరిదిద్దకుండా వదిలివేసిన తప్పును మించిన ఆపద ఇంకొకటి ఉండబోదు.

– బాస్టా

★ సిగ్గుపడాల్సింది నేరం చేసేటప్పుడు కానీ, శిక్ష అనుభవించేటప్పుడు కాదు.

– వోల్టేర్

★ ఆలోచన లేకుండా అధ్యయనం చెయ్యడం పరమ దండగ. అధ్యయనం చెయ్యకుండా ఊరికే ఆలోచించడం శుద్ధదండగ.

– కన్‌ఫ్యూషియస్

★ సభలవల్ల, ఆర్భాటాలవల్లా కాదు - భావవికాసంవల్లనే సంఘసంస్కరణ సాధ్యం!

– హెన్రీజార్జ్

★ మతం ప్రజలపాలిటి నల్లమందు.

– కారల్‌మార్క్స్

★ సాహసవంతులున్నంతవరకే దేశం స్వతంత్రంగా మనగలుగుతుంది.

– గాంధీజీ

★ ఇతరుల్ని సంతోషింపచేయటం గొప్ప దాతృత్వం.

– నెహ్రూ

★ ప్రతి అడుగు నీవు భగవంతుని స్మృతిలో వుండి వేస్తే నీవెంత అదృష్టవంతుడవో నీకే అనుభవం అవుతుంది.

– వివేకానంద

సేకరణ: వి. శ్రీనివాస రెడ్డి

ముఖ్యమా? మిగిలిన వాళ్ళందరూనా? "

"అందరూ ముఖ్యమే. ఎందుకంటే పెళ్ళి అంటే ఇద్దరు వ్యక్తులకి సంబంధించినదే కాదు. రెండు కుటుంబాలకి సంబంధించినది కూడా. మీ వాళ్ళు నన్ను అనుక్షణం ఏదో ఒకటి అంటూ వుంటే నన్ను కాదన్నట్టు నిర్లిప్తతతో ఎలా వుండమన్నారు? "

"నేనేం చెయ్యగలను. నేనీవిషయంలో నిస్సహాయుడిని" అతని స్వరంలో అసహనం. "నేనంటే మా అమ్మకి ప్రాణం. నన్ను ప్రాణప్రదంగా ప్రేమించే మా అమ్మని వదిలి నీ ఆనందంకోసం వేరు కాపురం పెట్టలేను"

"వేరు కాపురం పెట్టమని నేను మిమ్మల్ని అడగలేదే? "

"ఈ ఇంట్లో వుండలేనంటే అర్థం ఏమిటి? "

స్రవంతి జవాబివ్వలేకపోయింది.

"అయినా మా వాళ్ళు నువ్వనుకున్నంత దుర్మార్గులేమీ కారు"

'నిజమే! కట్నం తీసుకురాని కోడలిని కిరసనాయిలు పోసి కాల్చి చంపేలాంటి దుర్మార్గులేమి కాదు. కాని ఎదుటి మనిషి అస్తిత్వాన్ని హత్య చెయ్యగలరు. వ్యక్తిత్వాన్ని రూపుమాపగలరు' ఆ మాటలని స్రవంతి పైకి అనలేదు. మనసులోనే అనుకుంది.

★ ★ ★

శ్వేత త్వరత్వరగా నడుస్తోంది. ఒక ప్రైవేటు కాన్వెంటులో టీచర్‌గా ఆమె జాయినై నాలుగు నెలలు కావస్తోంది. రాత్రి చాలీచాలని జాగాలో కలత నిద్రపోవడం ప్రొద్దుట అయిదు గంటలకే లేచి స్కూలు టైమయ్యేవరకు వంచిన నడుము ఎత్తకుండా పనిచెయ్యడం, సాయంకాలం అయిదు గంటలవరకు పిల్లలతో అరిచి పాఠాలు చెప్పడం తనకి విలువనివ్వని అత్తమామలు, తన ముఖాన్ని చూడని భర్త ప్రేమరాహిత్యం, మానసిక సంఘర్షణ, అందరూ వుండీ మానసికమైన ఒంటరితనం... శ్వేత భరించలేకపోతోంది. సహనాన్ని కూడదీసుకుని వాళ్ళలో ఎప్పటికైనా మార్పు తీసుకురాగలననే పిచ్చినమ్మకంతో తను చేస్తున్న ప్రయత్నాలు వృధా అని ఆమెకి తెలుసు. కాని ఆశ చిరంజీవి. మనిషిని బతికించేది అదే. శ్వేతని ఆ ఇంటిని వదిలిపోనివ్వకుండా చేస్తున్నదీ అదే.

పదికిలోమీటర్ల దూరం నడిచినట్టు ఆయాసం... వగర్పు. గేటులో వుండగానే బెల్ కొట్టేశారు. ఇంటి దగ్గర పది నిముషాలముందు బయలుదేరుదామని ఎంత ప్రయత్నించినా వీలవదు. నాలుగు నెలల క్రిందట తను ఆషాఢమాసానికి పుట్టింటికి వెళ్ళి తిరిగి వచ్చాక పనిమనిషిని మానిపించేసింది అత్తగారు. పనిమనిషికిచ్చే రెండు వందలు దండగ ఖర్చు ఆవిడ దృష్టిలో. తండ్రి మోహన్‌కి స్కూటర్ కానుకగా ఇవ్వకపోవడాన్ని, తండ్రిచేత తన వాటా ఆస్తిని తన పేర రాయించుకోమనే ఆవిడ ప్రతిపాదనను తను తోసిపుచ్చడంతో తన మాట చెల్లుబాటు కాలేదనే కోపంతో ఆవిడ తనపై ఇలా కక్షతీర్చుకుంటోందన్పించింది శ్వేతకి.

ఉద్యోగం చేస్తానన్న శ్వేత ప్రతిపాదనకి రాజేశ్వరమ్మ, మోహన్ అభ్యంతరం చెప్పలేదు. ఆమె వెంటనే ఉద్యోగ ప్రయత్నాలు మొదలుపెట్టింది. నెల తిరిగేసరికల్లా ఆమెకి ఎనిమిది వందల జీతానికి ఒక చిన్న కాన్వెంటులో ఉద్యోగం దొరికింది. మొదటి నెల జీతం రాగానే భర్త చేతులలో పెట్టింది.

"ఇన్‌స్టాల్‌మెంట్సులో స్కూటర్ కొనుక్కోండి. నా జీతంలో ఒక్క రూపాయి కూడా నేను ఖర్చుపెట్టను, అంతా మీకే ఇస్తాను" అంది.

మోహన్ ఆమె అన్నదానికి జవాబివ్వకుండా ఆమెవైపు ఒక కోరచూపుచూసి ఆ డబ్బు తల్లిచేతులలో పెట్టేశాడు. తను ఉద్యోగం చెయ్యడం వృథా అనిపించిందామెకి. తండ్రి స్కూటర్ కొనివ్వలేదనే

నిష్ఠూరం మాత్రం మిగిలింది. తను కష్ట పడి సంపాదించిన డబ్బు అత్తగారు జల్సాగా ఖర్చుపెట్టుకుంటోంది. తన శ్రమకి గుర్తింపులేదు.

శ్వేతని చూడ్డానికి వచ్చిన రఘురామయ్య ఆమె ఉద్యోగం చేస్తోందని తెలిసి ఆశ్చర్య పోయాడు. కూతురి ముఖం చూస్తే ఆయన కడుపులో దేవినట్టయింది.

"నువ్వు ఉద్యోగం చెయ్యడమేమిటమ్మా?" అడగలేక అడిగాడు.

"ఇంట్లో చెయ్యడానికి పనేమీలేదు. ఖాళీగా కూర్చుని ఏం చేస్తాను" అంది నవ్వేస్తూ.

రాజేశ్వరమ్మ వియ్యంకుడికి కాఫీ ఇస్తూ చెప్పింది.

"అబ్బాయి ఆఫీసుకి ఈ ఇల్లు దూరమయిపోయింది. వాడు తిరగలేకపోతున్నాడు. అందుకే వాడి ఆఫీసుకి దగ్గరలో ఇల్లు చూస్తున్నాం. మీ అమ్మాయి, అల్లుడిచేత వేరు కాపురం పెట్టించదలచుకున్నాం. వాళ్ళ తిప్పలేవో వాళ్ళే పడతారు"

శ్వేత అయోమయంగా ఆశ్చర్యంగా చూస్తోంది. 'గది అద్దె అయిదువందలు ఎక్కువ కట్టలేక తమకోసం తీసుకున్న గదినే వద్దన్న మనిషి ప్రతినెల తన జీతాన్ని ఏదో హక్కు వున్నట్టు తన విలాసాలకి ఖర్చుపెట్టుకునే ఈవిడ తమకోసం వేరే ఇల్లు తీసుకుందా?'

"నిన్ననే నేను వెళ్ళి ఇల్లు చూసివచ్చాను. ఇంక శ్వేత కూడా చూసి దానికి నచ్చితే ఎడ్వాన్స్ ఇచ్చెయ్యడమే"

ఇది కొత్త పన్నాగమో, లేక ఆవిడ నిజంగానే తమని వేరు కాపురం పెట్టించదల్చుకుందో శ్వేతకి అర్థంకాలేదు.

"వాళ్ళ కాపురానికి కావలసిన సామాన్లవీ కొని పంపిస్తాను" అన్నాడు రఘురామయ్య.

"ఎందుకన్నయ్యగారూ అంతదూరం నుంచి మోసుకురావడం? ఇక్కడే కొనేద్దాం" అంది రాజేశ్వరమ్మ.



ఆ సాయంకాలం శ్వేత ఇంటికి వచ్చేప్పటికి రాజేశ్వరమ్మ ఎక్కడికో వెళ్ళడానికని తయారైవుంది. కోడలికి కాఫీ అందిస్తూ అంది.

"త్వరగా ముఖం కడుక్కో శ్వేతా! మీకోసం చూసిన ఇంటిని చూసివద్దాం"

శ్వేత గబగబా తయారై వచ్చింది. ఇద్దరూ సిటీ బస్సెక్కారు. అయోధ్యారామపురంలో వుందా ఇల్లు. ముచ్చటగా మూడు గదులతో వున్న ఆ ఇంటిని, ఇంటిముందు ఆవరణలోని పూలమొక్కలని చూసి సంతోషంతో గంతులు వేసిందామె మనసు.

"ఇల్లు నచ్చిందామ్మా?" అడిగిందావిడ.

"బాగుందత్తయ్యా! కానీ వేరే ఇల్లు అంటే రెట్టింపు డబ్బు ఖర్చుకదా"

"కాని ఈ ఇల్లు మోహన్ ఆఫీసుకి దగ్గర కదా!" అందావిడ. శ్వేతకి ఎందుకో ఆవిడ మాటని నమ్మబుద్ధికావడంలేదు. తమకోసం ఇల్లు తీసుకోడం వెనుక ఏదో స్వార్థం వుందనిపించింది.

ఇంటికి వచ్చేప్పటికి మోహన్ ఆఫీసు నుంచి వచ్చి ఇంట్లోనే వున్నాడు.

"శ్వేతకి ఇల్లు నచ్చిందిరా. రేపు వెళ్ళి ఎడ్వాన్స్ ఇచ్చిరా" అందావిడ.





"సరేనమ్మా!" అన్నాడతను. మరునాడు అతను కొత్త ఇంటికి రెండునెలల అద్దె ఎడ్వాన్స్‌గా ఇచ్చానని చెప్పాడు. శ్వేత క్షణ కాలం తననితాను మరచిపోయి ఊహలలో విహరించింది. ఆ ఇంట్లో తను, భర్త ఇద్దరే వుంటారు. మెల్లిగా అతనిలో మార్పు తీసు కురావాలి. భార్యా భర్తల బంధం డబ్బుతో గట్టిపడదని, అవగాహన పునాదిగా అను రాగ హర్మ్యాన్ని నిర్మించుకోవాలని, అప్పుడే ఆ బంధం శాశ్వతమవుతుందని అతనికి తెలియచెప్పాలనుకుంది.

వారం తరువాత రఘురామయ్య, జాన కమ్మ విజయవాడ వచ్చారు. కూతురి సంసారానికి కావలసిన సామాన్లు కొనడా నికి పదివేల రూపాయలు తెచ్చాడాయన. వాళ్ళిద్దరితోబాటు శ్వేత, రాజేశ్వరమ్మ కూడా బజారుకివెళ్ళారు.

రాజేశ్వరమ్మకి ఒక్క సామానూ నచ్చ లేదు. స్టీలు గిన్నెలు మరీ రేకుల్లా వున్నా యంది. మంచం టేకు కలపతో చేసినది కాదంది. మొత్తం మీద సాయంకాలందాకా బజారు తిరిగి వట్టిచేతులతో ఇంటికి వచ్చారు. స్టీలు సామాన్లు మెడ్రాసు నుంచి తన స్నేహితురాలిచేత తెప్పిస్తానని, మంచం మారేడ్‌పల్లిలో ఫారెస్ట్ డిపార్ట్ మెంటులో తన భర్త స్నేహితుడు పని చేస్తున్నాడని, అతనికి చెప్తే వారంరోజులలో మంచి కలపతో మంచాలు తయారయి వస్తాయని చెప్పింది.

చేసేదిలేక డబ్బు వియ్యపురాలిచేతిలో పెట్టి వెళ్ళిపోయారు రఘురామయ్య దంప తులు.

వారం రోజులు గడుస్తున్నా భర్త కాని, అత్తగారు కాని వేరే ఇంట్లో కాపురాన్ని గుర్తించి మాట్లాడకపోవడంతో శ్వేత అను మానం మరింత బలపడింది. తన అను మానం నిరాధారమైనది కాదనే నిజాన్ని ఆమె త్వరలోనే తెలుసుకోగలిగింది.

శ్వేతతోబాటు అదే స్కూలులో పనిచేసే రూప అనే అమ్మాయి నాలుగు రోజులు సెలవుపెట్టి తిరిగి ఆ రోజే స్కూలుకి వచ్చింది.

"సెలవు పెట్టారేం ఊరెళ్ళారా? " అని అడిగింది శ్వేత.

"లేదండీ. ఇల్లు మారాం" చెప్పిందామె.

"ఎక్కడ మీ ఇల్లు? "

ఆమె ఎడ్రస్ చెప్పింది. "ఎప్పటినుంచో మిమ్మల్ని మా ఇంటికి రమ్మని పిలుస్తున్నా మీరు రానేలేదు. ఇవ్వాళైనా రండి" అంది రూప.

"ఇవాళ వస్తాను" అంది శ్వేత.

సాయంకాలం స్కూలునుంచి రూపతో బాటు ఆమె ఇంటికి వెళ్ళింది.

గేట్లోకి అడుగుపెడుతూనే ఆమె స్థాణువ యింది. అది ఆ ఇల్లు అత్తగారు తమకోసం చూసిన ఇల్లు... వారంక్రిందట భర్త ఎడ్వాన్స్ ఇచ్చానని చెప్పిన ఇల్లు.

ఆమెకి తల తిరిగిపోసాగింది. "అత్తగారు, భర్త ఎందుకింత నాటకం ఆడారు? " ఆలో చిస్తున్న ఆమెకి సమాధానం సులువుగానే దొరికింది. డబ్బుకోసం!

తన తండ్రి తమ కాపురంకోసం ఇచ్చిన డబ్బు అత్తగారు ఎంత నాజూగ్గా లాక్కు న్నదీ అర్థమైన ఆమె ఆవిడ తెలివితేటలని మనసులోనైనా ప్రశంసించ లేకుండా వుండ లేకపోయింది. ఆవిడ తన తండ్రినుంచి ఎంత డబ్బు ఎలా లాక్కోవాలా అని ఎప్ప టికప్పుడు పథకాలు వేస్తూనేవుంది. ఆ పథ కాన్ని ఎలాంటి అనుమానం రాకుండా దిగ్వి జయంగా అమలుచేయగలుగుతోంది" ఆమె పెదవులపై విషాదపూరితమైన నవ్వు ఉద యించింది.

★ ★ ★

ఫోన్ మోగింది. రవి లిఫ్ట్‌చేశాడు.

"బావగారూ! నేను అవంతిని కాకి నాడనుంచి"

"ఓ! నువ్వా? ఎలా వున్నావు? ఏమిటి విశేషం? "

"ఇవాళ మా అక్క బర్త్‌డే. దానికి గ్రీటింగ్స్ చెబుదామని చేశాను"

"ఇవాళ స్రవంతి బర్త్‌డేనా? నాకు తను చెప్పనేలేదేమిటి? "

"మిమ్మల్ని సర్‌ప్రైజ్ చేద్దామని కాబోలు"

"తన బర్త్‌డే అని తెలిసి, మంచి గిఫ్ట్ ఏదైనాకొని, తనని నేను సర్‌ప్రైజ్ చెయ్యాలికానీ, తన బర్త్‌డే అని నాకు చెప్పకుండా తను నన్ను సర్‌ప్రైజ్ చెయ్యడమేమిటి? " బాత్‌రూం డోర్ తీసుకుని గదిలోకి వస్తున్న స్రవంతితో అన్నాడు.

"మీ చెల్లెలు ఫోన్ చేసింది. లైన్‌లో వుంది. మాట్లాడు"

స్రవంతి ఫోన్ తీసుకుంది.

"విష్ యూ ఎ వెరీ హేపీ బర్త్‌డే అక్కా!"

"థాంక్ యూ!"

తమ్ముడితో, తల్లీతండ్రీతో మాట్లాడి ఫోన్ పెట్టేశాక, తననే సీరియస్‌గా చూస్తున్న రవి కనిపించాడు.

"ఇవాళ నీ బర్త్‌డే అని నాకు ముందే ఎందుకు చెప్పలేదు? "

"బర్త్‌డే ఘనంగా సెలబ్రేట్ చేసుకోడానికి నేనేమైనా రాజకీయ నాయకురాలినా? సినీ తారనా? "

"ఏం, వాళ్ళు తప్ప మామూలువాళ్ళు బర్త్‌డే చేసుకోకూడదా? "

"చేసుకోవచ్చు"

అతను ఆమె నుదుటిమీద ముద్దుపెట్టుకుని చెప్పాడు.

"మెనీ హేపీ రిటర్న్స్ ఆఫ్ ది డే. విష్ యు ఎ వెరీ హేపీ బర్త్‌డే"

"థాంక్ యూ"

"ఇవాళ స్పెషల్స్ ఏమిటి? "

"నాకిష్టమైన ఆవకాయ అన్నం"

"ఛా... నిజమా? "

"ముందు గుడికెళ్ళివద్దాం. మీకు వీలవుతుందా? "





"నేను ఫ్యాక్టరీకి వెళ్లాలి" అన్నాడు. క్షణం ఆగి మళ్ళీ "పోన్లే నీకోసం ఒక గంట సమయం కేటాయిస్తాను" అన్నాడు.

"థాంక్ యూ" నవ్వింది.

అతను అప్పటికే తయారై వుండడంతో వెంటనే గుడికి బయలుదేరారు. కిందకి వచ్చేటప్పటికి మాధవరావుగారు, త్రిపురాంబ ఎదురుగా కనిపించారు.

ఆ ఇద్దరికీ పాదాభివందనం చేసింది.

"ఏమిటమ్మా ఇవాళ విశేషం? " అడిగారాయన.

"నా పుట్టినరోజు మామయ్యగారూ!" చిరునవ్వుతో అంది.

"ఇలాంటి పుట్టినరోజులు నువ్వెన్నో చేసుకోవాలి" అన్నారాయన.

ఆమె తలపై చెయ్యివుంచి త్రిపురాంబ కూడా అయిష్టంగానే కోడలిని ఆశీర్వదించింది.

"మేం గుడికి వెళ్లొస్తాం నాన్నగారూ" అన్నాడు రవి.

"వెళ్ళిరండి"

స్రవంతి అత్తగారికి కూడా చెప్పి బయటకొచ్చింది. కొద్దిసేపటికిందట భర్త కోడలి తలమీద చెయ్యివుంచి ఆశీర్వదిస్తున్నప్పుడు ఆయన చేతివేలికి వజ్రపు ఉంగరం లేకపోవడం గమనించిన త్రిపురాంబ కొడుకు, కోడలు నిష్క్రమించగానే అడిగింది.

"మీ డైమండ్ రింగ్ ఏది? "

"అమ్మేశాను"

"అమ్మేశారా లేక మీ కోడలికి బర్త్‌డే గిఫ్ట్‌గా ఇచ్చేశారా? "

"నేనా? గిఫ్టా? " నవ్వేడాయన. "డైమండ్ రింగ్ గిఫ్ట్‌గా ఇవ్వడానికి నేనేమైనా కోటీశ్వరుడినా? " ఆయన అక్కడ నుంచి డైనింగ్ టేబుల్ దగ్గరకి వెళ్ళిపోయారు.

త్రిపురాంబ కోపంతో రగిలిపోతోంది. 'ఖచ్చితంగా స్రవంతికే ఉంగరాన్నిచ్చి వుంటారీయన. అమ్మేశానని అబద్ధం చెప్పారు' ఆవిడ దండ తాడిత భుజంగంలా

భర్తని అనుసరించి వచ్చింది.

మాధవరావుగారు బ్రేక్‌ఫాస్ట్ తింటున్నారు.

"ఉంగరం ఎవరికిచ్చారు? నిజం చెప్పండి? "

"అమ్మేశానని చెప్పానుగా? "

"అంత అవసరం ఏమొచ్చింది? "

"ఎవరైనా ఒంటిమీదున్న బంగారాన్ని ఎందుకు అమ్ముకుంటారు? అవసరానికి"

"అదే... అంత అవసరం ఏమొచ్చిందని? "

"అది నా వ్యక్తిగత విషయం. ఇందులో నీ జోక్యం అనవసరం"

"అది మా నాన్నగారు పెళ్ళిపీటలమీద మీకు పెట్టిన ఉంగరం. పెళ్ళి సమయంలో పెట్టిన ఉంగరాన్ని ఎలా అమ్మేయ్యగలిగారు? "

"పెళ్ళి, భర్త అనే వాటికి నీ దృష్టిలో విలువే లేనప్పుడు ఉంగరం గురించి ఎందుకిన్నిసార్లు అడుగుతున్నావ్. నాకు డబ్బు అవసరం వచ్చింది. అమ్మేశాను"

"అంతస్తుని మరిచిపోయి మా నాన్న నన్ను మీకిచ్చి పెళ్ళిచేశారే, ఆయన్ని అనాలి" ఇంకా ఏదో అనబోయిన త్రిపురాంబ వంటింట్లోనుంచి వస్తున్న తాయారమ్మగారిని చూసి మిగతా మాటలని మింగేసి చరచరా గదిలోకి వెళ్ళిపోయింది.

మాధవరావుగారు అసలేమీ జరగనట్టు తాయారమ్మగారితో అతి మామూలుగా చెప్పారు.

"నాకు కొంచెం మజ్జిగ ఇవ్వండి. కాఫీ వద్దు"

★ ★ ★

"అమ్మా స్రవంతీ!" జడ వేసుకోబోతున్న స్రవంతి మామగారి పిలుపుతో సంభ్రమంగా గది బయటికి వచ్చింది.

"రండి మామయ్యా!"

ఆయన లోపలికి రాలేదు. "నీ పుట్టినరోజుకదా. నీకో కానుక ఇద్దామని వచ్చానమ్మా"

"ఎందుకు మామయ్యగారూ!" మొహమాటంగా అంది.

"కాదమ్మా! నేనిచ్చే కానుక చిన్నదే. నీకది అపురూపమైనదిగా కన్పించకపోవచ్చు. కానీ అతి విలువైనది"

స్రవంతి కుతూహలంగా చూస్తోంది. మామగారు తనకివ్వబోతున్న అపురూపమైన కానుక ఏమైవుంటుంది?

ఆయన లాల్చీ జేబులోనుంచి ఒక గొలుసుతీసి ఆమెముందుకి జాపారు.

"తీసుకోమ్మా"

స్రవంతి పాముని చూసినట్టు ఉలిక్కిపడింది. తలమీదనుంచి ఒక మిస్సైల్ దూసుకువెళ్ళినప్పటి షాక్! ఆమె అప్రయత్నంగానే రెండడుగులు వెనక్కివేసింది. ఆమె భయోత్పాతంతో వెడల్పయిన కళ్ళతో ఆ గొలుసునే చూస్తోంది.

"ఈ గొలుసు... ఈ గొలుసు..." ఆమెకి ఎలా పూర్తిచెయ్యాలో అర్థంకాలేదు.

"ఈ గొలుసు నీదే. నువ్వు ఆరోజు జ్యూయెలరీ షాపులో అమ్మేశావు. నేను ఆ షాపులో వి.ఐ.పి. కేబిన్‌లో కూర్చున్నాను. ఆ షాపు ఓనర్ నా ఫ్రెండే. గ్లాసు డోర్‌లోనుంచి నువ్వు షాపులోకి రావడం, మెడలోని గొలుసుని తీసి అమ్మేయ్యడం చూశాను. వెంటనే నాకా గొలుసు కావాలని కొన్నాను. కొనడానికి నా దగ్గర డబ్బులేదు. అందుకే నా డైమండ్ రింగ్ అమ్మి ఈ గొలుసు కొన్నాను"

"మామయ్యా" కంపించిపోతోంది స్రవంతి.

"నీ మెడలోని గొలుసు అమ్మి నీ పుట్టింటివాళ్ళు రవికి నవరత్నాల ఉంగరంకోసం డబ్బిచ్చారని చెప్పాలనుకున్నావు. కానుకలతో మీ అత్తగారిని సంతృప్తిపరచి ఆవిడ మెప్పు పొందాలనుకున్నావు. కానీ ఆషాఢపట్టీగా వేలకివేలు ఇచ్చినా మీ అత్తగారు సంతృప్తిపడదు. ముందు దసరా, ఆపైన

సంక్రాంతి ఇలా ఏవేవో పండుగలు వస్తూనే వుంటాయి. మీ అత్తగారికి అన్నింటికీ పెద్ద కానుకలే కావాలి. అప్పుడేం చేస్తావ్? ఏం అమ్మి ఆవిడని సంతృప్తి పరచాలనుకు న్నావ్? "

"మామయ్యగారూ!" స్రవంతికి ఏడుపొ స్తోంది.

"మాతో ఆస్తిలో, అంతస్తులో ఏమాత్రం సరితూగని నిన్ను ఈ ఇంటికోడలిగా ఎందుకు చేసుకున్నానో తెలుసా? డబ్బుకి తప్ప మనుషులకి విలువనివ్వని మీ అత్తగా రిలో మార్పు తెస్తావని"

"నేనేం చెయ్యగలను మామయ్యా" నిస్స హాయంగా అడిగింది.

"నువ్వేం చేస్తావో నాకు తెలియదు. కానీ మీ అత్తగారిని కానుకలతో సంతృప్తిపరిచే ఓ ప్రయత్నంలో దిగజారిపోకు"

"మామయ్యగారూ! నన్ను మన్నించండి" స్రవంతి చప్పున ఆయన పాదాలకి నమస్క రించింది. ఆమె కన్నీళ్ళు ఆయన పాదాలని అభిషేకిస్తున్నాయి.

"వద్దమ్మా! ఏడ్చి నీ బలహీనతని బయట పెట్టుకోకు"

ఆమె కన్నీళ్ళు తుడుచుకుంది.

"ఇంతకీ ఆ డబ్బు మీ అమ్మగారిచేత మీ అత్తగారికి ఇప్పించావా? "

"లేదు మామయ్యా" అంటూ ఆరోజు జరి గినదంతా చెప్పింది.

"చూశావా? మీ అమ్మగారు వివేకంగల మనిషి కాబట్టి నీ ప్రతిపాదనని అంగీకరిం చలేదు. ఆవిడే గనుక ఆ డబ్బు మీ అత్త గారికిస్తే ఎన్నిచిక్కులు ఎదురయ్యేవి? తృప్తిలేని మనిషమ్మా మీ అత్తగారు. ఆవి డకి జీవితాంతం ఘనమైన కానుకలని ఇస్తూనే వుండాలి. ఈ కాలంలో కొందరు మరీ తెలివి మీరిపోయారమ్మా. కట్నం వద్దంటూనే తెలివిగా కానుకలని రాబట్టు కుంటున్నారు. వున్నవాళ్ళు ఇస్తున్నారు. లేని వాళ్లని పీడిస్తున్నారు. మీ అత్తగారు చాలామందిలా నిన్ను కానుకలకోసం పీడిం చదు. ప్రతి విషయంలోనూ పెద్దకోడలితో నిన్ను పోలుస్తూ ఆత్మన్యూనతతో నువ్వు కృంగిపోయేలా చేస్తుంది. నేను తక్కువ దాన్ని అనే భావాన్ని నీ మనసులోనుంచి తీసిపారెయ్యి. నువ్వీ ఇంటికోడలివి. నీకీ ఇంట్లో బాధ్యతలేకాదు, హక్కులూ వున్నాయి. నీలోని లోపాలను నీ వ్యక్తి త్వంతో భర్తీ చెయ్యి" క్షణం ఆగి అన్నారా యన. "నువ్వుమాత్రం ఇలాంటి పిచ్చిపని మరోసారి చెయ్యనని నాకు మాట ఇవ్వమ్మా"

"మీ పాదాలసాక్షిగా ఎప్పుడూ ఇలాంటి తప్పుచెయ్యను మామయ్యగారూ"

"మీ అత్తగారు వచ్చేవేళయింది. ఇంక నేను వెళ్తానమ్మా. మనిద్దరి మధ్య జరిగిన ఈ సంభాషణను నీ భర్తతో కూడా చెప్పకు"

"ఒక్క క్షణం మామయ్యా!" స్రవంతి గది లోకివెళ్ళి డబ్బుతో తిరిగివచ్చింది.

"ఇది నా గొలుసు అమ్మగా వచ్చిన డబ్బు. మీ ఉంగరాన్ని అమ్మి నా గొలుసుని మీరు కొన్నారు. ఈ డబ్బుతో మీరు అమ్మిన ఉంగరాన్ని మళ్ళీ కొనుక్కోండి మామయ్యా"

"వద్దమ్మా! ఈ డబ్బుని నీ దగ్గరే ఉంచి మరోలా సద్వినియోగం చెయ్యి. నాకీ వయ సులో ఉంగరాలు, గొలుసులు ఎందు కమ్మా? నువ్వు సుఖంగా, సంతోషంగా ఉండు. అది చాలు నాకు. ఈ ఇంట్లో వాళ్ళ ఇష్టానికి వ్యతిరేకంగా నిన్ను ఈ ఇంటికోడ లిగా చేసినందుకు నేను పశ్చాత్తాపపడేలా చెయ్యకు" అని ఆయన మెట్లు దిగి కిందకి వెళ్ళిపోయారు.

స్రవంతి మనసు ఆయన తనపట్ల చూపి స్తున్న అభిమానానికి ఆర్ద్రమై కళ్ళు చెమ ర్చాయి. ఆమె చేతిలోని గొలుసుని కళ్ళకద్దు కుని మెడలో వేసుకుంది. మామగారిలో తండ్రి కన్పించాడామెకి ఆ క్షణంలో. ఆమె మాధవరావుగారి మాటలతో ఎంతటి సంచ




లనానికి గురయిందీ అస్థిమితంగా గదంతా పచార్లు చేస్తున్న తీరే తెలియచేస్తోంది.

బీరువాలో డబ్బు భద్రపరిచివచ్చి గదంతా కలియతిరుగుతూ ఆలోచిస్తోంది 'ఎలా అత్తగారిలో మార్పుతేవడం? '

ఆలోచిస్తున్న ఆమె బూట్ల శబ్దానికి ఉలిక్కిపడింది. తిరిగిచూస్తే రవి! అతనిముఖం వాడిపోయివుంది. ముందు పని తాలూకు అలసటేమో అనుకుంది. పరిశీలించి చూస్తే సర్వస్వం కోల్పోయిన చక్రవర్తిలా వుందతని ముఖం.

"ఎందుకలా వున్నారు? " ఆమె అతని పక్కలో కూర్చుంటూ అడిగింది.

"ఏమీలేదు" పొడిగా అన్నాడు.

"ఏదో వుంది. మీరు నానుంచి దాస్తున్నారు"

"ఏమీ లేదంటున్నానా? నన్ను కాసేపు ఒంటరిగా వదిలెయ్యి" అతను చిరాగ్గా అరిచాడు.

అతని స్వరంలోని ఆగ్రహం, చిరాకు ఆమెని దిగ్గున మంచంమీదనుంచి లేచిపోయేలా చేశాయి.

ఆమె బాల్కనీలోకి వచ్చి నిలబడింది. "ఏం జరిగి వుంటుంది? ఎందుకలా వున్నాడతను? ఫ్యాక్టరీలో ఏమైనా గొడవలు జరిగాయా? "

చాలాసేపు అలాగే నిలబడి కాళ్ళు నొప్పి పుడుతుంటే తిరిగి గదిలోకి వచ్చింది. రవి కళ్ళకి అడ్డంగా చేతిని పెట్టుకుని పడుకుని వున్నాడు. అతను నిద్రపోతున్నాడో ఏమైనా ఆలోచిస్తున్నాడో ఆమెకి అర్థంకాలేదు.

ఆమె కిందకి వచ్చి ఫ్రిజ్‌లోనుంచి మంచి నీళ్ళ బాటిల్ తీసుకుని పైకి వచ్చింది. రవి ఇందాకటి పొజిషన్‌లోనే పడుకుని వున్నాడు. స్రవంతి మంచినీళ్ళు తాగివచ్చి తనూ పడుకుంది. అతనిలో కదలికలేదు. ఆమెకి ఆ రాత్రి నిద్రపట్టలేదు. రవి కూడా నిద్రపోలేదని ఆమెకి తెలియదు.

★ ★ ★

తెల్లవారుఝామున మాగన్నుగా నిద్రపట్టినా అలవాటు ప్రకారం అయిదుగంటలకే మెళుకువ వచ్చింది స్రవంతికి. కళ్ళు విప్పే సరికి తన పక్కనే కూర్చుని, తననే చూస్తున్న భర్త కనిపించాడు. ఆమె లేచి కూర్చుంది.

"ఐ యామ్ సారీ" అన్నాడతను. అతని స్వరంలోనేకాదు కళ్ళలో కూడా పశ్చాత్తాపం వ్యక్తమవుతోంది.

"దేనికి? " అర్థంకాక అడిగింది.

"నిన్న నీ పుట్టినరోజు. నిన్ను పస్తు వుంచినందుకు"

"మీరూ అన్నం తినలేదుగా? "

"నిన్న సాయంకాలం పెందరాళే ఇంటికి వచ్చి నిన్ను డిన్నర్‌కి బయటకి తీసుకెళ్ళి నీకోసం మంచి గిఫ్ట్‌కొని నిన్ను సర్‌ప్రైజ్ చెయ్యాలనుకున్నాను. కానీ"

"ఫ్యాక్టరీలో ఏదో గొడవ జరిగి వుంటుంది"

"కాదు"

"మరి? "

"బ్యాంక్‌లో నా పేర డబ్బేమీలేదు"

"అంటే? "

"నీకు గిఫ్ట్‌గా ఎమరాల్డ్ రింగ్ కొందామని బ్యాంకులో డబ్బు డ్రా చేసుకురమ్మని ఆఫీసుబాయ్‌ని బ్యాంకుకి పంపాను. అతను వచ్చి బ్యాంక్‌లో నా అకౌంట్‌లో డబ్బేమీలేదని చెప్పాడు. నేను బ్యాంక్‌కి ఫోన్ చేసి కనుక్కుంటే అన్నయ్య డబ్బు డ్రాచేసి పట్టుకెళ్ళాడని చెప్పారు. ఆ విషయమై అన్నయ్యని అడిగితే 'నీకు వేరే ఖర్చులేం వుంటాయి? నీకు డబ్బెందుకు? ' అన్నాడు. నాకు చాలా బాధ అన్పించింది. నాకు ఖర్చులుండవా? " గాయపడిన అతని మనసు కళ్ళలో ప్రతిఫలిస్తోంది.

"మీ అకౌంట్‌లో డబ్బు మీ సంతకం లేకుండా మీ అన్నయ్య ఎలా డ్రా చేశారు? "

"నా పవర్ ఆఫ్ అటార్నీ అన్నయ్య దగ్గర వుంది"

స్రవంతి ముడిపడిన భ్రుకుటితో చూస్తోంది.

"బావగారు ఎందుకలా చేశారు? "

"ఇంటికి రాగానే అదే విషయాన్ని అమ్మని అడిగాను. ఈ ఇంట్లో డబ్బు పెత్తనం ఒకళ్ళదే. అది అన్నయ్యది" అందా విడ.

"మరి మీ అవసరాలకి డబ్బెలా? "

"బహుశా అన్నయ్యని అడగాలనుకుంటాను"

"మీ అమ్మగారు ఎందుకలా చేశారు? "

"అదే నాకూ అర్థం కావడంలేదు"

"పోన్లెండి. నా బర్త్‌డేకి మీరు గిఫ్ట్ ఇవ్వకపోతేనేం? బర్త్‌డేలు చాలానే వస్తాయి. మరోసారి ఇద్దరుగాని" అంది అతన్ని ఊరడిస్తున్నట్టు. కానీ మనసులో ఆలోచన మాత్రం ఎంతకీ తెగడంలేదు. అత్తగారు రవికి డబ్బు పెత్తనం లేకుండా ఎందుకు చేసినట్టు?



త్రిపురాంబ స్రవంతి మెడలోని గొలుసుని చూస్తూనే నిటారుగా అయింది. 'శ్రీధర్ స్రవంతి ఆ గొలుసుని అమ్మగా వచ్చిన డబ్బులోనుంచి తల్లిచేత రవికి ఆషాఢపట్టీగా రెండువేలు ఇప్పించిందని చెప్పాడు. మరి మళ్ళీ అదే గొలుసు స్రవంతి మెడలోకెలా వచ్చింది? శ్రీధర్ పొరపాటు పడ్డాడా? లేక ఆమె గొలుసు అమ్మేసి వుంటుందని ఊహించాడా? ' ఆలోచిస్తున్న ఆవిడకి మబ్బు విడిపోయినట్టు అయింది. 'స్రవంతి గొలుసు అమ్మి వుండదు. రవి అత్తగారి పరువు నిలబెట్టడంకోసం తన అకౌంట్‌లోనుంచి డబ్బుతీసి ఆవిడ ఇచ్చిందని నాటకం ఆడి వుంటాడు ఆవిడ వెంటనే శ్రీధర్‌ని పిలిచి అంది.

"నువ్వు వెంటనే రవిపేర వున్న డబ్బు విత్‌డ్రా చేసి నీ అకౌంట్‌లో వేసుకో. వాడి చేతిలో డబ్బువుంటే అత్తారికి దోచిపెట్టడన్న నమ్మకం ఏమిటి? "

"నిజమేనమ్మా!" అన్నాడు శ్రీధర్ గంభీరంగా చూస్తూ. అతనికి లోలోపల ఎంతో సంతోషంగా ఉంది.

"అసలు వాడికి డబ్బు సంబంధమైన ఏ పెత్తనం ఇవ్వకు"

"అలాగేనమ్మా!" అతనికి ప్రపంచాన్ని పాదాక్రాంతం చేసుకున్నంత ఆనందంగానూ, గర్వంగానూ వుంది. తల్లి తనకి మొత్తం డబ్బు పెత్తనాన్ని అప్పగించింది. మొదట తండ్రికి పెత్తనం లేకుండా చేసింది. ఇప్పుడు రవికి. ఇదే మంచి అవకాశం. తను ఎవరికీ అనుమానం రాకుండా జాగ్రత్తపడాలి.

ఆలోచిస్తున్న అతను డోర్ తెరుచుకుని రవి లోపలికి రావడంచూసి సర్దుకుని కూర్చున్నాడు.

రవి కాస్సేపు ఫ్యాక్టరీ విషయాలు మాట్లాడి తర్వాత అడిగాడు.

"నాకు కొంచెం డబ్బు కావాలి"

"ఎంత? "

"పాతికవేలు"

"పాతికవేలా? అంత డబ్బెందుకు? "

"నాకూ ఖర్చులుంటాయి అన్నయ్యా"

శ్రీధర్ ముఖం గంటు పెట్టుకుంటూ అన్నాడు.

# ఏరిన ముత్యాలు

★ అంతర్గతంగా మనం ఆటవీకులుగా క్రూరంగా ఉన్నంతకాలం ఎంత విజ్ఞానం పెరిగినా అదంతా వృధాయే.

– జిడ్డు కృష్ణమూర్తి

★ శోకించడం అనేది ఒకరకమైన సోమరితనం.

– జాన్సన్

★ ఆలోచనలకు తావివ్వనివాడు ఎవడోకాదు ఎల్లప్పుడూ మాట్లాడేవాడు మాత్రమే.

– మాథ్యూప్రియర్

★ ఏ కార్యం చేసినప్పుడు మహదానందం కలుగునో అదే శ్రేష్టమైనది.

– గౌతమబుద్ధుడు

★ అనేక విషయాలకు సంబంధించి మిడిమిడి జ్ఞానం కలిగియుండడం కంటే కూడా ఏమీ తెలుసుకోకపోవడం మంచిది.

– నీట్ఛ్శే

★ ప్రతిఫలాపేక్ష లేనిది భగవత్ప్రేమ. ప్రతిఫలాన్ని ఆశించేది లౌకికప్రేమ.

– రవీంద్రనాథ్‌ఠాగూర్

★ పోగొట్టుకున్న మాటను తిరిగిపొందడం అనేది ఒక్క క్షమాపణలోనే ఉంది.

– డి.సి.పి.

★ ఒక మంచితల్లి వందమంది ఉపాధ్యాయులకు సమానం.

– సంస్కృత సూక్తి

★ ఆరోగ్యం కలవాడే యవ్వనవంతుడు. రుణం లేనివాడే ధనవంతుడు.

–షేక్స్పియర్

★ సలహా అనేది ఎవరికి అత్యవసరమో వారికే అది రుచించదు.

–జాన్సన్

★ ఇనప్పెట్టెలో డబ్బు కంటే బజారులో మిత్రుడు చాలా విలువైనవాడు.

– డాంగ్రీడ్జ్

★ మనిషి ఎప్పుడూ కోరకూడనివే కోరతాడు.

– సైరస్

★ ఉదారంగా నీ శతృవులను క్షమించు. వారు నీకు ఎంత మంచి మిత్రులవుతారో చూడు....

– చిన్మయానంద

★ రెండింటికీ మధ్యగల అవకాశాన్ని అనుభవించడం తప్ప జనన మరణాలకు మందులేదు...

– జార్జి శాంతాయన

సేకరణ: శివప్రసాద్ పండా

"ఇప్పుడు నా దగ్గర అంత క్యాష్‌లేదు. రేపు ఇస్తాను. కానీ నువ్వు ఖర్చుపెట్టిన డబ్బుకి నాకు అకౌంట్ చూపించాలి" అన్నాడు.

రవి ముఖం ఎర్రబడింది.

"ఇన్నాళ్ళూ మనిద్దరం చాలా డబ్బు ఖర్చుపెట్టుకున్నాం. కానీ, నాకు నువ్వు, నీకు నేను అకౌంట్ అప్పచెప్పలేదే"

ఈసారి ముఖం ఎర్రబడడం శ్రీధర్ వంతయింది.

"నా షేవింగ్ క్రీమ్ ఖర్చు, బ్లేడు కూడా ఎకౌంట్‌లో రాయాలా? " రవి వ్యంగ్యంగా అన్నాడు.

"రేపు డబ్బు ఇస్తాను వెళ్లు" శ్రీధర్ పళ్ళ బిగువున అన్నాడు.

రవి లేచి బయటకి వచ్చాడు. అతనికి అశాంతిగా వుంది. అన్నగారికి తనకి మధ్య జరిగిన సంభాషణను పునశ్చరణ చేసుకుంటున్న అతనికి తామిద్దరూ అన్నదమ్ముల్లాకాక ఇద్దరు పార్ట్నర్స్ మాట్లాడుకున్నట్టు అనిపించింది. తన బ్యాంకు అకౌంటు కాన్సిల్ చెయ్యడానికి, ఇప్పుడు తను ఖర్చుపెట్టిన డబ్బుకి అకౌంట్ అడగడానికి ఏదో లింక్ వుందనిపించిందతనికి.

★ ★ ★

వర్ష పెళ్ళి నిశ్చయమయింది. వరుడు ధీరజ్ ఇంజనీరింగ్ చదివి, అమెరికాలో ఎమ్.ఎస్. చేసివచ్చి స్వంతంగా ఇండస్ట్రీ పెట్టుకున్నాడు. వరలక్ష్మి సంబరం చూడాలి. కూతుర్ని సాక్షాత్తు దేవలోకం నుంచి ఇంద్రుడో, కుబేరుడో వచ్చి పెళ్ళి చేసుకోబోతున్నంత ఆనందం. వియ్యాలవారి గొప్పలు చెప్పిచెప్పి ఆమె నోరునెప్పిపెట్టిందో లేదో కాని, విన్న వాళ్ళ చెవులు మాత్రం తడకలు కట్టాయి.

"వాళ్ళింట్లో ఫర్నిచర్ మూడు లక్షల ఖరీదు చేస్తుంది. మొన్ననే పది లక్షలు పెట్టి లాన్సర్ కారు కొన్నారు" మురిపెంగా చెబుతున్న కూతురిని చూస్తూ "వర్ష అదృష్టవంతురాలు. కోటీశ్వరుల సంబంధం. ఒక్కగానొక్క కొడుకు ఇంతకీ, కట్నం ఏమైనా అనుకున్నారా" అడిగింది త్రిపురాంబ.

"కట్నం వద్దన్నారమ్మా! వాళ్ళు వద్దన్నారు కదా అని మనం దిగదీస్తే ఏం బాగుంటుంది? అందుకే ఆడబడుచులిద్దరికీ వెండి బిందెలు, డైమండ్ రింగ్స్, పట్టుచీరలు పెడదామనుకుంటున్నాము"

ఆవిడ చదువుతున్న లిస్టులో అన్నీ వెండి సామాన్లే. కాళ్ళు కడిగే పళ్ళెం, చెంబుకూడా వెండివే పెడుతుండట. వాళ్ళు పెళ్ళి ఖర్చు గురించి మాట్లాడుకుంటూ వుంటే స్రవంతి కేవలం శ్రోతగా మిగిలిపోయింది. మధ్యలో కల్పనని సలహా అడుగుతున్నారు.

నిశ్చితార్థం ఏర్పాట్లు ఘనంగా చేస్తున్నారు. వరలక్ష్మి, శివశంకరం. డబ్బు వెదజల్లుతున్నారు. తమ ఒక్కగానొక్క కూతురి పెళ్ళి 'నభూతో నభవిష్యతి' అన్నట్టు జరపాలని వాళ్ళ కోరిక. చెన్నైనుంచి పట్టుచీరలు, వజ్రాల నగలు కొనితెచ్చారు.

ఆరోజు వర్షని పెళ్ళికూతురిని చేశారు. వంటినిండా నగలతో, ఖరీదైన పట్టుచీరలో ఆమె అందం ద్విగుణీకృతమయింది. పెళ్ళికూతురి అలంకరణ చెయ్యడంకోసం బ్యూటీషియన్‌ని పిలిపించింది వరలక్ష్మి. వీడియోలు, ఫోటోలు, ఆహూతుల పట్టుచీరల రెపరెపలు, డైమండ్ నగల మిలమిలలు, అంబరాన్ని తాకిన సంబరాలు వీటన్నింటి మధ్య ఒంటరిగా వుండిపోయింది స్రవంతి. రవి సుమూహూర్తంవేళకి వచ్చి ఫ్యాక్టరీలో పని వుందని వెళ్ళిపోయాడు. వర్ష పెళ్ళి ధీరజ్‌తో ఘనంగా జరిగిపోయింది.

★ ★ ★

గది మూలగా ఒదిగిపడుకున్న శ్వేత ఆలోచిస్తోంది. కోటి కలలతో, ఆశలతో మోహన్ చెయ్యి పట్టుకుని ఈ ఇంటి గడపలో కాలుపెట్టింది. కాని తన కలలు కల్లలయ్యాయి. ఆశలు అడియాసలయ్యాయి.




తను భర్తకి అక్కర్లేదు. అత్తగారి దృష్టిలో తను డబ్బు సంపాదించే యంత్రం. వాళ్ళు మారతారనుకోడం తన భ్రమేనా? ఆ మనుషులలో మార్పురాదా?

ఆలోచిస్తున్న ఆమె తన ఒంటిమీద ఎవరిదో చెయ్యి పడడంతో ఉలిక్కిపడింది.

"నేనే!" చెవిదగ్గరగా మోహన్ స్వరం గుసగుసగా వినిపించింది. అతని చేతులలోని వేడి చెబుతోంది అతను ఆ రాత్రివేళ తన దగ్గరకి ఎందుకు వచ్చాడో. తన శరీరాన్ని ఆబగా తడుముతున్న అతని చేతులు విషనాగుల్లా అన్పిస్తున్నాయామెకి. తన ముఖాన్ని వెచ్చగా కాలుస్తున్న అతని ఉచ్ఛ్వాస నిశ్వాసాలు కాలనాగు బుసల్లా వున్నాయి. ఏహ్యతతో తిరస్కారంతో ఆమె మనశ్శరీరాలు ఎదురుతిరుగుతున్నాయి.

అతని చేతులని నెట్టేస్తూ అందామె. "నా దగ్గర డబ్బు లేదు"

"నా దగ్గరా లేదు. వుంటే నీ దగ్గరకెందుకొస్తాను"

"అంటే!" ఆమె రక్తం మరిగిపోయింది. "మీ దగ్గర డబ్బు వుంటే నేనిచ్చే సుఖాన్ని బయటకొనుక్కునేవారా? "

"ఇంట్లో భోజనం నచ్చకపోతే ఎవరైనా కడుపు మాడ్చుకుంటారా? హోటల్‌కి వెళ్ళరూ? ఇదీ అంతే!"

ఆమె నిస్సహాయమైన కోపంతో అసహ్యంతో వణికిపోతూ అంది.

"ఈ గదిలో మనిద్దరమే కాదు. రమేష్ కూడా వున్నాడు"

"వాడు పడుకున్నాడు" అతను ఆమె ప్రతిఘటించేకొద్దీ బలంగా ఒడిసిపట్టుకుంటున్నాడు. భార్యాభర్తలమధ్య కూడా రేప్ అనేది జరుగుతుందని ఏదో పుస్తకంలో చదివింది. అదిప్పుడు ప్రత్యక్షంగా ఆమె అనుభవంలోకి వచ్చింది. చీకటిని చీల్చుకుని రమేష్ తమని గమనిస్తున్నాడని ఆమె భయం. ఆకలితీరిన తరువాత అతను లేచి వెళ్ళి తన పక్కమీద పడుకున్నాడు.

బురదగుంటలో పొర్లిన పంది తన ఒంటిని రాసుకున్నట్టు జుగుప్సతో కంపిస్తోందామె శరీరం. తనపై ప్రేమలేని భర్తతో, తనకి విలువనివ్వని అత్తమామలతో ఆ ఇంట్లో ఎందుకు కలిసివుండాలో ఆమెకి అర్థమవలేదు. ఆమెకి తండ్రి తనలో కలిగించిన మనస్థైర్యం రెట్టింపయినట్టయింది.

'తను ఇక్కడనుంచి వెళ్ళిపోవాలి. అత్తగారితో, భర్తతో గొడవపడకూడదు. ఈ ఇంటి గడపదాటేముందు తన నిర్ణయాన్ని తెలియచెయ్యాలి' ఆమె ఆ క్షణంలోనే నిర్ణయించుకుంది. చాలా రోజులుగా ఆమె మనసులో పేరుకుపోయిన అశాంతి, అభద్రతా భావం మటుమాయమై ఏదో తెలియని ప్రశాంతత అలుముకుంది.

★ ★ ★

రాత్రంతా నిద్రపోకపోయినా ఆమె నూతనోత్తేజంతో లేచింది. బాత్‌రూమ్‌వైపు వెళ్ళబోతుండగా తల తిరిగినట్టయింది. కడుపులోనుంచి ఎగజిమ్మిన వికారం వాంతి రూపంలో బయటకి వచ్చింది. నోరు పుక్కిలించి అక్కడే కూర్చుండిపోయింది. కడుపులో ఇంకా వికారంగానే వుంది.

కోడలు వాంతిచేసుకుంటున్న శబ్దానికి రాజేశ్వరమ్మ బయటకొచ్చింది. ఆవిడ ముడిపడిన భృకుటి ఆలోచనల తీవ్రతను తెలుపుతోంది. ఆవిడకేదో అనుమానం. వచ్చి కోడలి దగ్గరగా వెళ్ళి అడిగింది.

"వాంతయిందా? "

"అవునత్తయ్యా"

"ఈసారి నెల దాటిపోయి పదిరోజులయింది కదూ? "

"అవునత్తయ్యా!" శ్వేతకి అత్తగారు ఎందుకలా అడుగుతోందో అర్థమై కళ్ళు సిగ్గు, బరువుతో వాలిపోయాయి. మోహన్ తనని ఇష్టంతో పెళ్ళిచేసుకోకపోనీ తన డబ్బుకోసమే చేసుకోనీ అతను ప్రేమతో తనకి దగ్గరవక కోరికతో దగ్గరయినా, తను తల్లికాబో

తోంది. ఆమెలోని మాతృహృదయం ఉప్పొంగిపోతోంది. కోడలి ముఖంలోని సిగ్గు, ఆమె కళ్ళలోని కాంతిని చూస్తూ ఈసడింపుగా అంది రాజేశ్వరమ్మ.

"పెళ్ళయి పది నెలలయినా అవలేదు. అప్పుడే కడుపా? "

తనకి మనుమడో మనుమరాలో పుట్టబో తున్నందుకు ఆవిడ సంతోషిస్తుందనుకున్న శ్వేత ఆ మాటలతో గాయపడిన పక్షిలా చూసింది.

ఆవిడ లోపలకి వెళ్ళి ఏం చెప్పిందోగాని మోహన్ పెరటి గుమ్మంలో నిలబడి ఆమెని రెండు క్షణాలు తదేకంగా చూసి లోపలకి వెళ్ళిపోయాడు. ఇలాంటి సందర్భా లలో భర్త భార్యని ఎత్తుకుని గిరగిర తిప్పి తన సంతోషాన్ని వ్యక్తం చెయ్యడం చాలా పుస్తకాలలో చదివింది. కనీసం అతను తండ్రి కాబోతున్నందుకు ఆనందాన్ని వ్యక్తం చెయ్యలేదు. కఠినంగా నల్లరాయిలా వుంద తని ముఖం. శ్వేతకి రాత్రి తను తీసుకున్న నిర్ణయం గుర్తువచ్చింది. వైవాహిక బంధాన్ని తెంచుకోవాలనుకుంది. ఆ బంధం బలపడడానికి తను తల్లికాబో తోంది. ఆమె ఓపిక తెచ్చుకుని ముఖం కడుక్కుని లోపలకి వచ్చింది.

రాజేశ్వరమ్మ ధుమధుమలాడుతూ కాఫీ గ్లాసు టక్కున ఆమె ముందు పెట్టింది.

"తా దూర సందులేదు మెడకో డోలు అని. నీ జీతంరాళ్ళు మూడు వారాలకే అయిపోయి అప్పులు చెయ్యవలసి వస్తుంటే పిల్లలొకళ్ళు తయారు, ఇంక నీ పెళ్ళానికి నెలవారీ చెకప్‌లు, మందులు, పళ్ళు, పాలు, మరో పదినెలల్లో పుట్టిన పిల్లలకి పాల డబ్బాలు, ఫారెక్స్ డబ్బాలు, వాళ్ళ రోగాలు డాక్టర్లు, మందులు"

"బస్ స్టాండ్‌లో నేను, రైల్వే స్టేషన్‌లో అది గుడ్డపరచుకుని కూర్చుని ముష్టెత్తు కుంటాం" మోహన్ నిరసనగా చూస్తూ అన్న మాటలకి శ్వేత మనసు గాయపడింది.

"ముష్టెత్తుకోవలసిన కర్మ నీకేమిట్రా? ఆ ముసలాడు కూతురు, మనుమడు కడుపు నిండా తిండి తినాలనుకుంటే నెలకో నాలుగు వేలు పంపుతాడు. లేకపోతే అది కడుపు తీయించుకుంటుంది"

శ్వేత శిలాప్రతిమలా నిలబడిపోయి, ఆ తల్లీ కొడుకుల సంభాషణను వింటోంది. ముందు తన పోషణకోసం రెండువేలు అడిగారు. ఇప్పుడు తనకి పుట్టబోయే పిల్లల ఖర్చులకోసం మరో రెండువేలు తెమ్మంటున్నారు. తండ్రి డబ్బు పంపితేనే తను పిల్లన్ని కనాలా? లేకపోతే అబార్షన్ చేయించుకోవాలా? ఆమె కళ్ళు నీటి చెలమలయ్యాయి. భర్తని నిలదీసి ఇదేమిటని అడగాలనుకుంది. కనీసం అతనితో మనసు విప్పి మాట్లాడ్డానికైనా వేరే గదిలేదు తమకి. ఆమెకి తన నిస్సహాయతకి తనపై తనకే జాలివేస్తోంది.

కాఫీ తాగిన కాస్సేపటికే మళ్ళీ వాంతయిపోయింది. ఆమెకి కళ్ళు మూసుకుని పడుకోవాలని వుంది. ముందు గదిలో పడుకుంటే బాగుండదు. మామగారికోసం ఎవరో ఒకళ్ళు వస్తూంటారు. మామగారి పడక గదిలో నేలమీదయినా పడుకోవచ్చు కాని అత్తగారు పడుకోమనలేదు. తలతిరిగిపోతూ వికారంతో బాధపడుతున్న కోడలిని చూడనట్టే నటించిందావిడ. ఆరోజంతా ఆమె పడిన బాధ వర్ణనాతీతం. భర్త ఆఫీసునుంచి రాత్రి ఇంటికి వచ్చాక అతనితో మాట్లాడాలనుకుంది.

★ ★ ★

స్రవంతి బట్టలషాపులో మ్యాచింగ్ బ్లౌజులు కొంటూవుండగా, వెనుకనుంచి "హాయ్ స్రవంతీ" అనే పిలుపు వినిపించింది. ఈ మహానగరంలో తనని అంత చనువుగా పిలుస్తున్న దెవరా అని తల తిప్పి చూసిన ఆమెకి సంభ్రమాశ్చర్యాలతో క్షణకాలం నోటమాట రాలేదు.





"సునీత" ఆనందాతిరేకంతో పిలిచింది.

"నీ కింకా నేను గుర్తున్నానా? " సునీత ఎద్దేవాగా అడిగింది.

"నాకు నువ్వు బాగానే గుర్తున్నావు. నీకే నేను గుర్తులేను. అందుకేగా నా పెళ్ళికి రాకుండా ఎగ్గొట్టేశావ్? "

"సారీనే! నీ పెళ్ళికి మేం హనీమూన్‌లో వున్నాం. అందుకని రాలేకపోయాం"

"అయితే క్షమించానుపో" నవ్వింది స్రవంతి... "ఏమిటి విశేషాలు చెప్పు? "

"ఏముంది? మా వారిక్కడ స్టేట్‌బ్యాంకులో పనిచేస్తున్నారు. నేను కూడా ఏదో చిన్న ఉద్యోగం వెలగబెడుతున్నానులే. శ్రీమహాలక్ష్మి ఫైనాన్స్ అని పంజాగుట్టలో వుంది మా ఆఫీసు. నీ సంగతేంటి? ఎలా వుంది జీవితం? "

"బాగానే వుంది. చెప్పుకోదగిన కష్టాలూ లేవు. మైమరచిపోయే సుఖాలూ లేవు" నవ్వింది స్రవంతి. ఆమె నవ్వుతో శృతికలిపింది సునీత.

"ఇప్పుడేమిటి ప్రోగ్రామ్? "

"షాపింగ్ పూర్తయింది. ఇంక ఇంటికే మా ఇంటికి రావే. మళ్ళీ నిన్ను మీ ఇంటి దగ్గర దింపేస్తాను"

"సరే వస్తాను. ఇవాళ ఆఫీసుకి ఎలాగూ డుమ్మాకొట్టేశాను"

ఇద్దరూ పేకెట్లు మోసుకుంటూ కారు పార్కింగ్ వరకు వచ్చారు. డ్రైవరు వినయంగా డోర్ తెరిచి పట్టుకున్నాడు. ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూండగానే ఇల్లు వచ్చేసింది.

కారు దిగి సునీత ఇంటిమెట్లెక్కుతూ అంది. "నీ కారు పుష్పకవిమానం. ఇల్లు ఇంద్రభవనం. మరి దేవేంద్రుడు ఏమీన్ మీ హీరోగారేరి"

"మా ఆయన్ని దేవేంద్రుడితో పోల్చకే తల్లీ! ఆయనకి రంభ, ఊర్వశి, తిలోత్తమ వగైరా ఎవరూ లేరు. వున్నది నేనొక్కర్తినే" అంది నవ్వుతూ స్రవంతి. సునీతని కూర్చోమని సోఫా చూపించి మంచినీళ్ళు తెచ్చిఇచ్చింది.

స్రవంతి ఇంటికి తీసుకొచ్చినదెవరినా అని కుతూహలంతో కల్పన పనిగట్టుకుని హాల్లోకి వచ్చి మరీ చూసింది.

"ఇలారండక్కయ్యా! నా ఫ్రెండ్‌ని మీకు పరిచయం చేస్తాను" అంటూ స్రవంతి పరస్పరం పరిచయం చేసింది.

"తను సునీత. నా క్లాస్‌మేట్, ఫ్రెండ్. ఆవిడ మా తోటికోడలు కల్పన"

సునీత సోఫాలోనుంచి లేచి నమస్కరిస్తూ అంది.

"నన్ను గుర్తుపట్టారా కల్పనగారూ? వరంగల్‌లో దీప్తి అపార్టుమెంట్సులో మీ అమ్మగారి పక్క ఫ్లాటే మాది. శ్రావణమాసంలో మీరు మా ఇంటికి పేరంటానికి వచ్చారు"

"మీరిద్దరూ ఒకరికొకరు ముందే తెలుసా? " నవ్వింది స్రవంతి.

"ఐయామ్ సారీ! మీరెవరో నాకు తెలియదు. మీరు ఎవర్ని చూసి ఎవరనుకుంటున్నారో? " అంటూ కల్పన అక్కడనుంచి వెళ్ళిపోయింది.

సునీత ఆమెని గుర్తుపట్టినప్పుడు ఆమె ముఖంలో క్షణంలో వెయ్యోవంతు కాలంలో కదలాడిన భావాలను స్రవంతి గమనించకపోలేదు. "కూర్చోవే! కొంచెం కాఫీ తెస్తాను" అని కిచెన్‌లోకి వెళ్ళింది.

సునీత మళ్ళీ సోఫాలో కూర్చుంది. ఆమెకి కల్పన ప్రవర్తన వింతగా అన్పించింది. ఆమె తనని గుర్తుపట్టిందని ఆమె ముఖమే చెబుతోంది. కాని, ఆమె తనని చూసి ఎందుకు కంగారుపడిందో ఆమెకి అర్థంకాలేదు. ఆమె తలతిప్పి ఆ గది అలంకరణని చూస్తోంది.

"ఇదుగో అమ్మాయ్!" కటువుగా వున్న ఆ స్వరం విన్పించినవైపు తల తిప్పి చూసింది. ఖరీదైన జరీచీర, ఒంటినిండా నగలతో వున్న, ఆ నడివయస్కురాలిని చూసి

బహుశా ఆవిడ స్రవంతి అత్తగారై వుంటుందని ఊహిస్తూ లేచి మర్యాదగా నమస్కరించింది.

"వంట మనిషి పోస్టుకోసం వచ్చిన దానివి దర్జాగా సోఫాలో కూర్చున్నావే! మాకు వంట మనిషి వుంది. నీ అవసరం లేదు" అధికారికంగా వున్న ఆ స్వరానికి బిత్తరపోయింది సునీత. ఒకక్షణం ఆవిడ ఏమంటోందో ఆమెకి అర్థంకాలేదు"

"వెళ్ళు. వెళ్ళమని చెబుతుంటే నీక్కాదూ? " ఆవిడ తను స్రవంతి స్నేహితురాలని తెలియక అలా మాట్లాడుతోందేమోనని వివరణ ఇవ్వబోయింది.

"నేను... వంట" ఆమె చెప్పేది పూర్తికాకుండానే కరుగ్గా అంది త్రిపురాంబ.

"నేను వంట బాగా చేస్తాను, నా చేతి వంట అమృతం అనేగా నువ్వు చెప్పేది. పనికోసం వచ్చి దర్జాగా సోఫా ఎక్కి కూర్చున్న దానివి నువ్వు మాకేం వండిపెడతావు తల్లీ! మమ్మల్నే నీకు వండిపెట్టమనేలా వున్నావు. వెళ్లు. మాకు వంట మనిషి అక్కర్లేదు"

సునీత ముఖం రక్తంచిందేంత ఎర్రగా అయిపోయింది. ఆమె బ్యాగ్ తీసుకుని అక్కడనుంచి కదిలి బయటకివచ్చింది. ఆమె నిష్క్రమణను కిటికీలోనుంచి చూసిన కల్పన గుండెలనిండా గాలిపీల్చుకుంది.

హమ్మయ్య పీడ విరగడయింది. వరంగల్‌లో తమ పక్క ఫ్లాటులోని సునీత స్రవంతి ఫ్రెండ్ కావడమేమిటి? అసలు వాళ్ళిద్దరూ ఎక్కడ కలిసారు? తను అత్తగారితో 'మన ఇంట్లో వంట చేస్తానని వచ్చిన అమ్మాయి సోఫా ఎక్కి దర్జాగా కూర్చుందని' ఆవిడని రెచ్చగొట్టి ఆవిడ సునీతని తరిమేలా చేసింది. అది ఈ దెబ్బతో ఈ ఇంటి ఛాయలకి రాదు సరికదా, స్రవంతి ముఖం కూడా చూడదు. ఆమే కనుక మరి కాస్సేపు ఇక్కడ వుండివుంటే తన పుట్టింటి విషయాలను స్రవంతితో చెప్పేదే! ఎంత ప్రమాదం తప్పింది

కాఫీ ట్రేతో హాలులోకి వచ్చిన స్రవంతి సునీత లేకపోవడంతో అక్కడున్న అత్తగారిని అడిగింది.

"సునీత ఏది అత్తయ్యా? "

"సునీత ఎవరు? నీలం చీరలోవున్న పిల్లా? "

"అవును"

"వెళ్ళిపోయింది. కాదు నేనే వెళ్ళగొట్టాను. అయినా నువ్వు బొత్తిగా మంచీ, చెడూ లేకుండా ప్రవర్తిస్తున్నావు. అంతస్తుల తారతమ్యం లేకుండా ఎవరిని పడితే వాళ్ళని సోఫాలో కూర్చోపెట్టడమేనా? "

స్రవంతి ముఖం ఎర్రబడింది.

"ఆ అమ్మాయి నా స్నేహితురాలు"

"స్నేహితురాలు! గొప్ప స్నేహితురాలే" వ్యంగ్యంగా అంది.

ఆ వ్యంగ్యానికి స్రవంతి మనసులో ముల్లు గుచ్చినట్టయింది.

సాదా కాటన్‌చీర, మెడలో నల్లపూసల గొలుసుతో వున్న సునీతని చూస్తే అత్తగారికి ఆమె తమ అంతస్తుకి తగినది కాదనిపించిందన్నమాట. అయినా తన స్నేహితురాలిని అవమానించే హక్కు ఈవిడకెవరిచ్చారు? చాలారోజుల తరువాత కనిపించిన తన స్నేహితురాలిని ఇంటికి తీసుకొచ్చి కప్పు కాఫీ ఇచ్చి ఆమెతో మాట్లాడే స్వతంత్రం కూడా లేదా తనకి? సునీత మనసు అత్తగారు చేసిన అవమానంతో ఎంతగాయపడివుంటుంది" ఆమెకి కన్నీళ్ళు వస్తున్నాయి. గిర్రున వెనుదిరిగి తన గదిలోకి వెళ్ళిపోయింది.

★ ★ ★

'వెల్‌కమ్!' సునీత స్రవంతిని చూస్తూనే నవ్వుతూ అంది. "నువ్వు నా దగ్గరకి వస్తావని తెలుసు"

"నన్ను క్షమించవే! మా అత్తగారు నిన్ను అవమానిస్తుందని అనుకోలేదు" కన్నీళ్లతో అంది.





"ఆవిడ మీ అత్తగారేనా? ఆవిడతో ఎలా వేగుతున్నావే బాబూ! నేనెవరినో చెప్పబోతున్నా విన్పించుకోదే! నేను మీ ఇంట్లో వంట మనిషి పోస్టుకోసం వచ్చాన నుకుంది"

"వంట మనిషా? " స్రవంతికి కన్ఫ్యూజింగ్‌గా వుంది.

"అవును" అంటూ ఆమె ఆవిడన్న మాట లని యధాతథంగా చెప్పింది సునీత!

"ఏమిటీ!" స్రవంతి నోట మాటరానట్ట యింది.

"ఆవిడ పొరపాటు పడిందో లేక, సాదా సీదాగా వున్న నేను ఆవిడ కళ్ళకి అలా కన్పించి వుంటాను, ఆ విషయం వది లెయ్యి. మీ తోటికోడలు నన్ను చూసి అలా పారిపోయిందేం? "

"అదే నాకూ ఆశ్చర్యంగా వుంది. పైగా మీరు ఒకర్ని ఒకరు ముందే తెలుసన్నావు. అవునూ, మీ అమ్మగారు వాళ్ళు వరంగల్ ఎప్పుడు షిఫ్టయ్యారే? "

"మా నాన్నగారు వాలంటరీ రిటైర్‌మెంట్ తీసుకున్నారు. మా నేటివ్‌ప్లేస్ వరంగల్ కదా! అక్కడే స్థిరపడ్డారు. కృష్ణమూర్తి గారు... అదే మీ తోటికోడలు తండ్రీ వాళ్ళది మా అమ్మగారి పక్క ఫ్లాటే"

"ఫ్లాటా? వాళ్ళిల్లు ఇంద్రభవనంలా వుంటుందని మా ఇంట్లోవాళ్ళు తెగ మెచ్చు కుంటారే? "

"ఇంద్రభవనమూకాదు, మయసభాకాదు. ఫ్లాటే! కృష్ణమూర్తిగారు వ్యాపారంలో దారు ణంగా నష్టపోయి ఆస్తులన్నీ అమ్ముకుని ఫ్లాటు కొనుక్కుని దాంట్లోకి షిఫ్టయి చాలా కాలమయింది. మొన్న శ్రావణమాసంలో మీ తోటికోడలు వరంగల్ వచ్చింది. అవునా? నేనూ శ్రావణమాసం నోములకని వెళ్ళాను. కల్పన, వాళ్ళమ్మగారు మా ఇంటికి పేరంటానికి వచ్చారు" చెబుతున్న సునీత సందేహంగా అడిగింది. "నా ఊహ కరెక్టయితే కల్పన ఈ విషయాలన్నీ మీ ఇంట్లోవాళ్ళనుంచి దాచివుండాలి"

సంభ్రమంగా వింటున్న స్రవంతి అవున న్నట్టు తలూపింది.

"నేను నీ స్నేహితురాలినని తెలియగానే ఈ విషయాలన్నీ నేను నీతో ఎక్కడ చెబు తానో అని భయపడి వుంటుంది. అందుకే మీ అత్తగారిద్వారా నన్ను మీ ఇంట్లోంచి వెళ్ళగొట్టించింది. నిన్న మీ ఇంట్లో జరిగిన అవమానానికి నేను నీ స్నేహాన్ని వదులు కుంటానని, నావల్ల అలాంటి ప్రమాదం మరి రాదని భావించివుంటుంది"

స్రవంతికి తన తల్లి చేయించిందని గాజు లని సగర్వంగా అత్తగారికి చూపిస్తున్న కల్పన కళ్ళముందు మెదిలింది. ఆమె తండ్రి ఆస్తులన్నీ పోయాక ఆమెకా గాజు లని ఎవరు చేయించి వుంటారు?

స్వింగ్‌డోర్ తెరుచుకుని బయటికి వస్తున్న ఆ వ్యక్తులని చూడగానే సునీత చప్పున లేచి నిలబడింది, "మా బాస్" అని లోగొంతులో చెబుతూ.

స్రవంతి చప్పున అటువైపు చూసింది.

ఆ హాలుదాటి వెళ్తున్న ఇద్దరు వ్యక్తులలో రెండవ వ్యక్తి శ్రీధర్. క్షణంలో సగంసేపు అతనామెని చూసీచూడనట్టు తలతిప్పుకుని వెళ్ళిపోయాడు. అతను తనని చూశాడని స్రవంతికి తెలియదు.

"లైట్ బ్లూ షర్ట్ వేసుకున్న అతనే మా బాస్" చెప్పింది సునీత.

"రెండవ అతనెవరు? " స్రవంతి తెలియ నట్టు అడిగింది.

"శ్రీధర్ అని ఈ ఫైనాన్స్ కంపెనీలో పార్ట్‌నర్. ఇంకో నలుగురు పార్ట్‌నర్స్ కూడా వున్నారులే"

స్రవంతి భృకుటి ముడిపడింది. "శ్రీధర్ ఈ ఫైనాన్స్ కంపెనీలో పార్ట్‌నరా? "

"ఒ.కె. స్రవంతీ! నిన్న మీ ఇంట్లో జరిగి నదానికి నేనేమీ అనుకోలేదులే! నువ్వా విష యంలో బెంగపడకు. నేను ఎప్పటికీ నీ ఫ్రెండ్‌నే" సునీత స్నేహపూర్వకంగా ఆమె

చేతిని నొక్కుతూ అంది.

★ ★ ★

ఇంటికి వచ్చిందన్నమాటేగానీ, స్రవంతి మనసు మనసులో లేదు. సునీత చెప్పిన నిజాలని జీర్ణం చేసుకోలేకపోతోందామె. శ్రీధర్ ఫైనాన్స్ కంపెనీలో పార్ట్‌నర్‌గా వుండడమేమిటి? ఆ విషయం రవికి తెలుసా? అతను ఎప్పుడూ ఫ్యాక్టరీ విషయాలు తనతో చెబుతుంటాడు తప్ప తమకి ఫైనాన్స్ కంపెనీ వున్నట్టు చెప్పలేదు అంటే ఇది శ్రీధర్ చేస్తున్న రహస్య వ్యాపారమా?

రవి ఆమె ముఖంలోని ఉద్విగ్నతని గమనిస్తూ అడిగాడు, "ఏమిటలా వున్నావు?"

ఆమె చెప్పింది.

రవి భృకుటి ముడిపడగా తీక్షణంగా ఆమెని చూస్తూ అన్నాడు,

"వాళ్ళ నాన్నగారి ఆస్తి పోయిందే అనుకో. ఆ విషయాన్ని దాచి ఆయన ఆస్తి పరుడేనని మనందరినీ నమ్మించవలసిన అవసరం మా వదినకేమిటి?"

"మీ అమ్మగారిముందు తన పరువుని నిలబెట్టుకోవడం కోసమై వుంటుంది"

"వాళ్ళ నాన్నగారికి వ్యాపారంలో నష్టం వస్తే మా వదిన పరువెందుకు పోతుంది?"

"గతంలో వాళ్ళు కల్పనకి ఘనమైన కానుకలను ఇచ్చివుండొచ్చు ఇప్పుడు వాళ్ళ పరిస్థితులు తారుమారై ఆమెకేమీ ఇవ్వలేని స్థితిలో వున్నారు కనుక. ఆమె పుట్టింటి నుంచి కానుకలు తేకపోతే మీ అమ్మగారు ఆమెని చులకనగా చూస్తారు"

"నాన్సెన్స్" పళ్ళ బిగువున అరిచాడతను. "ఎవరో ఏదో చెప్తే నమ్మెయ్యడమేనా?"

"చెప్పినది నా స్నేహితురాలు. అబద్ధం చెప్తే ఆమెకేం కలిసివస్తుంది?"

"సునీత నీ స్నేహితురాలు కాబట్టి అబద్ధం చెప్పదంటావ్?"

"నా కళ్ళతో నేను చూశాక కూడా అబద్ధమేనంటారా?"

"ఏమిటి నీ కళ్ళతో చూసినది?"

"నేను వెళ్ళేసరికి మీ అన్నయ్య ఆఫీసులోనే వున్నారు. ఆయన ఆ కంపెనీలో పార్ట్‌నర్ అని సునీత చెప్పింది"

"నువ్వు సునీతకోసం అక్కడికి వెళ్ళినట్టే మా అన్నయ్య వరుణ్‌కోసం అక్కడికి వచ్చాడేమో?"

"సునీత ఆ కంపెనీలో పనిచేస్తోంది. ఆ కంపెనీ పార్ట్‌నర్స్ ఎవరో ఆమెకి తెలియదా?"

"ఎవరో చెప్పినదాన్ని నిజమని నమ్మి కొంత ఊహించి, విపరీతంగా ఆలోచించకు" అసహనంగా అన్నాడు రవి.

"ఈ విషయం ఎవరికైనా తెలిసినా మర్యాదగా వుండదు" కరుగ్గా మారిందతని స్వరం.

"ఎందుకంటే నీ ఫ్రెండ్ సునీత చెప్పడం తప్ప అబద్ధమెంతో, నిజమెంతో మనకి తెలియదు"

"మీ అన్నయ్యపై మీకంత నమ్మకమా?"

"ఏం నీకు అపనమ్మకమా?"

"అవును. మీ అమ్మగారు మొత్తం డబ్బు పెత్తనాన్ని ఆయనకి అప్పగించారు. ఏదైనా చెయ్యగలరు. చెయ్యడానికి అవకాశంవుంది. కల్పనకి వాళ్ళమ్మగారు గాజులు చేయించారన్నమాట అబద్ధం. మీ అన్నయ్య రహస్య వ్యాపారం ద్వారా సంపాదించిన డబ్బుతో గాజులు చేయించుకుని గొప్పకోసం వాళ్ళమ్మగారి పరువు నిలబెట్టడంకోసం నాటకమాడుతోంది"

"నోర్ముయ్!" ఆగ్రహంగా అంటూ, "నువ్వు ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్‌తో చస్తున్నావు. నీకంటే ఉన్నతంగా వున్నవాళ్ళని చూస్తే నీకు కుళ్ళు అసూయ. ఇదివరకంతా ఇంట్లో ఎవరేం మాట్లాడుకున్నా అది నిన్ను గురించే అని ఏడ్చావు. ఇప్పుడు మా అన్నయ్యకే దొంగ అని ముద్ర వేస్తున్నావు. ఛీ... ఛీ... నీ వలన నాకు ఇంట్లో వాళ్ళతో

గొడవలు వచ్చేలావున్నాయి. మా అన్నద మ్ములిద్దరం విడిపోయేవరకూ నీకు నిద్ర పట్టేలాలేదు. మన కాపురం సవ్యంగా వుండాలంటే నువ్వు అనవసరమైన విషయా లలో తలదూర్చకుండా వుంటే మంచిది" అతని స్వరం హెచ్చరిస్తున్నట్టుంది. అతను తలుపు ధడాల్న వేసి అవతలకి వెళ్ళిపో యాడు.

స్రవంతి గది మధ్యలో స్థాణువులా నిల బడిపోయింది. "నువ్వు ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్‌తో చస్తున్నావు" అన్న రవి మాటలు గుర్తువచ్చి ఆమె ముఖం వివర్ణమ వుతోంది. 'ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్' 'అవును... తను అందరికంటే తక్కువదే. కానీ ఈ ఇంట్లో ఎవరూ తనకి విలువనివ్వ లేదు. తను అనుక్షణం ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్‌తో నలిగిపోయేలా ప్రవర్తించారు. ఒకరకంగా చెప్పాలంటే తను తక్కువదాన్ని అనే భావం తనలో నాటుకుపోయేలా చేసింది వీళ్ళే. తన భర్తే తను చెప్పినమా టలు నమ్మడంలేదు. ఎలా అతన్ని నమ్మిం చడం?' స్రవంతికి దుఃఖం వస్తోంది.

★ ★ ★

శ్రీధర్ డబ్బు బ్రీఫ్‌కేస్‌లోనుంచి తీసి కల్పనకిచ్చాడు.

అతనిముఖం మామూలుగా లేదని గ్రహించిన ఆమె అడిగింది.

"ఏం జరిగింది? ఎందుకలా వున్నారు?"

"స్రవంతి ఇవాళ మా ఆఫీసుకి వచ్చింది"

"ఏమిటీ?" తేలుకుట్టినట్టు ఉలిక్కిప డింది.

"సునీత దగ్గర కూర్చుని మాట్లాడుతుం డగా చూశాను"

"స్రవంతి మిమ్మల్ని చూసిందా?"

"చూసేవుంటుంది"

"సునీత మీరు ఆ కంపెనీలో పార్ట్‌నర్ అని చెప్పివుంటుందా?"

"చెప్పేవుంటుంది" శ్రీధర్ పళ్ళు కొరు కుతూ అన్నాడు.

"మన రహస్యం బట్టబయలు కాబో తోంది"

"మీ అమ్మగారికి తెలుస్తుందని భయప డుతున్నారా? స్రవంతి ఏం చెప్పినా ఆవిడ నమ్మరు"

"మా అమ్మ నమ్మదు. రవి నమ్మితే?"

క్షణం జవాబివ్వలేదు కల్పన. "ఆ విషయం తరువాత ఆలోచిద్దాం. ముందా సునీతని ఉద్యోగంలోనుంచి పీకిపారె య్యండి"

"అవును. అది ఇంకా ఆఫీసులో వుంటే చాలాప్రమాదం"

మరునాడు తన పని సంతృప్తికరంగాలేని కారణంగా తనని ఉద్యోగంలోనుంచి తొల గించినట్టు ఉత్తర్వుని అందుకుంది సునీత.



పదిరోజుల తరువాత హనీమూన్‌నుంచి హైదరాబాద్‌కి తిరిగివచ్చారు వర్ష, ధీరజ్ ఎయిర్‌పోర్ట్ బయటికి రాగానే తమ కారు కనబడకపోవడంతో ఆమె అడిగింది.

"ఎయిర్‌పోర్ట్‌కి కారు పంపమని అత్తయ్యా గారికి ఫోన్‌చేశారు కదా. మరిచిపోయి వుంటారా?"

"అంతే అయివుంటుంది. మనం టాక్సీలో వెళ్దాం" అన్నాడు ధీరజ్. టాక్సీ పిలిచి

ఎడ్రస్ చెప్పాడు.

"అదేమిటి మనం మన ఇంటికి వెళ్ళడం లేదా? " ఆశ్చర్యంగా అడిగింది అతను అశోక్‌నగర్ ఎడ్రస్ చెప్పడం విని.

"అదీ మన ఇల్లే" చెప్పాడతను.

టాక్సీ అశోక్‌నగర్‌లోని అపార్ట్‌మెంట్స్ ముందు ఆగింది. ముడివడిన భ్రుకుటితో చూస్తూ ఆ ఫ్లాటులోకి అడుగుపెట్టింది వర్ష. చవకరకం సోఫాసెట్టుతో వున్న ఆ ఇంటిని చూస్తూ అడుగు ముందుకి వెయ్యలేకపోయింది.

"నడు" అన్నాడు ధీరజ్.

"ఇది... ఇది మన ఇల్లా? "

"అవును" చిన్నగా అన్నాడు ఆమెవైపు చూడకుండానే. అతనిముఖంలో ఇబ్బందికరమైన ఫీలింగ్.

వర్ష యాంత్రికంగా కదిలి లోపలికి వచ్చింది. ఎదురుగావున్న మామగారు, అత్తగారు అందరూ పరిచితులే. కానీ ఆ ఇల్లు తమదేనంటే ఆమెకి నమ్మబుద్ధి కావడం లేదు.

"సూట్‌కేస్ నీ బెడ్‌రూంలో పెట్టుకోమ్మా" అంది కామాక్షమ్మ కుడివైపుగా వున్న ఆ గదిని చూపిస్తూ.

వర్ష ఆ గదిలోకి నడిచింది. ఒక డబుల్ కాట్, డ్రెస్సింగ్ టేబిల్ తప్ప ఏమీలేవు ఆ గదిలో. ఆమెకి కళ్ళు తిరుగుతున్నట్టుంది. సూట్‌కేస్‌ని గోడవారగా పెట్టి మంచంమీద కూలబడింది.

'ఇదీ మన ఇల్లే అంటాడేమిటి ధీరజ్? ఈ ఇల్లు, ఇంట్లోని ఫర్నిచర్ చూస్తే మధ్య తరగతికి ప్రతిబింబంగా వున్నాయి. జూబిలీహిల్స్‌లోని ఇంద్రభవనంలాంటి ఆ ఇల్లెక్కడ? ఈ ఇల్లెక్కడ? '

ధీరజ్ గదిలోకి వచ్చాడు. అతన్నిచూసి వర్ష లేచి అతని దగ్గరకి వస్తూ అంది.

"ఇదేమిటండీ ఈ ఇల్లు? శీతాకాలంలో కూడా ఎ.సి. లేనిదే నాకు నిద్రపట్టదని మీకు తెలుసుగా? అయినా మనం ఈ ఇంట్లో వుండడం ఏమిటి? జూబిలీహిల్స్‌కి వెళ్ళిపోదాం" అంది గోముగా.

"ఆ ఇల్లు వాస్తుకి నప్పలేదని కొన్నిమార్పులు చెయ్యాలన్నారు. అసలు పెళ్ళికి ముందే చేయిద్దామనుకున్నాం. కానీ పెళ్ళికి వచ్చిన బంధువులందరికీ ఈ ఇల్లు సరిపోదని ఆపేశాం"

"ఎన్నాళ్ళలో పూర్తవుతుంది? "

"సుమారుగా ఒక నెల పట్టవచ్చు"

"నెలా? " అయిష్టంగా అంది.

"నేనొకసారి మా అమ్మకి ఫోన్‌చెయ్యాలి. మనం వచ్చేశామని మా అమ్మకి తెలుసో, తెలియదో? "

"చేసుకో. వీధి చివర ఎస్.టి.డి. బూత్ వుంది"

"ఈ ఇంట్లో ఫోన్ కూడాలేదా? "

"లేదు. రేపో. ఎల్లుండో వస్తుంది"

వర్ష గదిలోనుంచి బయటకి వచ్చింది. ఆమెకి అసహనంగా వుంది. డ్రాయింగ్ రూం అనబడే ఆ గదిలో కూర్చున్న అత్తగారు, మామగారు సీరియస్‌గా ఏదో విషయం మాట్లాడుకుంటున్నారు. వర్షని చూడగానే మాట్లాడ్డం ఆపి, "కాఫీ తాగుతావా? " అనడిగింది కామాక్షమ్మ.

"ఇప్పుడే వస్తానాంటీ" అనిచెప్పి మెట్లు దిగి కిందకి వచ్చింది. ఎస్.టి.డి. బూత్ దగ్గర నలుగురైదుగురు వున్నారు. ఆమె వాళ్ళు మాట్లాడ్డం పూర్తయి తనవంతు వచ్చే వరకు అసహనంగా నిలబడింది. ఆమెకి ఉక్రోషంతో కన్నీళ్ళు వస్తున్నాయి. కార్లోనుంచి తప్ప కాలు బయటపెట్టని తను మామూలు మనిషిలా ఎస్.టి.డి. బూత్ దగ్గర ఫోన్ చెయ్యడంకోసం వెయిట్ చెయ్యడమా? "

ఆమె ఇంటికి ఫోన్ చేసింది. ఫోన్ రింగవుతోంది. కానీ ఎవరూ లిఫ్ట్ చెయ్యడం లేదు. ఇంట్లో ఎవరూ లేరని అర్థమైన ఆమె తండ్రి మొబైల్ ఫోన్‌కి రింగ్ చేసింది.

"హలో!" తండ్రి స్వరం వినగానే ఆనందా





తిరేకంతో అంది. "నాన్నా, నేను వర్షని"

"అమ్మా! వర్షా ఎక్కడనుంచి తల్లీ" ఆయనకి కూతురి స్వరం వినగానే దుఃఖం వచ్చేసింది.

వర్ష క్లుప్తంగా చెప్పింది.

"ఇంటి ఎడ్రస్ చెప్పు"

చెప్పిందామె.

"సరే! నేనూ, మీ అమ్మా వస్తున్నాం" ఆయన సెల్ ఆఫ్‌చేశాడు. వర్ష తను మాట్లాడిన ఫోన్‌కాల్‌కి డబ్బులు చెల్లించి బయటకి వచ్చింది.

"మా అమ్మకి ఫోన్ చేశానాంటీ. ఇప్పుడు మా అమ్మా, నాన్నగారు ఇక్కడికి వస్తున్నారు" అత్తగారు అడక్కుండానే చెప్పింది.

"అలాగా? " అందావిడ.

"కాఫీ కలుపుకో. వంటగదిలో పాలు, డికాషన్ వున్నాయి"

'తను కాఫీ కలపాలా? పుట్టి బుద్ధెరిగాక ఒక్కసారైనా వంటగదిలోకి వెళ్ళలేదు తను'

"వంట మనిషి రాలేదా ఆంటీ? "

"ఆవిడకి సుస్తీ చేసింది. పెళ్ళిలో చాలా పని చేసిందిగా? "

వర్ష వంటగదిని వెతుక్కుంటూ వచ్చింది. అక్కడ గ్యాస్ స్టవ్ మీద పాలగిన్నె కనిపించింది. కానీ పాలు చల్లారిపోయి వున్నాయి. గ్యాస్‌లైటర్ కోసం చూసింది. అది కనిపించలేదు.

"ఆంటీ! గ్యాస్‌లైటర్ ఎక్కడుంది? " అడిగింది.

"అక్కడే వుంటుంది. వెతుకు" అందావిడ కూర్చున్నచోటునుంచి లేవకుండానే.

కాఫీ తాగి గ్లాసు కూర్చున్నచోటునే వదిలేస్తే వంటమనిషో, నౌకర్లో తీసి బయటపెడతారు తమ ఇంట్లో. ఇప్పుడు కాఫీ కలపబోతున్న వర్షకి తను మొదటిసారిగా కాఫీ కలుపుతున్నప్పటి థ్రిల్ లేదు సరికదా విసుగ్గా, చిరాగ్గా వుంది.

పట్టకారుతో పాలగిన్నెలోనుంచి పాలు వంచుతుంటే పట్టుతప్పి గిన్నె కిందపడి వేడి పాలు పాదాలపై పడ్డాయి. కెవ్వున అరిచింది వర్ష. ఆ అరుపుకి అత్తగారు, మామగారు, ధీరజ్ పరిగెట్టుకొచ్చారు.

నేలని ఒలికిన పాలని, పాదాలు బొబ్బలెక్కి విలవిలలాడుతున్న వర్షని చూసేసరికి ఆమె అత్తగారికి ఎక్కడలేని చికాకు పుట్టుకొచ్చింది.

"కాఫీ కలపడం కూడా రాదా నీకు? చేతగాకపోతే చెప్పవచ్చుగా? పాలన్నీ నేలపాలు చేశావా? ఇప్పుడు బయటికి వెళ్ళి పాల పేకెట్లు ఎవరు తెస్తారు? "

వర్ష వెక్కివెక్కి ఏడుస్తోంది.

"ఏమిటది చిన్నపిల్లలా? పాలు కాళ్ళ మీద పడినందుకే ఏడుస్తారా? ఇలాగైతే రేపటినుంచి వంట ఎలా చేస్తావ్? " కామాక్షమ్మ చిరాగ్గా అంది.

'వంటా? తను వంట చెయ్యాలా? ' వర్ష బాధని మరిచిపోయి షాకింగ్‌గా చూస్తోంది.

"అదే... వంటమనిషి వచ్చేవరకు నువ్వు, అమ్మ ఎలాగో సర్దుకోక తప్పదుగా? " అన్నాడు ధీరజ్.

"నాకు ఇప్పటివరకు వంటింట్లోకి వెళ్ళే అవసరమే రాలేదు తెలుసా? మా ఇంట్లో వంటమనిషే కాఫీ కలుపుతుంది" గొప్పగా చెప్పింది.

"ఇంకెవరైనా వంటమనిషిని చూసి పంపమని మీ అమ్మగారితో చెబుదాం"

నేలనిఒలికిన పాలని గుడ్డతో తుడుస్తూ సణుక్కుంటోంది కామాక్షమ్మ.

ఈ నేపథ్యంలో డోర్‌బెల్ మోగింది. తలుపుతీసిన ధీరజ్ ఎదురుగా ఉన్న అత్తమామలని గౌరవంగా ఆహ్వానించాడు.

"రండి అంకుల్! ఆంటీ, కులాసాగా వున్నారా? "

తెచ్చిపెట్టుకున్న నవ్వుతో వరలక్ష్మి, నవ్వడం చేతకాక శివశంకరం లోపలికి వచ్చారు. వర్షని చూడగానే ఆ ఇద్దరికీ



దుఃఖం ముంచుకొచ్చింది. అతి ప్రయత్నం మీద సంభాళించుకున్న వరలక్ష్మి కూతురి పక్కనే కూర్చుని ఆమె భుజంపై చెయ్యి వేస్తూ అడిగింది.

"మీరీవేళ పొద్దుటే వచ్చారనుకుంటాను"

"అవునమ్మా? "

"మేం జూబిలీ హిల్స్ వెళ్ళామోయ్! మీరు ఇక్కడికి మారిన విషయం మాకు తెలియదు" అన్నాడు శివశంకరం.

"వాస్తుకి నప్పలేదని ఆ ఇంట్లో కొన్ని మార్పులు చెయ్యమన్నారంకుల్ చేయిస్తున్నాం"

"ఓహో!"

లోపలనుంచి కామాక్షమ్మ ధుమధుమలాడుతూ బయటికి వచ్చి వియ్యాలవారిని చూసి అంతలోనే ముఖాన్ని ప్రసన్నంగా మార్చి పలుకరించింది.

"కులాసాగా వున్నారా వదినగారూ? "

"ఆ... మీ దయవలన" అంది వరలక్ష్మి.

ఆమె ఆ మాటని మామూలుగా అందో లేక వ్యంగ్యంగా అందో ఆవిడకి అర్థంకాలేదు.

"ఇక్కడ కారు పార్కింగ్ వుందా? "

"వుంది" చెప్పాడు ధీరజ్ తండ్రి వెంకటేశ్వరరావు.

"ఏం, అలా అడుగుతున్నారు? "

"అబ్బే... మరేంలేదు మీ కారు కనపడకపోతే"

"అదా! నా ఫ్రెండ్ కారు పాడయిందంటే నా కారు ఇచ్చాను" చెప్పాడాయన.

"అమ్మా! మా వంటమనిషి ఒంట్లో బాగోలేదని సెలవు పెట్టింది. ఆవిడ వచ్చేవరకు ఎవరినైనా పంపమ్మా" అంది వర్ష.

"అలాగేనమ్మా" అంది వరలక్ష్మి. ఆమె ముఖం బలవంతాన దుఃఖాన్ని నిగ్రహించుకుంటున్నట్టుంది.

"మీ అమ్మాయికి పని బొత్తిగా అలవాటు లేనట్టుంది. పొద్దుట తను కాఫీ కలుపుతానని సరదాపడి పాలన్నీ ఒలకబోసి పాదాలు కాల్చుకుంది. నాకసలు అలవాటు లేదు వంటచెయ్యడం"

వరలక్ష్మి ఆదుర్దాగా కూతురు పాదాలని చూసి అవి బొబ్బలెక్కి వుండడంతో కన్నీళ్ళు పెట్టుకుంది.

"నాతో పంపండి. నాలుగు రోజులుంచుకుని పంపిస్తాను"

"ఇవాళేగా వాళ్ళు వూరునుంచి వచ్చారు? తర్వాత పంపిస్తానులెండి" అంది కామాక్షమ్మ.

కూతురిని వదిలి వస్తుంటే తన ప్రాణాన్ని అక్కడే వదిలి వస్తున్నట్టు అన్పించింది వరలక్ష్మికి.

తల్లీ తండ్రీ వెళ్ళాక ఇరుగ్గా వున్న ఆ ఇంట్లో ఒంటరిగా వున్నట్టు అన్పించింది వర్షకి. ఆమెకి ఆ రాత్రి నిద్రపట్టలేదు. ఎ.సి. ఎదురుగా ఫోమ్‌బెడ్ మీద పడుకునే అలవాటున్న ఆమెకి చప్పుడుచేస్తూ తిరుగుతున్న సీలింగ్ ఫ్యాన్ కింద శీతాకాలంలో కూడా చెమటలు పడుతున్నాయి. ఆలోచిస్తున్న ఆమెకి ప్రొద్దుట నుంచీ జరిగిన సంఘటనలన్నింటిని పునరావలోకనం చేసుకుంటోంది. ఎయిర్‌పోర్టులో దిగిన వెంటనే ధీరజ్ టాక్సీ డ్రైవర్‌కి అశోక్‌నగర్ ఎడ్రస్ చెప్పాడు. అంటే తల్లీతండ్రీ ఇల్లుమారిన విషయం అతనికి ముందే తెలుసా? వంట మనిషి సెలవు పెట్టడం నిజమా? లేక అత్తగారు కావాలనే మానిపించేసిందా? సమాధానం దొరకని ప్రశ్నలు. ఆమెకి భయం వెయ్యసాగింది.

★ ★ ★

మోహన్ ఆఫీసునుంచి వచ్చాడు. పొద్దుటనుంచి అతనితో ఏం మాట్లాడాలా, ఎలా మాట్లాడాలా అని మనసులోనే రిహార్సల్ వేసుకుంటున్న శ్వేత అడిగింది.

"నన్ను బయటకి తీసుకెళ్తారా? "

"ఎందుకూ? " అతను ముఖం చిట్లించాడు.

"మీతో కొంచెం మాట్లాడాలి"





"ఏం మాట్లాడాలి? "

"మన కాపురాన్ని గురించి"

"ఏమిటీ!" అనుకుంటూ రాజేశ్వరమ్మ ఆ ఇద్దరి మధ్యకి వచ్చింది. 'ఏం అడుగుతోం దిరా అది? "

మోహన్ చెప్పాడు. "నాతో ఏదో మాట్లా డాలిట. బయటకి తీసుకెళ్ళమంటోంది"

శ్వేత నిర్ఘాంతపోయి అతన్ని చూస్తోంది. "తను బయటకి తీసుకెళ్ళమన్న విష యాన్ని కూడా తల్లితో చెప్పాలా? "

"ఏం మాట్లాడుతావ్ వాడితో? నా ఎదు రుగా మాట్లాడు"

"మీకెదురుగా మాట్లాడం ఇష్టంలేకనే కదండీ మీ అబ్బాయిని బయటకి తీసుకెళ్ళ మన్నాను"

"నాకెదురుగా మాట్లాడం ఇష్టంలేదా? ఏమిటో అంత రహస్యం? "

"రహస్యమేం లేదత్తయ్యా! ఆయనతో మాట్లాడాక మీకు చెబుతానుగా"

"అలాంటప్పుడు నా ఎదురుగానే మాట్లాడు. వాడితో విడిగా మాట్లాడ్డం దేనికి? " ఆవిడ అర్థమయినట్టు తల పంకిస్తూ అంది. "వాడికేదో మందో మాకో పెట్టి నీవైపు తిప్పుకోవాలని నీ ఎత్తుగడ! నువ్వెంత జాణవే" మెటికలు విరుస్తూ అంది.

శ్వేత నిశ్చేష్టురాలయింది. మోహన్ తల్లి మాటలని ఖండించకపోవడం ఆమెకి ఆశ్చ ర్యంతోబాటు అసహ్యాన్ని కలిగించింది. ఆవి డతో అంతసేపు మాట్లాడినందుకు తనమీద తనకే అసహ్యం వేసిందామెకి. ఏదో పని కల్పించుకుని లోపలకి వెళ్ళిపోయింది.

మరునాడు ఉదయం పది గంటలకి రాజే శ్వరమ్మ శ్వేతని పిలిచింది.

"త్వరగా తెములు. డాక్టర్ దగ్గరకి వెళ్దాం"

"చెకప్‌కా అత్తయ్యా"

"కాదు. అబార్షన్ ఎప్పుడు చేస్తుందో అడ గడానికి"

శ్వేత హఠాత్తుగా చేతులు జోడిస్తూ కన్నీ ళ్ళతో అంది.

"అత్తయ్యా! మీరు ఇద్దరుబిడ్డలకి తల్లి. సాటి ఆడదాన్ని అబార్షన్ చేయించుకోమని అడగడానికి మీకు మనసెలా ఒప్పింది? నాకీ బిడ్డ కావాలి. దయవుంచి నన్ను అబా ర్షన్ చేయించుకోమని అడగకండి"

"నీకు పుట్టబోయే పిల్లల పోషణ ఖర్చు మీ నాన్న పెట్టుకుంటానంటే తప్పకుండా ఒకళ్ళు కాదు పదిమంది పిల్లల్ని కను"

శ్వేత నివ్వెరపోయింది. "తనకి పుట్ట బోయే పిల్లల పోషణ ఖర్చు తన తండ్రి భరించాలా? కట్నం చాలలేదనో, కానుకలు తెమ్మనో, కోడలిని వేధించే అత్తగార్ల గురించి వింది. కోడలికి పుట్టబోయే పిల్లల పోషణకయ్యే ఖర్చు ఆమె తండ్రినుంచే రాబ ట్టాలని ప్రయత్నిస్తున్న ఈ మనిషి" ఆమె మనశ్శరీరాలు జుగుప్సతో కంపిస్తున్నాయి.

"మీ నాన్న ఒక్క రూపాయి కూడా విద ల్చనని తనేదిస్తే అది సంతోషంగా పుచ్చుకో వలసిందేనని ఖచ్చితంగా చెప్పేశాడుగా? ఆయన పేరవున్న ఆస్తి ఇప్పట్లో వస్తుందనే ఆశ కూడా లేదు. డబ్బంతా ఏం చేసుకుం టాడో ముసలాడు. చచ్చినప్పుడు మీద వేసు కుని పట్టుకుపోతాడేమో? "

శ్వేత ఒళ్ళంతా ఉద్రేకంతో వణికిపో తోంది "ఎంత మాట అనేసింది తన తండ్రిని? ఆమె స్థానంలో మరొకరు వుండి వుంటే చచ్చినప్పుడు పట్టుకుపోదామనే లక్షలు బ్యాంకులో దాచుకుని బీద అరు పులు అరుస్తున్నావా" అని అడిగేవారే! కాని, ఆమెది దెబ్బలాడే స్వభావం కాదు. అందుకే మౌనం వహించింది.

"నడు, హాస్పిటల్‌కి వెళ్దాం" శాసిస్తున్నట్టు అంది.

"ఏమిటి రాజ్యం అది! చిన్నపిల్లని అలా బెదరగొడతావు? శ్వేత పిల్లల్ని కనాలను కుంటే వాళ్ళ పోషణకయ్యే ఖర్చు వియ్యం కుడుగారే భరించాలని నువ్వూ, నేనూ అను కుంటే సరిపోతుందా? అయినా ఈ విష

యాన్ని ఆయనకి తెలియపరచలేదుగా మనం? ముందు ఈ సంగతి శ్వేతచేత ఆయనకి ఉత్తరం రాయించు. ఆయనకి మనుమలని చూసుకోవాలిని సరదా వుంటే డబ్బు పంపుతాడు లేకపోతే అబార్షన్ ఎంత సేపు? "

శ్వేత నిరుత్తరురాలై మామగారిని చూస్తోంది.

రాజేశ్వరమ్మ తనకా సలహా ఇచ్చిన భర్తని ప్రశంసాపూర్వకంగా చూసింది.

"నిజమేనండోయ్! ముందు దీనిచేత దీని బాబుకి ఉత్తరం రాయిద్దాం. వారం రోజుల లోగా డబ్బు పంపుతాడా సరేసరి లేకపోతే అప్పుడే అబార్షన్ చేయిద్దాం"

శ్వేత దిమ్మెరపోయి చూస్తోంది. చివరకి తన కడుపులోని బిడ్డమీద కూడా తన తండ్రినుంచి డబ్బు రాబట్టుకోవాలని చూస్తున్న ఆ ఇద్దరినీ జుగుప్సతో కంపిస్తూ చూసింది. ఈ మనుషులలో మార్పు తేవాలని, ఇన్నాళ్ళూ ఓర్పు వహించిన తన తెలివితక్కువ తనానికి తనమీద తనకే జాలివేసిందామెకి. తను ఏం చెయ్యాలో ఆమె ఆ క్షణంలోనే నిర్ణయించుకుంది.

★ ★ ★

"మేం మోసపోయాం అమ్మా!" వరలక్ష్మి వెక్కివెక్కి ఏడుస్తోంది. "వాళ్ళ ఫ్యాక్టరీ నష్టాలలో వుందిట. అప్పు ఇచ్చిన శేఠ్ తన బాకీకిగాను ఇల్లు జమకట్టుకున్నాడుట. చిన్న ఫ్లాట్ అదీ స్వంతమో, అద్దెకి వున్నారో తెలియదు"

త్రిపురాంబ వివర్ణమైన ముఖంతో నిర్ఘాంతపోయి చూస్తోంది. "ఏమిటే నువ్వు చెప్పేది నిజమేనా? లేకపోతే ఎవరో మీరంటే గిట్టని వాళ్ళు చెప్పిన అబద్ధాలని నమ్ముతున్నావా? "

"నిన్న వర్ష, ధీరజ్ హనీమూన్ నుంచి తిరిగి వస్తారని దాన్ని ఒకసారి చూసి పోదామని నేను, మీ అల్లుడు వాళ్ళింటికి వెళ్లాం. గేటు దగ్గరున్న గూర్ఖా ఆ ఇల్లు శేఠ్ చమన్‌లాల్‌దని చెప్పాడు. మేం అతని మాటలని నమ్మలేదు. లోపలకి వెళ్ళేప్పటికి ఆ శేఠ్ కనిపించాడు. ఆయన్ని అడిగితే చెప్పాడు. పెళ్ళికి ముందే ఇంటిని స్వాధీనం చేసుకుంటానంటే వెంకటేశ్వర్రావుగారు కొడుక్కి కుదిరిన సంబంధం తప్పిపోతుందని పెళ్ళయ్యేదాకా ఆగమని కాళ్ళావేళ్ళా పడ్డాడుట. పెళ్ళయి కొడుకు కోడలు హనీమూన్‌కి వెళ్ళగానే వాళ్ళు ఇల్లు ఖాళీ చేసేశారుట"

"ఎంతమోసమే తల్లీ! పెళ్ళిలో ఎంత డాబు, దర్జా ఒలకపోశారు. వీళ్ళమ్మ కడుపు మాడిపోను! మనని బుట్టలో వేసుకుని కట్నం వద్దంటూనే లక్షల రూపాయల లాంఛనాలు పుచ్చుకున్నారు" త్రిపురాంబ ఏడుస్తూ కూతురి వియ్యాలవారిని తిట్టడం మొదలుపెట్టింది.

"మీ అల్లుడు మాటలలో కారేమయిందని మా వియ్యంకుడిని అడిగితే స్నేహితుడికి అవసరమైతే ఇచ్చానని చెప్పారు. వంటమనిషికి ఒంట్లో బాగాలేదని సెలవుపెట్టిదని చెప్పారు. అబద్ధం చెబుతున్నారో నిజం చెబుతున్నారో తెలియదు. ఇవాళ పొద్దుట వర్ష ఊరినుంచి వస్తూనే కాఫీ కలుపుకోబోయి మరిగిన పాలగిన్నె పట్టుకారుతో దింపబోయి గిన్నెకింద పడేసిందిట. వేడి పాలు పడి దాని పాదాలు బొబ్బలెక్కాయి. దాన్ని చూస్తే నా కడుపు తరుక్కుపోయింది. ఎంత అపురూపంగా పెంచాను దాన్ని. అది ఆ ఇంట్లో ఎన్ని అవస్థలు పడుతోందో, ఇంత డబ్బూ ఖర్చుపెట్టి చివరకి కానీకి పనికిరాని సంబంధం చేశాను"

"దేముడు కళ్ళు మూసేశాడే తల్లీ! దాన్ని గోతిలో దింపేశారే!" తల్లీ కూతుళ్ళిద్దరూ ఒకరినొకరు కౌగలించుకుని హృదయవిదారకంగా ఏడుస్తున్నారు.

"ఇప్పుడేం చేస్తారే మరి? "

"ఏం చెయ్యమంటావమ్మా? పెళ్ళి పీటల మీద తెలిసినా వెధవ సంబంధాన్ని వదిలి




పారేద్దును. పెళ్ళయిపోయాక ఇంక చేసేదేం వుంది"

"ఆ వెంకటేశ్వర్రావు చచ్చినాడి ముఖాన్న పేడనీళ్లు కొట్టి నాలుగూ అడిగి కడిగి పారెయ్యవలసింది"

"దానివలన ప్రయోజనమేమిటమ్మా? వీధిన పడి నలుగురిలో అల్లరవడం తప్ప? పోయేది మా పరువే. డబ్బు వుంది కదా అని కన్నుగానక ప్రవర్తించినందుకు మంచి శాస్తే జరిగిందని నలుగురూ అనుకుంటారు. ఎవరో ఎందుకు నీ చిన్నకోడలే అనుకుంటుంది. ఈ విషయం ఎవరికీ. తమ్ముళ్ళకి కూడా తెలియనివ్వకు"

"నాకామాత్రం తెలియదామ్మా? " అంది త్రిపురాంబ.

ఇద్దరూ చాలాసేపు ధీరజ్ తల్లిదండ్రులని తిట్టుకుంటూ వుండిపోయారు.

★ ★ ★

వర్ష తాయారమ్మగారిని చూస్తూనే విప్పారిన ముఖంతో పలుకరించింది. "ఏమిటిలా నచ్చారు తాయారమ్మగారూ"

"మీ అమ్మమ్మగారు పంపారు. మీకు వండిపెట్టమని"

"నిజమా" ఆమె సంభ్రమానందాలతో తల మునకలయింది.

"మరి అమ్మమ్మకి ఎవరు వండిపెడతారు? కల్పనత్త ఒకర్తీ అంతమందికి చెయ్యగలదా"

"చిన్న కోడలుగారు వుందిగా? ఆవిడే వండుతోంది"

"ఎందుకు వండదూ? తనేమైనా కోటీశ్వరుడి కూతురా? " నిరసనగా అనుకుంది వర్ష. ఆ అమ్మాయి ముమ్మూర్తులా తల్లిపోలికే. పోలిక అనడం కంటే తనకంటే తక్కువ స్థితిలో వున్నవాళ్ళని చులకనగా చూసే తల్లి మనస్తత్వమే ఆమెకీ అలవడిందంటే బాగుంటుంది.

వచ్చిన మొదటిరోజే ఆ ఇంట్లో పనిచేసి తాయారమ్మగారికి నడుము పట్టేసింది. కామాక్షమ్మకి మంచినీళ్ళు కూడా అందివ్వాలి. వర్ష ఆ అత్తగారికి తగ్గ కోడలే. ఎక్కడ తిన్నప్లేటు అక్కడే వదిలేస్తుంది. వంట మనుషులు, పని మనుషులు మనుషులే కారన్నట్టు కప్పు కాఫీ నాలుగైదు సార్లడిగితేనేగాని ఇవ్వదు కామాక్షమ్మ. అవి కూడా వట్టిచూరు నీళ్లు. భోజనం సరేసరి.

నలుగురూ తిన్నాక మిగిలిన కూరలన్నీ ఫ్రిజ్‌లో భద్రపరుస్తుందావిడ. నాలుగు రోజులు ఆ ఇంట్లో పనిచేసేప్పటికే సరైన తిండిలేక, అలవిగాని చాకిరీ వలన నీరసం, కళ్లు తిరగడం పట్టుకున్నాయి. అయిదవ రోజు తిరుగుటపాలో త్రిపురాంబ దగ్గరకి వచ్చేసిందావిడ.

"అమ్మా! నావల్లకాదు. ఆ ఇంట్లో మరమనుషులు పనిచెయ్యాలి తప్ప మనుషులెవరూ చెయ్యలేరు. మీకు కావాలంటే నేను మీ ఇంట్లో పనిచేస్తాను. వద్దంటే మరో ఇల్లు చూసుకుంటాను" అనేసింది.

"మీరలా అంటే ఎలా? వర్ష చిన్నపిల్ల. దాని అత్తగారు పందిరిరాటకి కూడా పని చెప్పేరకం. వాళ్ళ వంట మనిషి వచ్చేదాకా వండిపెట్టండి, మీ కష్టం వుంచుకోను" అప్పటికప్పుడు రెండువందలు తీసి ఆవిడ చేతిలోపెట్టింది. త్రిపురాంబ ఎన్నో రకాలుగా బతిమాలి, ఎన్నో ఆశలు పెట్టాక అంగీకరించిందావిడ.

★ ★ ★

"కల్పనా,

ఎంతనాటకమాడుతున్నావ్, నీ తండ్రి వ్యాపారంలో నష్టపోయి ఆస్తిని కోల్పోయినా, ఆయన డబ్బున్న వాడేనని అందరినీ నమ్మిస్తున్నావ్! ఉమ్మడి ఆస్తితో నీ భర్త రహస్యంగా చేస్తున్న వ్యాపారంలో పొందిన లాభాలతో నగలని కొనుక్కుంటూ అవి నీ పుట్టింటి వాళ్ళు ఇస్తున్న కానుకలని గొప్ప చెప్పుకుంటున్నావ్! నీ నాటకం బయటపడే రోజు త్వరలోనే రాబోతోంది. ఇప్పటికైనా పుట్టింటినుంచి కానుకలుతెచ్చి అత్త

గారి మెప్పు పొందాలనే వ్యర్థప్రయత్నాన్ని మానుకో"

అప్పుడే పోస్టులో తన పేర వచ్చిన సంతకంలేని ఆ ఉత్తరాన్ని చదివిన కల్పన కాళ్ళ కింద భూమి కంపించింది. భయోత్పాతంతో, వెడల్పయిన కళ్ళతో ఆ ఉత్తరాన్నే మళ్ళీమళ్ళీ చదువుతూవుండిపోయింది. కొన్నిక్షణాలపాటు మొద్దుబారిపోయిన ఆమె మెదడు తిరిగి ఆలోచించడం మొదలుపెట్టింది.

"ఎవరు రాసివుంటారీ ఉత్తరాన్ని?" అనే ప్రశ్నకి 'స్రవంతి' అనే జవాబు సులువుగానే దొరికింది. భర్త భయపడినంతా జరిగింది. తమ రహస్యం బట్టబయటు కాబోతోంది. 'స్రవంతి! ఎంత తెగించింది" కల్పన పిడికిళ్ళు బిగుసుకుంటున్నాయి. పళ్ళు కరకర లాడుతున్నాయి. స్రవంతి పీక నొక్కి చంపెయ్యాలన్పిస్తోంది. ఆమె వెంటనే శ్రీధర్ మొబైల్ ఫోన్‌కి రింగ్ చేసింది.

భార్య స్వరంలోని ఉద్వేగాన్ని గమనించి అడిగాడతను.

"ఏమయింది?"

"ఏమయింది చెప్పు"

"కొంపమునిగింది"

చెప్పిందామె. "వ్వాట్" కీచుమందతని స్వరం. దిగ్భ్రాంతినుంచి తేరుకుంటూ రౌద్ర స్వరంతో అన్నాడు.

"అది... ఆ బిచ్ ఇంతపని చేస్తుందని నాకు తెలుసు. నేను భయపడినదందుకే"

"ఇప్పుడేం చేద్దాం?"

"నిన్ను బెదిరిస్తూ నీకు ఉత్తరం రాసిందే తప్ప మా అమ్మకి రాయలేదుగా? మరో ఉత్తరం రానీ, అప్పుడు చెబుతాను దాని పని" అన్నాడు పళ్ళు కొరుకుతూ. దానికి మొదటి నుంచీ నీపై అసూయ. ఇప్పుడు అవకాశం దొరికింది కనుక ఇలా సాధిస్తోంది. నీకు ఉత్తరం అందిన విషయాన్ని ఇంట్లో ఎవరికీ తెలియనివ్వకు. స్రవంతితో కూడా మామూలుగా వుండు. దాని ప్రతిచర్యనీ ఒక కంట కనిపెడుతూవుండు"

"అలాగే!"

"జాగ్రత్త" శ్రీధర్ సెల్ ఆఫ్‌చేశాడు.



"త్రిపురాంబగారూ,

పెద్ద కొడుకంటే ఎంత ప్రేమ మీకు?

దృతరాష్ట్రుడు దుర్మార్గుడైన దుర్యోధనుడిని గుడ్డిగా ప్రేమించినట్టే మీరూ శ్రీధర్‌ని గుడ్డిగా నమ్మేరు. దొంగకి ఇనప్పెట్టె తాళాలు ఇచ్చారు. ఇకనైనా కళ్ళు తెరవండి."

సంతకంలేని ఆ ఉత్తరాన్ని త్రిపురాంబ రెండుమూడుసార్లు చదివింది. కవరుమీద పోస్టు ముద్రకోసం చూసింది. అది ఆ వూళ్ళోనే పోస్టుచెయ్యబడింది. ఆవిడలో ఏమాత్రం సంచలనాన్ని కలిగించలేదా ఉత్తరం. 'ఎవరో తమ ఉన్నతిని చూసి సహించలేనివాళ్ళు ఈర్ష్యతో రాసి వుంటారు' అనుకుంది. ఆవిడ ఆ ఉత్తరాన్ని చింపెయ్యబోయి, అంతలోనే మనసు మార్చుకుని బీర్వాలో బట్టల అడుగున దాచిపెట్టింది. ఆ విషయానికి ప్రాముఖ్యతనివ్వలేదు.

★ ★ ★

రాజేశ్వరమ్మ కవరు, పెన్ను పట్టుకుని శ్వేత దగ్గరకి వచ్చింది. "మీ నాన్నకి

ఉత్తరం రాయి"

"ఏమని రాయను? "

"నీ పోషణకోసం, నీకు పుట్టబోయే బిడ్డ పోషణకోసం నెలకి నాలుగువేలు పంప మని రాయి"

"నేను రాయను" స్థిరంగా అంది.

"అయితే అబార్షన్ చేయించుకో" వెంటనే అన్నాడు మోహన్.

"మీరు తాళికట్టినది నా మెడలోనా? లేక మా నాన్నగారు ఇచ్చిన డబ్బుమూటకా? " శ్వేత అలా అడుగుతుందని ఊహించని ఆ తల్లీ కొడుకుల ముఖాలు ఎర్రబడ్డాయి.

"అవును. డబ్బుకోసమే, నిన్ను పెళ్ళిచేసు కున్నాను. నీ అందం చూపి మూర్ఛపోయి కాదు" మోహన్ వ్యంగ్యంగా అన్నాడు.

"మన తొలిరాత్రి కూడా మీరు ఇదే మాట చెప్పారు. ఆ రోజే నేను మీతో వివా హబంధాన్ని ఎందుకు తెంచుకోలేదో తెలుసా? మీలో ఎప్పటికైనా మార్పు వస్తుందనే ఆశతో మార్పుతేగలననే నమ్మ కంతో. కాని నాది వృధాప్రయాస అని అర్థ మయింది" శ్వేత లోపలకి వెళ్ళి పైన వున్న తన బట్టలని సూట్ కేసులో సర్దుకుంది.

మోహన్ వెనుకనే వచ్చాడు. "ఎక్కడకి ప్రయాణమవుతున్నావ్? "

"డబ్బుకి మాత్రమే విలువనిచ్చే మీతో నేను కలిసివుండను"

"అంటే! కాపురాన్ని వదులుకోడానికి సిద్ధ పడ్డావా? "

"డబ్బుకోసం చేసేదాన్ని కాపురం అనరు. వ్యభిచారం అంటారు. మీరు నా దృష్టిలో మేల్ ప్రాసిట్యూట్ కంటే హీనులు" ఇన్నాళ్లూ తనలో దాచుకున్న కసిని, కోపాన్ని కక్కుతోంది శ్వేత.

ఆమె స్వరంలో జుగుప్స, తిరస్కారం ప్రతిఫలిస్తున్నాయి.

"ఏం కూశావే? " అతను చెయ్యెత్తాడు.

"ముందా చేతిని దింపండి!" శివంగిలా గర్జించింది శ్వేత.

"ఈ క్షణంనుంచి మీరు నాకేమీ కారు. మీకు నాపై ఏ అధికారం వుందని నాపై చెయ్యెత్తుతున్నారు? "

ఎత్తిన చేతిని దింపి, అప్రయత్నంగానే ఒక అడుగు వెనక్కి వేశాడు.

శ్వేత చేతిలో సూట్ కేసుతో బయటకి వచ్చింది.

"మొగుడుని వదిలి పుట్టింట్లో వుండడమే గౌరవం అనుకున్నావా? నీ బాబు నిన్ను జీవితాంతం పోషిస్తాడనుకున్నావా? " వెట కారంగా అడిగింది రాజేశ్వరమ్మ.

"మీకు గతంలో ఒకసారి చెప్పాను. మళ్ళీ చెబుతున్నాను. మా నాన్నగారి ఆస్తిపై నాకేమాత్రం ఆశలేదు. ఆయన నన్ను చది వించారు. నా కాళ్ళమీద నేను నిలబడేలా చేశారు. నా బతుకు నేను బతుకుతాను"

"శభాష్ శ్వేతా!"

"వెనుకనుంచి తండ్రి స్వరం వినిపించి ఆమె తిరిగి చూసి సంభ్రమంతో తలమున కలవుతూ "నాన్నా!" అంది. "మీరు... మీరెలా"

"నిన్ను ఒకసారి చూసివెళ్దామని వచ్చా నమ్మా! రావలసిన సమయంలోనే వచ్చాను. ఇందాకా నువ్వన్నావు చూడు. "నా కాళ్ళమీద నేను నిలబడతాను" అని. ప్రతి ఆడపిల్లలోను ఆ మనస్థైర్యమే వుండా లమ్మా. పెళ్ళి అనే భద్రతను డబ్బిచ్చి కొను క్కోవాలనే ఆలోచననుంచి ప్రతి ఆడపిల్లా బయటపడాలి"

"ఈ కూతురికి ఆ తండ్రి వత్తాసు. పుట్టింట్లో ఎన్నాళ్ళుంచుకుంటావ్ నీ కూతుర్ని? " రాజేశ్వరమ్మ వ్యంగ్యం, కోపం మిళితమైన స్వరంతో అడిగింది.

"జీవితాంతం వుంచుకుంటాను. ఆడపిల్లకి అత్తింట్లో రక్షణ కరువైనప్పుడు పుట్టిల్లే రక్ష ణ కోట కావాలి. ఆ రక్షణను నా కూతురికి నేను ఇస్తాను" అన్నాడు రఘురామయ్య స్థిరంగా.

"పదమ్మా శ్వేతా!" అన్నాడాయన.



స్థిరనిశ్చయంతో ఆ ఇంటి గడపను దాటింది శ్వేత!

★ ★ ★

ధీరజ్ ఇంటికి వచ్చేప్పటికి వర్ష తయారుగా వుంది.

"మన ఇంటిపనులు ఎంతవరకు వచ్చాయో చూసివద్దాం పదండి"

"ఇల్లా? ఏ ఇల్లు?"

"జూబిలీహిల్స్‌లో ఇల్లు"

"అది... ఆ ఇంటిని అమ్మేశాం"

"అమ్మేశారా?" ఉలికిపాటుగా అడిగింది.

ధీరజ్ సిగ్గుపడుతున్నట్టుగా ఎటో చూస్తూ చెప్పసాగాడు.

"మా ఫ్యాక్టరీ నష్టాలలో నడుస్తోంది. అప్పులు తీర్చడంకోసం..."

"అప్పులా?" కీచుమందామె స్వరం. ఆమెకి తన చుట్టూ వున్న వస్తువులన్నీ గిర గిర తిరిగిపోతున్న అనుభూతి కలుగుతోంది.

"ఫ్యాక్టరీ నష్టాలలో నడుస్తోందా?"

"అవును. గత ఆరునెలలుగా నష్టాలతోనే నడుస్తోంది. పెట్టుబడికి డబ్బు అవసరమై ఒక శేఠ్ దగ్గర అప్పుచేశాం. ఆ అప్పు తీర్చలేదని ఆయన మన పెళ్లికి ముందే ఆ ఇంటిని జమ కట్టుకున్నాడు"

"అంటే! డబ్బున్న వాళ్ళలా నటించి నన్ను పెళ్లి చేసుకున్నారన్నమాట. ఎందుకు అబద్ధం చెప్పారు? ఎందుకు మా నాన్నగార్ని నమ్మించి వంచించారు"

"నన్ను క్షమించు వర్షా" వివర్ణమైన ముఖాన్ని కిందకి దించుకున్నాడతను.

వర్షకి ఉక్రోషంతో ఏడుపు వస్తోంది. త్వరలో తమ ఇంటికి వెళ్లిపోతామని, ఇంద్ర భవనంలాంటి ఆ ఇంట్లో స్వర్గసుఖాలను అనుభవించవచ్చనే ఆశతో ఇన్నాళ్ళూ ఈ ఇరుకుగదులలో ఓపిగ్గా కాపురం చేస్తోంది. ఇప్పుడు ఆ ఆశ ఎప్పటికీ నెరవేరేది కాదని అర్థమయిపోయింది.

"ఎందుకింత మోసం చేశారు నన్ను" ఏడుస్తూ అడిగింధి.

"నాకు నిన్ను మోసం చేసే ఉద్దేశం లేదు. కాని మా అమ్మ, నాన్నలు నా నోరు నొక్కి నీతో పెళ్ళికి ఒప్పించారు"

వర్ష ఈ నయవంచనని తట్టుకోలేకపోతోంది. కొద్దిసేపు అసహాయంగా ఏడుస్తూండిపోయింది. కాస్సేపటి తరువాత ముఖం కడుక్కుని, బయటకి వచ్చింది. హాల్లో కూర్చున్న అత్తగారిని మామగారిని ఏహ్యంగా తిరస్కారంగా ఒక్కచూపుచూసి బయటకివచ్చి ఖాళీగా పోతున్న ఆటోని ఆపి ఎక్కింది.

వేళగాని వేళలో వచ్చిన కూతుర్నిచూసి వరలక్ష్మి ఆశ్చర్యపడింది. ఆమెముఖం మామూలుగా లేకపోవడంతో ఏదో జరిగి వుంటుందని ఆందోళన పడింది. వర్ష వస్తూనే తల్లిని కౌగలించుకుని ఏడవడం మొదలుపెట్టింది.

"ఏం జరిగిందమ్మా?" గుండె దడదడలాడుతుండగా అడిగింది వరలక్ష్మి.

"మనం మోసపోయాం" అంటూ వర్ష భర్తతో తన సంభాషణ చెప్పింది.

వరలక్ష్మి ఏడుస్తూ అంది. "ఈ విషయాలన్నీ నాకెప్పుడో తెలుసమ్మా? నీకు తెలిస్తే బెంగ పెట్టుకుంటావని చెప్పలేదు"

"నేను ఇంక ఆ ఇంటికి వెళ్ళను. వాడితో కలిసి వుండను"

వరలక్ష్మి గుండెలలో మంటపెట్టినట్టయింది. 'వర్ష పెళ్ళికి ఎన్ని లక్షలు ఖర్చుపెట్టింది? అంతా బూడిదలోపోసిన పన్నీరయింది. తను అపాత్రదానం చేసింది'

"మీ నాన్నగారు ఇంటికి వచ్చాక ఆలోచిద్దాంలేమ్మా" అంది కూతుర్ని ఓదారుస్తూ.

తండ్రి ఇంటికి వచ్చాక, తనకి జరిగిన మోసానికి మరోసారి ఏడ్చి తనకి ఇంక ఆ ఇంటికి వెళ్ళే ఆలోచనలేదని నొక్కి వక్కాణించింది వర్ష.

పెళ్ళయి ఇరవైరోజులు. కాపురానికి వెళ్ళనంటున్న కూతురికి ఎలా నచ్చచెప్పాలో




అర్థంకానట్టు కొన్ని క్షణాలు అసహాయంగా ఆమెని చూసి అన్నాడు శివశంకరం.

"ధీరజ్ బుద్ధిమంతుడే కదమ్మా"

"ఆc! చాలామంచివాడు. తల్లిదండ్రులతో కలిసి నాటకమాడి నన్ను పెళ్ళిచేసుకుని, మనల్ని నిలువునా ముంచిన బుద్ధిమంతుడు"

"అది కాదమ్మా! వ్యక్తిగతంగా అతను మంచివాడేనా? ఏమైనా దురలవాట్లున్నాయా? "

"ఏమీలేవు"

"వ్యాపారం అన్నాక ఆటుపోట్లు సహజం. వాళ్ళు మనని మోసగించిన మాటనిజమే. అంతమాత్రాన అతనితో వైవాహిక బంధాన్ని తెంచుకుంటావా? "

"అంటే! నన్ను ఆ ఇంట్లో వుండమనే అంటున్నారా నాన్నా? మీరే చెప్పండి. నేను ఎ.సి లేకుండా ఏరోజైనా పడుకున్నానా? కారులో తప్ప ఆటో ఎక్కానా? " వర్ష స్వరం దుఃఖంతో పూడుకుపోయింది. "అలాంటి నేను ఆటో ఎక్కి ఒక మామూలు ఆడపిల్లలా వచ్చాను. అమ్మమ్మ తాయారమ్మగారిని పంపబట్టికాని, లేకపోతే ఆవిడ నాచేత వంట చేయించివుండేది"

"అసలు మీరిక్కడ వుండవలసిన అవసరం ఏమిటమ్మా? హాయిగా అమెరికా వెళ్ళిపోండి. ధీరజ్, అమెరికా లో ఎమ్.ఎస్ చేసే వచ్చాడుగా? అతని క్వాలిఫికేషన్‌కి అక్కడ ఉద్యోగం తప్పకుండా వస్తుంది"

అమెరికా అనే మాట వినగానే వర్ష కళ్ళలో వెలుగొచ్చింది. "నాకా విషయం తట్టనే లేదు నాన్నగారూ! కాని, ధీరజ్ అమెరికా వెళ్ళడానికి ఒప్పుకుంటాడో లేదో"

"నేను అతనితో మాట్లాడుతాను" అన్నాడు శివశంకరం.

"అతని క్వాలిఫికేషన్స్‌కి ఇక్కడా ఉద్యోగం వస్తుంది. కాని, ఇక్కడ జీతం తక్కువ"

"మేం అమెరికా వెళ్ళిపోతాం. నేను ధీరజ్‌తో మాట్లాడతాను. మీరూ మాట్లాడండి"

వర్ష గాలిలో తేలిపోతూ ఇంటికి వచ్చింది. హాలులో అత్తగారు, మామగారు ఇందాక ఏ పొజిషన్‌లో కూర్చున్నారో ఇప్పుడూ అలాగే కూర్చున్నారు.

"ఇంట్లో ఏమీ తోచకపోతే నా ఫ్రెండ్ దగ్గరకి వెళ్ళొస్తున్నానాంటీ" అంది.

"అలాగా!" అంది కామాక్షమ్మ. నిజానికి ఆవిడ వర్ష ధీరజ్‌తో గొడవపడడం వింది.

ఆ రాత్రి వర్ష అసలేమీ జరగనట్టు భర్తని ప్రేమలో ముంచెత్తింది. అతను మంచి మూడ్‌లో వుండగా చెప్పింది.

"మనం అమెరికా వెళ్ళిపోదామండీ? "

"అమెరికానా? "

"అవును. ఎలాగూ ఫ్యాక్టరీ లాకవుట్‌లో వుంది. ఇక్కడ వుండి మీరు చేసేదేముంది? మీరు ఎమ్.ఎస్. చేసి వచ్చారుగా? అక్కడ మంచి ఉద్యోగం వస్తుంది. మనం సుఖంగా బతకొచ్చు"

"చూద్దాం" అన్నాడతను నిరాసక్తంగా.

★ ★ ★

హఠాత్తుగా వచ్చిన వియ్యంకుడిని, వియ్యపురాలిని సంభ్రమంగా ఆహ్వానించింది త్రిపురాంబ. "రండి, రండి ఎన్నాళ్ళయింది మిమ్మల్ని చూసి? ఈమధ్య బొత్తిగా నల్లపూసయిపోయారు. మా మీద అలిగారా ఏమిటి? "

"ఎంతమాట వదినగారూ! మీ అన్నయ్యగారికి బిజినెస్ పనులతో ఊపిరాడ్డం లేదసలు. లేకపోతే మిమ్మల్ని చూడ్డానికి రాకుండా వుంటానా? "

"నమస్కారం బావగారూ! కులాసానా? " కృష్ణమూర్తి దర్పంగా పలుకరించాడు మాధవరావుగారిని.

"ఆc! మీరు బాగున్నారా? " ఆయన నవ్వుతూ అడిగారు.

కల్పన సంతోషంతో దీప్తివంతమైన ముఖంతో తల్లినీ తండ్రినీ పలుకరించి కాఫీ కలపడానికి వంటగదిలోకి వెళ్ళింది.

"వర్ష కులాసాగా వుందా? " అడిగింది

మహేశ్వరి. మనుమరాలి ప్రస్తావనతో త్రిపురాంబ ముఖం క్షణకాలం నల్లబడింది. అంతలోనే సర్దుకుని అంది, "ఆఁ! బాగుంది. వారం క్రితమే హనీమూన్ నుంచి వచ్చారు. మీరు దాని పెళ్ళికి రానేలేదు"

"మావారు బిజినెస్ పనిమీద ముంబాయి వెళ్తుంటే నేనూ వెళ్ళాను" ముందే ఆలోచించి పెట్టుకున్న సమాధానం తడుముకోకుండా చెప్పేసిందావిడ.

"అవునవును" కల్పన చెప్పింది.

"మీ బిజినెస్ ఎలా ఉంది? " కృష్ణమూర్తి అడిగాడు.

"ప్రస్తుతానికి ఫర్వాలేదు. అయినా ఏ బిజినెస్‌లో అయినా లాభనష్టాలు వుంటూనే వుంటాయి. వస్తే లక్షలు వస్తాయి. పోతే కోట్లు పోతాయి" అన్నారు మాధవరావుగారు.

ఒక్కసారిగా ఆ హాలులో సూది కిందపడితే విన్పించేంత నిశ్శబ్దం అలుముకుంది.

తను బిజినెస్‌లో నష్టపోయిన విషయం ఈయనకి తెలిసే అలా అంటున్నాడా అని కృష్ణమూర్తి, వర్ష అత్తవారు బిజినెస్‌లో సర్వం కోల్పోయారని ఆయనకి తెలిసిపోయిందా అని త్రిపురాంబ ఎవరికి వారే భుజాలు తడుముకున్నారు.

మహేశ్వరి చప్పున టాపిక్ మారుస్తూ అడిగింది. "కల్పన ఏదీ? "

"వంటింట్లో వున్నట్టుంది పిలుస్తాను" అని ఆవిడ అంటూండగానే ఆమె చేతిలో కాఫీ కప్పులున్న ట్రేతో అక్కడకి వచ్చింది.

"కల్పనా! ఇలా రామ్మా!" మహేశ్వరి హేండ్‌బ్యాగ్ తీస్తూ పిలిచింది.

"ఏమిటమ్మా? "

"నీ కోసం చెన్నైనుంచి పచ్చలహారం తెప్పించానమ్మా!" అంటూ ఆవిడ బ్యాగ్‌లో నుంచి ఒక బాక్స్ తీసి ఆమె చేతిలో పెట్టింది.

"వావ్! పచ్చలహారమా? " ఆమె ఆనందాతిరేకంతో చిన్నగా అరుస్తూ తల్లిని అమాంతం కౌగలించుకుని ముద్దు పెట్టుకుంది.

"ఎప్పటినుంచో పచ్చలహారం కొనుక్కోవాలనుకుంటున్నాను. నా మనసులో కోరిక తెలిసినట్టే తెచ్చావు నువ్వు. థాంక్ యూ" అంటూ కొక్కెం విడదీసి హారాన్ని మెడలో పెట్టుకుంది"

"మీ అత్తగారికి చూపించు" అంది మహేశ్వరి గొప్పగా.

కల్పన ఆ హారాన్ని మెడలోనుంచి తీసి అత్తగారికిచ్చింది. ఆవిడ సంతోషంతో తల మునకలవుతూ అందులో పొదగబడిన పచ్చలని, ముత్యాలని నాణ్యత పరిశీలిస్తూ అంది.

"చాలా బాగుంది. ఎంతయింది వదిన గారూ? "

"యాభైఆరువేలయిందండీ. దిద్దులు బాక్స్‌లో వున్నాయి. చూడండి"

"చాలా బాగున్నాయి. మీ సెలక్షనే సెలక్షన్"

"సెలక్షన్ మాత్రం మాది కాదులెండి. నా ఫ్రెండ్ చెన్నై వెళ్తుంటే తెప్పించాను" అన్నాడు కృష్ణమూర్తి.

"చూడండి" అంటూ హారాన్ని త్రిపురాంబ భర్తకి అందించింది. ఆయన దాన్ని పరిశీలించి అన్నారు. "ఇలాంటి నగలన్నీ ఇక్కడే దొరుకుతున్నాయండీ. హైదరాబాద్‌లో ఆర్కే జ్యూయెలర్స్‌లో దొరకని నగలు లేవు"

కల్పన ముఖంలో రంగులు మారాయి. ఆమె చప్పున తల్లివైపు చూసింది. ఆవిడ భర్తవైపు చూసింది. ముగ్గురూ క్షణకాలం ఒకరి ముఖాలు మరొకరు చూసుకుని తరువాత మాధవరావుగారివైపు చూశారు ఆయన మాటలలో ఏదైనా శ్లేష వుందా అని పరిశీలిస్తున్నట్టు. ఆయన ముఖం మామూలుగానే వుండడంతో వాళ్ళ గుండెలు తేలిక పడ్డాయి.

"మీరు ఎన్నయినా చెప్పండి బావగారూ! చెన్నైలో నవరత్నాలకి బాపాలాల్ చాలా

ఫేమస్" అన్నాడు కృష్ణమూర్తి.

"అవును" అన్నారు మాధవరావుగారు.

భర్త చేతులలోని హారాన్ని అందుకుని త్రిపురాంబ 'స్రవంతీ' అని పిలిచింది. ఆ సమయంలో ఆమె కిచెన్‌లో బిజీగా వుంది. అత్తగారి పిలుపుతో చేస్తున్న పనిని వదిలి బయటికి వచ్చింది.

అత్తగారు స్రవంతిని పిలవడంలోని ఆంతర్యాన్ని గ్రహించిన కల్పన గుండె దడదడలాడింది. ఇప్పుడు అత్తగారు పచ్చలహారాన్ని తల్లి తన కోసం కొందని చెబుతుంది. ఆమె తనవైపు వ్యంగ్యంగా చూసి నవ్వుతుంది. ఎందుకంటే స్రవంతికి తన తండ్రి తనకింత ఖరీదైన కానుకలు ఇచ్చేస్థితిలో లేడని తెలుసు. ఆమె ఊపిరి బిగపట్టి చూస్తోంది.

స్రవంతి హాలులోకి వచ్చి కల్పన తల్లిదండ్రులకి మర్యాదగా నమస్కరించింది.

త్రిపురాంబ హారాన్ని కోడలికి అందిస్తూ అంది, "ఇదిగో కల్పన కోసం వాళ్ళమ్మగారు చెన్నైనుండి తెప్పించారీ హారాన్ని. యాభైఅరువేలయిందిట"

"చాలా బాగుందండీ" అందామె చిరునవ్వుతో కల్పనవైపు చూస్తూ. ఆమె పెదవులపై నవ్వు తనని అపహాస్యం చేస్తున్నట్టు ఫీలయింది కల్పన.

"స్టవ్‌మీద కూరపెట్టాను. వస్తానండి" అని ఆ హారాన్ని కల్పనకిచ్చి తిరిగి కిచెన్‌లోకి వెళ్ళిపోయింది.

ఆమె వెనుకనే వచ్చిన త్రిపురాంబ చెప్పింది. "వాళ్ళకి ఒక్క కూరతో భోజనం పెడితే బాగుండదు. మరో కూర ఏదైనా చెయ్యి. పెరుగుపచ్చడి, స్వీటు కూడా చెయ్యి"

"అలాగేనత్తయ్యా!" అంది ఫ్రిజ్ తెరిచి కూరలు తీసుకెళ్తూ.

★ ★ ★

"కల్పనా,

"నువ్వు అబద్ధాలు చెప్పడమే కాకుండా మీ అమ్మా నాన్నలతో కూడా అబద్ధం చెప్పిస్తున్నావా? మీ అమ్మగారు పచ్చలహారం కొని నీకు కానుకగా ఇచ్చారా? 'దొంగాడి పెళ్ళాం దొరసాని' అనే సామెతను అక్షరాలా నిజం చేస్తున్నావు. నీ భర్త సంపాదించిన దొంగసొమ్ముతో నగలుకొని వాటిని పుట్టింటికి చేరవేసి, మీ అమ్మచేత నీ అత్తగారిముందు ఇప్పించుకుని గర్వపడుతున్నావా? కానుకలతో అత్తగారిని మెప్పించే ప్రయత్నాన్ని ఇంకనైనా మానుకో"

అదే చేతివ్రాత! అదే బాణీ! తన గుట్టు తెలుసుకుని తనని బెదిరిస్తూ రాసిన సంతకంలేని ఆ ఉత్తరాన్ని చూడగానే కల్పన నిలువెల్లా కంపించిపోయింది. తన తండ్రి ఆస్తిపోయిందని, ఆయన లక్షలు ఖరీదు చేసే ఇంటిని అమ్ముకుని ఫ్లాటులోకి మారిపోయాడనే విషయం సునీత ద్వారా స్రవంతికి తెలిసివుండవచ్చు. కాని తను పచ్చలహారాన్ని ఇక్కడే కొని వరంగల్ తండ్రికి పంపిన విషయాన్ని ఆమె ఎలా తెలుసుకోగలిగింది? తనమీద పత్తేదారులని నియమించిందా? లేక పచ్చలహారాన్ని తనే కొనుక్కొని తల్లికి రహస్యంగా పంపివుంటుందని ఊహించిందా? " కల్పన భర్త ఇంటికి వచ్చేవరకు అసహనంగా నిరీక్షించింది.

ఆమె చూపించిన ఉత్తరాన్ని చదివి శ్రీధర్ ముఖంలో అనేక భావాలు సుళ్ళు తిరిగి, చివరకి క్రౌర్యంగా మారిపోయింది.

"ఇంక ఉపేక్షిస్తే లాభంలేదు" పళ్లు కొరుకుతూ అన్నాడు.

"ఏం చెయ్యగలం? " నిస్సహాయంగా అంది. "దొంగకి తేలు కుట్టినట్టుంది మన పరిస్థితి"

"తేలుకాదు. దాన్ని పాములా కాటేస్తాను" అతని స్వరంలో కసి, కళ్లలో పగ! "దాన్ని దొంగ అని నిరూపిస్తాను. మా అమ్మ దృష్టిలో అది అధఃపాతాళలోకానికి దిగజారిపోవాలి"

"ఎలా? " ఆసక్తిగా అడిగింది.

"పదివేల రూపాయలు స్రవంతికి తెలియకుండా దాని బీర్వాలో పెట్టు. నీ బీర్వాలో పెట్టిన డబ్బు మాయమయిపోయిందని గొడవ చెయ్యి. ఇంటి దొంగని ఈశ్వరుడైనా పట్టలేడు లాంటి సామెతలతో దాన్ని రెచ్చగొట్టు. పౌరుషం వచ్చి అది కావాలంటే నా బీర్వా వెతుక్కో అంటుంది. అప్పుడు నువ్వు పెట్టిన డబ్బు బయటపడి, అది దొంగ అని నిరూపించబడుతుంది"

"ఇది చాలా సినిమాలలో చూపించిన పాత ట్రిక్కే" పెదవి విరిచింది.

"దానికంటే ముందు నువ్వు చెయ్యవలసిన పని మరొకటి వుంది. అతను టేబిల్ మీద వున్న కాగితాన్ని అందుకుని సీరియస్‌గా రాయడం మొదలుపెట్టాడు.

భర్త ఏం చెయ్యబోతున్నాడో అనే కుతూహలంతో కల్పన గుండెలు వేగంగా కొట్టుకున్నాయి.

"ఈ ఉత్తరాన్ని యధాతథంగా కాపీచేసి కవరులో పెట్టి అతికించి మా అమ్మ పేరు, ఎడ్రస్ రాసి మన ఆఫీస్‌బాయ్ సత్యాన్ని కాకినాడ పంపి అక్కడనుంచి పోస్ట్ చేయించు. జాగ్రత్త! ఎవరికీ ఏ అనుమానం రాకూడదు. నేను రేపు చెన్నై వెళ్తున్నాను. అక్కడనుంచి సింగపూర్ వెళ్తున్నాను. బిజినెస్ ట్రిప్. వారందాకా రాను. నేను తిరిగి ఇంటికి వచ్చేప్పటికి స్రవంతి ఈ ఇంట్లో వుండకూడదు. తనమీద పడిన నిందని భరించలేక వెళ్ళిపోవాలి? "

కల్పన భర్త రాసిన ఆ ఉత్తరాన్ని చదివి అంది. "మీరు భలే తెలివైనవారండీ! స్రవంతి దొంగ అని రుజువు చెయ్యడానికి ఈ ఉత్తరం చాలు"

శ్రీధర్ గర్వంగా నవ్వేడు. "లేకపోతే దానికెంత ధైర్యం! మన విషయాలన్నీ కూపీ లాగడానికి!"

"కాని గొడవ అయితే రవికి కోపం వస్తుందేమో!"

"వస్తే వస్తుంది. పెళ్ళాం కావాలనుకుంటే వాడు కూడా ఈ ఇంట్లోంచి వెళ్ళిపోతాడు. నువ్వు మాత్రం జాగ్రత్తగా ఈ ఉత్తరాన్ని కాపీ చెయ్యి" అతను స్నానానికి వెళ్ళాడు. కల్పన కాగితాన్ని తీసుకుని, ఆ ఉత్తరాన్ని కాపీ చెయ్యడం మొదలుపెట్టింది.

"చి॥ స్రవంతికి,

మీ అమ్మ ఆశీస్సులు. నువ్వు చి॥ అల్లుడు అక్కడ కులాసాగా వున్నారని తలుస్తాను. మేము ఇక్కడ కులాసాగా వున్నామని రాయడం ఉత్తరాలలో సర్వసాధారణంగా అందరూ రాసే పద్ధతి. కాని మేము సుఖంగా లేము. కారణం చేతిలో బొత్తిగా డబ్బులేదు. మీ నాన్న సంపాదనతో మేము ముగ్గురం బతకాలి. నువ్వు ఇదివరకు పంపినట్టే మాకో పదివేలు పంపగలవా? మీ ఇంట్లోవాళ్ళకి తెలియకుండా ముఖ్యంగా మీ అత్తగారికి తెలియకుండా డబ్బు పంపు. నిన్ను గొప్పింటి కోడలిని చేసినది నువ్వు సుఖపడతావనే కాదు, మాకు ఆసరా అవుతావని. డబ్బు వెంటనే పంపు"

ఇట్లు

మీ అమ్మ అన్నపూర్ణమ్మ"

ఉత్తరాన్ని కాపీ చెయ్యడం పూర్తిచేసిన కల్పన బాల్కనీలోకి వచ్చి అంతకుముందు భర్త రాసిన ఉత్తరాన్ని కాల్చేసింది. ఆమె పెదవులపై విజయగర్వంతో కూడిన నవ్వు నాట్యం చేస్తోంది.

★ ★ ★

"మనం అమెరికా ఎప్పుడు వెళ్దాం? " అడిగింది వర్ష పదహారోసారి.

"అది సరే వర్షా! మనం అంత దూరం వెళ్ళిపోతే అమ్మనాన్నలని ఎవరు చూస్తారు? "

"ఎవరు చూడాలి? వాళ్ళింకా ఆరోగ్యంగా, బలంగానే వున్నారుగా? ఇక్కడే వుంటారు" నిర్లక్ష్యంగా అంది.

"మీ అమ్మా వాళ్ళని వదిలి అంత దూరంవెళ్ళి నువ్వుండగలవా? "

"ఏడాదికోసారి వాళ్ళే వస్తారు. టికెట్టు




కొనుక్కుని వాళ్లు రాగలరు" ఆమె స్వరంలో ధ్వనించిన అతిశయం ఇన్‌డైరెక్టుగా తన తండ్రి లేమిని ఎత్తిచూపిస్తున్నట్టే ఫీల య్యాడు ధీరజ్. అతని ముఖంలో మారు తున్న రంగులని పట్టించుకోకుండా అడి గింది.

"మీరు అప్లై చెయ్యండి"

"ఆలోచిస్తాను"

"అసలు మీరు అమెరికా వెళ్లడం, ఎమ్. ఎస్ చెయ్యడం నిజమేనా? - లేకపోతే అదీ నన్ను పెళ్లి చేసుకోడానికి చెప్పిన అబద్ధ మేనా? " మంటగా అడిగింది.

ధీరజ్ ముఖం తెల్లగా పాలిపోయింది. "నిజమే! నేను ఎమ్.ఎస్ చెయ్యలేదు"

"ఏమిటీ" కెవ్వుమన్నట్టు అంది. "మీరు... ఎమ్.ఎస్ చెయ్యలేదా? "

"చెయ్యాలనే వెళ్లాను. కాని చదవలేకపో యాను. నాకు ముందునుంచి చదువుమీద ఆసక్తి తక్కువ. ఫ్యాక్టరీని డెవలప్ చెయ్యా లనుకున్నాను. కానీ అది కలిసి రాలేదు" అతను సిగ్గుపడుతూ సంజాయిషీ ఇస్తు న్నట్టు అన్న మాటలకి వర్ష క్రోధంతో, ఆవే శంతో వణికిపోతూ ఒక్కంగలో అతన్ని సమీపించి అతని షర్టు కాలర్ పట్టుకుంది.

"యు ఛీట్! స్కౌండ్రల్! ఎన్ని అబద్ధాలు చెప్పావు నువ్వు! నీ తల్లీతండ్రీ నువ్వూ కలిసి మమ్మల్ని ఎంత దారుణంగా వంచిం చారు. నువ్వు అమెరికాలో ఎమ్.ఎస్. చేశా వన్నమాట అబద్ధం! నీకు పెద్ద ఇండస్ట్రీ వుందన్నమాట అబద్ధం! నీ బతుకే అబద్ధం! నీకసలు నన్ను పెళ్లి చేసుకునే అర్హత వుందా? నీ ముఖానికి వేలకి వేలు ఖరీదు చేసే కానుకలు కావలసి వచ్చాయా? " కోపంతో ఒళ్లు మరచిపోయి ఏం మాట్లాడు తోందో తెలియని స్థితిలో ఇష్టం వచ్చినట్టు మాట్లాడుతోంది.

"షర్టు వదులు? " ధీరజ్ విసురుగా వది లించుకున్నాడు. "నిన్ను మోసం చెయ్యాలనే ఆలోచన నాకు లేదు. మా నాన్నగారు... ఆయనే దీనికి కారకుడు. లక్ష అబద్ధాలాడి మన పెళ్లి చేశారు. మన స్థితిగతులను గురించి వాళ్లతో నిజం చెప్పండి అని నేను మొత్తుకుంటున్నా వినకుండా నా నోరు మూసి పెళ్లికి నన్ను ఒప్పించారు"

"నీ నోరు వాళ్లు మూసేశారా? లేక మా ఐశ్వర్యాన్ని చూసి నీ నోరు మూసుకుపో యిందా? "

"కొంచెం మర్యాదగా మాట్లాడు. నీ డబ్బు ఎవరికి కావాలి? నువ్వు నాకు నచ్చావు? అందుకే నీతో పెళ్లికి అంగీకరించాను"

"నచ్చింది నేనా? మా డబ్బా? "

వ్యంగ్యపూరితమైన ఆమె మాటలతో గాయపడిన అతని హృదయం అతని కళ్లల్లో ప్రతిఫలిస్తోంది.

"నువ్వు మాత్రం... మేము డబ్బున్న వాళ్లమనేగా నన్ను పెళ్లి చేసుకున్నావ్? "

"పెళ్లి చేసుకునేప్పుడు అందం, ఐశ్వర్యం, సంఘంలో స్టేటస్ అన్నీ చూసి చేసు కుంటాం. అనామకుడిని ఎవరూ పెళ్లి చేసు కోరు"

"మన పెళ్లయిన తర్వాత మా ఆస్తులన్నీ పోతే? "

"నా కర్మ అని సరిపెట్టుకుంటాను. కానీ నువ్వు గొప్ప వాడిలా నటించి నన్ను పెళ్లి చేసుకున్నావ్! అందుకే నువ్వంటే నాకు అసహ్యం"

ధీరజ్ ముఖం పాలిపోయింది. "డబ్బు తప్ప మన మధ్య బంధమేదీలేదా? "

"నాకు అవన్నీ తెలియవు. నేను ఈ ఇంట్లో వుండలేను. వుండను"

ధీరజ్ తన మెడలోని గొలుసుని వేలికి వున్న వజ్రపు ఉంగరాన్ని తీసి ఆమె ముందుకి జాపాడు. "నిజమే వర్షా! నాకు ఇంత విలువైన కానుకలని పొందే అర్హత లేదు. ఇవి పెళ్లిలో మీ వాళ్లు నాకు పెట్టి నవే. తీసుకో!" వర్ష వాటిని అందుకుని బాగ్‌లో వేసుకుంటూ అంది.

"ఇవే కాదు. మా వాళ్లు చాలా ఇచ్చారు.



నీకు సిగ్గుంటే అవన్నీ ఇచ్చెయ్యి"

ధీరజ్ హాలులోకి వచ్చాడు. కామాక్షమ్మ, వెంకటేశ్వరరావుల ముఖాలు పాలిపోయి వున్నాయి. ఒక గదిలో మాట్లాడుతున్న మాటలు మరో గదిలోకి విన్పించకపోవడానికి అదేమీ రాజమహల్ కాదు. వాళ్ల వర్ష మాట్లాడిన మాటలన్నీ విన్నారని వాళ్ల ముఖాలే చెబుతున్నాయి.

"అమ్మా! పెళ్లిలో వర్షా వాళ్లు ఏవేం పెట్టారో అవన్నీ ఇచ్చెయ్యి"

"ఇదేం గ్రహచారంరా? పెళ్లయి నెల రోజులు కాలేదు. ఆ అమ్మాయి వెళ్లిపోడం ఏమిటి? " ఆవిడ ఏడుస్తూ అంది.

"అవన్నీ తరువాత మాట్లాడుకుందాం. ముందు వాళ్లు పెట్టినవన్నీ ఇచ్చెయ్యి"

"అవి నా దగ్గరలేవురా"

"అవీ అమ్మేశావా? "

"అవును" ఆవిడ దోషిలా నేల చూపులు చూస్తూ అంది.

"కోడలు తెచ్చిన కానుకలని కూడా అమ్ముకునే దుస్థితికి దిగజారిపోయారామ్మా? " అతను ఆవేదనగా అన్నాడు.

వెంకటేశ్వరరావు అపరాధిలా తలదించుకున్నాడు.

ధీరజ్ తిరిగి గదిలోకి వచ్చాడు. వర్ష బీర్వాలో నుంచి తన బట్టలని లాగి సూట్ కేసులో సర్దుతోందల్లా తల ఎత్తి అతన్ని చూస్తూ అంది.

"ఏం? ఉత్తి చేతులతో వచ్చావు? మేం ఇచ్చినవన్నీ అమ్ముకుని తినేశారా మీ వాళ్లు? "

"నాకు పది రోజులు గడువియ్యి మీరిచ్చినవన్నీ వాపసు చేస్తాను"

"పౌరుషానికేమీ తక్కువలేదు. వాపసు చేస్తాడుట. ఏం అమ్మి తీరుస్తాడో" వ్యంగ్యంగా అని సూట్ కేస్‌తో బయటకి వచ్చింది.

ఆవేదనగా తననే చూస్తున్న అత్తమామలవైపు కన్నెత్తి అయినా చూడకుండా ఆ ఇంటి గడపదాటింది.



నాలుగు రోజులయినా ఇంట్లో బాంబు పేలకపోవడంతో కల్పనకి ఆశ్చర్యంగా వుంది. ఆ ఇంటికి పోస్ట్‌మాన్ మామూలుగానే వచ్చి వెళ్తున్నాడు. కాని అత్తగారికి తను రాసిన ఉత్తరం అంది నట్టులేదు. ఆమె ఫ్యాక్టరీకి వెళ్లి తను కాకినాడ పంపిన ఆఫీసుబాయ్‌ని అడిగింది.

"నువ్వు నేనిచ్చిన ఉత్తరాన్ని పోస్ట్ చేశావా లేదా? "

"చేశానమ్మగారూ" అన్నాడు వాడు. వాడు సత్య హరిశ్చంద్రుడి వారసుడని శ్రీధర్ అంటూంటాడు. చెప్పకూడని చోట కూడా నిజాలు చెప్పి చిక్కులలో పడుతుంటాడు. వాడు నిజం చెప్పడంలేదేమో అనే అపనమ్మకం లేదామెకి.

ఒకవేళ స్రవంతే ఆ ఉత్తరాన్ని అందుకుందనుకోడానికి ఆమె పోస్ట్‌మాన్ వచ్చే సమయానికి వంట గదిలో వుంటుంది. కల్పనకి టెన్షన్‌తో తల బద్దలయిపోతోంది. ఆ ఉత్తరాన్ని అటు స్రవంతిగాని, ఇటు అత్తగారు కాని అందుకుంటే ఇద్దరిలో ఒకరైనా రియాక్టవ్వాలి. కానీ ఇద్దరూ ప్రశాంతంగానే





వున్నారు. ఆమె రాత్రంతా ఆలోచించి ఒక నిశ్చయానికి వచ్చింది. తను, శ్రీధర్ ప్లాన్ చేసినట్టు ఆ ఉత్తరం అత్తగారికి అందనీ అందకపోనియ్యి తను మాత్రం తన పథకంలో రెండవ భాగాన్ని అమలు చెయ్యాలి. అలా అనుకున్న తరువాత ఆమెకి నిశ్చింతగా అన్పించింది.

మరునాడు ప్రొద్దుట ఆమె నిద్రలేచి కిందకి వచ్చేసరికి స్రవంతి అప్పటికే వంట గదిలో వుంది. రవి, మాధవరావుగారు హాల్లో కూర్చుని చెరో పేపరు చదువుతున్నారు.

"ఇదే మంచి అవకాశం" అనుకుని ఆమె మేడపైకి వెళ్లింది. భర్త తనకిచ్చిన డబ్బులో నుంచి పదివేల రూపాయల కట్టతీసి స్రవంతి గదిలోకి నడిచింది. వార్డ్రోబ్ లో ఆమె బట్టల అడుగున ఆ డబ్బు పెట్టి ఏమీ ఎరుగనట్టు కిందకి వచ్చేసింది. రవి స్నానానికి వెళ్లాడు. మాధవరావుగారు లేచి బయటకి వెళ్లారు. కల్పన కాఫీ కలుపుకుని వచ్చి తీరుబడిగా కూర్చుని పేపరు తీసింది. ఆ దిన పత్రికలో ప్రచురింపబడిన ఓ వార్త చదువుతున్న ఆమె చేతిలోని కాఫీ గ్లాసు జారికిందపడింది. ఆమెకి తన చుట్టూవున్న వస్తువులన్నీ గిరగిర తిరిగిపోతున్న అనుభూతి కలుగుతోంది. చెవులలో హోరు. మెదడు ఆలోచించే శక్తిని కోల్పోయి మొద్దుబారినట్టయింది. ఆమె పిచ్చిదానిలా పదే పదే ఆ వార్తని చదువుతోంది.

"మహాలక్ష్మి ఫైనాన్స్ కంపెనీ మేనేజింగ్ డైరెక్టర్ వరుణ్‌కుమార్ పరారీ" అనే వార్త కింద వరుణ్ ఫొటోని ప్రచురించారు.

కల్పన పేపరు పట్టుకుని కలలో నడుస్తున్న వ్యక్తిలా తన గదిలోకి వచ్చిపడింది. ఆమె సుడిగాలిలో చిక్కుకున్న పూల తీగెలా నిలువెల్లా కంపిస్తోంది. శ్రీధర్‌కి ఫోన్ చేసి ఈ విషయాన్ని చెప్పాలి. ఆ ఆలోచన వచ్చిందే తడవు ఆమె ఫోన్ దగ్గరకి నడిచింది. అప్పుడే సరిగ్గా ఫోన్ మోగింది. ఆమె వెంటనే లిఫ్ట్ చేసింది.

"హలో" అంది.

"కల్పనా! నేను శ్రీధర్‌ని"

భర్త స్వరాన్ని వినగానే ఆమెకి దుఃఖం ముంచుకొచ్చింది. వెక్కివెక్కి ఏడుస్తూండిపోయింది.

"ఏమయింది? మన ప్లాన్ బెడిసికొట్టిందా? రవి గొడవ చేశాడా? "

"మనం నిలువునా మునిగిపోయాం. మిమ్మల్ని ఆ వరుణ్ నిలువు దోపిడీ చేశాడు" అందామె ఏడుస్తూ.

"ఏమయింది చెప్పు? "

ఆమె విషయం చెప్పింది. "వ్వాట్" అతని స్వరం కీచుమంది.

"నువ్వు సరిగ్గా చదివేవా? "

"చదివేనండీ! మహాలక్ష్మి ఫైనాన్స్ కంపెనీ ఎమ్.డి వరుణ్ అని పేపర్లో వేశారు. మిగతా పార్ట్నర్స్ పోలీస్ రిపోర్టు ఇచ్చారుట. పోలీసులు కేసు దర్యాప్తు చేస్తున్నారుట"

"మైగాడ్" అతని స్వరం ఆర్తనాదంలా వుంది. "వాడిని నమ్మి పాతిక లక్షలిచ్చాను"

"ఇప్పుడేం చేద్దామండీ? "

"నేను ఇవాళ బయలుదేరి వచ్చేస్తున్నాను. నువ్వు ఏమీ జరగనట్టు మామూలుగా వుండు" అతను ఫోన్ పెట్టేశాడు.

కల్పన తలుపులు వేసుకుని చాలాసేపు ఏడుస్తూండిపోయింది. తరువాత లేచి స్నానం చేసింది.

పోయిన డబ్బుకి భర్త అత్తగారికి ఏం సమాధానమిస్తాడు. ఏదో తెలియని నిస్సత్తువ ఆవహించిందామెని.

తలుపు తట్టిన శబ్దమయింది. ఆమె



తలుపు తీసింది. పనిపిల్ల!

"అమ్మగారు మిమ్మల్ని రమ్మంటున్నారు. ఎవరో వచ్చారుట"

ఆమె కిందకి వచ్చింది. త్రిపురాంబ జస్టిస్ రంగనాథంగారి భార్యతో మాట్లాడుతోంది. ఆమె చిరునవ్వుతో నమస్కరించింది.

"కల్పనా! మిసెస్ రంగనాథంగారికి మీ అమ్మగారు కొన్న పచ్చలహారాన్ని చూపించు"

కల్పన తల వూపి తిరిగి గదిలోకి వచ్చింది.

హారంవున్న బాక్సుని బీర్వాలో నుంచి తీస్తుంటే ఆమె చేతులు వణికాయి.

"అత్తగారిని మెప్పించడానికి ఎన్ని అబద్ధాలు చెబుతోంది? శ్రీధర్ వచ్చాక పోయిన డబ్బు విషయంలో ఇంకా ఎన్ని అబద్ధాలు చెప్పాలో" ఆమె కిందకి వచ్చి మిసెస్ రంగనాథానికి ఆ హారాన్ని చూపించింది.

ఆవిడ దాని నాణ్యతను, పనితనాన్ని ముగ్ధురాలై చూస్తూ అంది. "సింప్లీ సుపర్బ్! ఎక్కడకొన్నారు? "

"చెన్నైలో" చిన్నగా చెప్పింది.

"మా వియ్యపురాలు చాలా సరదాలున్న మనిషి. ఎప్పుడు ఇక్కడకి వచ్చినా మా కల్పనకి ఏవేవో కానుకలను తెస్తూనే వుంటారు" చెప్పింది త్రిపురాంబ కోడలిని ఆపేక్షగా చూస్తూ.

గతంలో ఆవిడ ప్రశంసలకి కల్పన ఒళ్ళు పులకరించేది. ఇప్పుడు మొదటిసారిగా వెగటన్పిస్తోంది.

★ ★ ★

శ్రీధర్ మనసు దెబ్బతిన్న బెబ్బులిలా గాండ్రుమంటోంది. వరుణ్ ఎక్కడున్నా వెతికి పట్టుకుని పీకనొక్కి చంపెయ్యాలని వుంది. ఎంత నయవంచకుడు! ఎంత మోసగాడు! స్నేహితుడని నమ్మి వాడి ఫైనాన్స్ కంపెనీలో పార్ట్నర్‌గా వున్న తనని నమ్మించి ఇంత మోసం చేస్తాడా? ఇప్పుడెలా? ఏం చెయ్యాలి? అతనికి ఆలోచించే కొద్దీ పిచ్చెక్కేలా వుంది.

"ఏం చేద్దామండీ? " కల్పన నిస్సహాయంగా అడిగింది. చెయ్యడానికేముంది? వాడికి నేను డబ్బిచ్చినట్టు ఆధారం కూడా లేదు"

ఆ రాత్రి త్రిపురాంబ అతనితో చెప్పింది.

"నిన్ననే జస్టిస్ రంగనాథంగారి భార్య వచ్చి చెప్పింది. వాళ్ల కజిన్ బంజారాహిల్స్‌లో అతని ఫ్లాట్లు అమ్మేస్తున్నాడుట. వాటిని కొనాలనుకుంటున్నాను. నువ్వు సింగపూర్ వెళ్లావని, వచ్చాక చూసి చెబుతామని చెప్పాను"

"సరేనమ్మా!" అన్నాడతను ఎటో చూస్తూ.

"నిన్న డబ్బు అవసరమై బ్యాంకుకి వెళ్లాను. నువ్వు పాతిక లక్షలు, ఆరు నెలల కిందట డ్రా చేశావని మేనేజర్ చెప్పాడు. అంత డబ్బుతో నీకు అవసరమేమిటిరా? "

"అమ్మా! అది..." తల్లికి ఆ విషయం తెలుస్తుందని కాని, ఆవిడ తననింత హఠాత్తుగా అడుగుతుందని కాని ఊహించని శ్రీధర్‌కి ఏం జవాబివ్వాలో అర్థం కాలేదు. కొడుకులోని తత్తరపాటు త్రిపురాంబని ఆశ్చర్యపరిచింది. ఆవిడకి కొద్దిరోజుల క్రిందట తనకి వచ్చిన సంతకం లేని ఉత్తరం గుర్తుకొచ్చింది. "మీరు దొంగకి ఇనప్పెట్టె తాళం చెవులు ఇచ్చారు" అనే ఆ ఉత్తరంలోని వాక్యాలు గుర్తు రాగానే ఆవిడకి ఒక క్షణం కొడుకు మీద అనుమానం వచ్చింది. అంతలోనే ఎవరో గిట్టనివాళ్లు రాసిన ఉత్తరం ఆధారంగా కొడుకుని అనుమానిస్తోందేమిటాని సిగ్గుపడింది.

"నువ్వు రేపు ఆ ఫ్లాట్లు చూసి నీకు నచ్చితే మనం ఈ నెలాఖరుకి రిజిస్ట్రేషన్ చేసుకుందాం" అంది.




"అలాగేనమ్మా!" అన్నాడతను.

తరువాత కాస్సేపు ఫ్యాక్టరీ విషయాలు మాట్లాడింది. అతను నిరాసక్తతతో జవాబు నిచ్చాడు. కొడుకులోని ఈ మార్పు త్రిపు రాంబ దృష్టిని దాటిపోలేదు.

ఏదో జరిగిందనేది ఆవిడకి నిశ్చయంగా తెలుసు. కాని ఏం జరిగి వుంటుందో ఆవిడ ఊహకి అందలేదు.

ఆ రాత్రి అందరూ గాఢ నిద్రలో వున్న సమయంలో కల్పన, శ్రీధర్ మాత్రం నిద్ర పోలేదు. ఏం చెయ్యాలి అనే ప్రశ్న కల్పన కెదురుగా భూతమై భయపెడుతుంటే ఏం చెయ్యాలో అప్పటికే నిర్ణయించుకున్నాడు శ్రీధర్.

గోడవైపు తిరిగి పడుకున్న కల్పనని ఒక సారి చూసి అతను ఆ సాయంకాలమే తల గడ కింద దాచివుంచిన సీసాని తీసి మూత తెరిచి ఒక్కసారిగా నోట్లోకి వంపు కున్నాడు. పైకి ఎక్కి వస్తున్న మందుని బయటకి రానివ్వకుండా నోటికి చేతిని అడ్డుపెట్టుకున్నాడు. తరువాత తను అంత కుముందే రాసిన కాగితాన్ని షర్టు జేబులో నుంచి తీసి టేబిల్ పై కనిపించేలా పెట్టి బాల్కనీలోకి వెళ్లిపోయాడు.

సరిగ్గా రెండు నిముషాల తరువాత కల్పన నిద్రలోనే ఇటు తిరిగింది. పక్కన శ్రీధర్ తగలలేదు. ఆ సాయంకాలం నుంచీ భర్తలోని అలజడిని గమనిస్తున్న ఆమె మనసేదో కీడుని శంకించింది. ఆమె గభాల్న లేచి బయటకి రాబోయి ఆగింది. బాల్కనీలో అస్పష్టంగా కన్పించిన ఆకా రాన్ని భర్త అని గుర్తు పట్టి అతని దగ్గరకి ఆదుర్దాగా వెళ్లింది. అప్పటికే అతను కడుపు చేత్తో పట్టుకుని విలవిలలాడుతు న్నాడు. కల్పన మనశ్శరీరాలు క్షణం మొద్దుబారాయి. మరుక్షణం తెలివి తెచ్చు కుని ఒక్క పరుగులో మెట్లన్నీ దిగేసి మామగారి పడకగది తలుపులని దబదబ బాదింది.

"మామయ్యా!" ఆర్తనాదంలా వుందా పిలుపు. భయవిహ్వల స్వరంతో తలుపు తెరిచే వరకు అలా పిలుస్తూనే వుంది.

తలుపు తీసిన ఆయన ఎదురుగా శోక దేవతలా వున్న కోడలిని చూసి ఆశ్చర్యపో యారు.

"ఏమైంది" ఆయన అడగకముందే చెప్పింది.

"ఆయన విషం తాగారు మామయ్యా"

తలమీద పిడుగుపడినట్టు స్తంభించిపో యిన ఆయన "ఎక్కడ? శ్రీధర్ ఎక్కడ?" అని ఉద్వేగంగా అడిగారు.

"మేడమీద బాల్కనీలో" కూడబలుక్కుం టున్నట్టు చెబుతూనే స్పృహకోల్పోయింది.



రవి అలసటగా ఇంటికొచ్చాడు. శ్రీధర్‌కి ప్రాణాపాయం తప్పిందని డాక్టర్లు చెప్పాక కాని అతని మనసు స్థిమితపడలేదు. రాత్రంతా ఇ.సి.యు కెదురుగా వున్న

గ్లాసు డోర్ దగ్గరే అన్నగారిని చూస్తూ నిల బడ్డాడు. అతను స్పృహలోకి వచ్చాక పలు కరించి అతను మాట్లాడాక అప్పుడొచ్చాడు ఇంటికి.

కాని అన్నగారు ఆత్మహత్యా ప్రయత్నం ఎందుకు చేశాడన్నది అతనికి అంతుపట్ట డంలేదు. తనకి తెలిసున్నంతవరకు అత నికి చెప్పుకోదగిన సమస్యలేవీలేవు. తండ్రి హయాంలో అప్పులపాలయిన తమ కుటుంబం మళ్లీ నిలదొక్కుకునేలా చేసినది అన్నగారి వ్యాపార దక్షతేనని అతనికి తెలుసు. అతను ఆత్మహత్య నోట్‌లో "నా చావుకి ఎవరూ బాధ్యులుకారు" అని రాయడం రవికి ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది. అన్నగారి ఆత్మహత్యా ప్రయత్నం వెనుక నిగూఢమైన రహస్యమేదో వుందనిపించింద తనికి. అతను సాలోచనగా శ్రీధర్ గదిలోకి నడిచాడు.

గదంతా అంగుళం అంగుళం క్షుణ్ణంగా గాలించాడు. ఏమీ అనుమానాస్పదంగా కని పించలేదతనికి. చివరకి డ్రెస్సింగ్ టేబిల్ సొరుగులో కన్పించాయి ఆ రెండు ఉత్త రాలు. అతను వాటిని చదివి కొయ్యబారిపో యాడు. కల్పనని ఎవరో బెదిరిస్తూ రాసిన ఉత్తరాలవి. కింద సంతకం లేని ఆ ఉత్తరా లని చూడగానే అతని భ్రుకుటి ముడిప డింది.

ఎవరు రాసివుంటారీ ఉత్తరాలు? ఆలోచి స్తున్న అతని మనసు మూరుమూల పొరల లోనుంచి ఎవరో అరిచారు.

"స్రవంతి"

'అవును. స్రవంతే ఈ ఉత్తరాలని రాసింది. ఆ సునీత అనే పిల్ల ఏవేవో చెప్పి ఆమె మనసుని విరిచేసింది. తను కల్పక కంటే తక్కువ దాన్ని అనే ఆత్మన్యూనతతో నలిగిపోతున్న స్రవంతిలో కల్పనపట్ల అసూయ కలిగింది. ఆ అసూయతో ఆమె కల్పనకి ఈ ఉత్తరాలు రాసింది. అవమా నంతో శ్రీధర్ ఆత్మహత్యకి పాల్పడివుం టాడు'

రవి ఒళ్లు ఉద్రేకంతో వణికిపోతోంది. ఎంతకి తెగించింది స్రవంతి! సమయానికి వదిన చూడకపోతే అన్నయ్య మరణించి వుండేవాడు. అతని పిడికిళ్లు బిగుసుకుంటు న్నాయి. పళ్లు కరకరలాడుతున్నాయి. అతను ఆ ఉత్తరాలని జేబులో పెట్టుకుని తన బెడ్‌రూమ్‌లోకి వచ్చాడు.

అతనిలో ఆవేశం కట్టలు తెంచుకుం టోంది. కోపంతో మండిపడుతూ స్రవంతిని నిలదీసి అడగాలని, గదిలోనుంచి బయటకి రాబోతుండగా తలుపుల చప్పుడయ్యాయి. అతను అటుచూశాడు.

స్రవంతి కాఫీ కప్పుతో గదిలోకి వస్తోంది.

ఆమెని చూడగానే అతని రక్తం మరిగిపో యింది.

"కాఫీ..." ఆమె మాట పూర్తికాకుండానే ఆమె చెంప ఛెళ్ళుమనిపించాడు.

ఆ అదురికి ఆమె చేతిలోని కాఫీ కప్పు ఎగిరి దూరంగా పడి బద్దలయింది. భర్త ఎందుకు కొడుతున్నాడో అర్థంకాలేదు స్రవం తికి. ఆమె అయోమయంగా, భయంగా చూస్తూ అప్రయత్నంగా రెండడుగులు వెనక్కి వేసింది.

"రాక్షసీ! నిరాధారమైన అనుమానాలతో ఎవరో చెప్పినది నిజమని నమ్మి మా వది నని అవమానిస్తూ ఉత్తరాలు రాస్తావా?"

"ఉత్తరాలా? ఉత్తరాలేమిటి?" స్రవంతి తెల్లబోయింది.

"ఎంత బాగా నటిస్తున్నావ్? ఈ ఉత్త రాలు రాసినది నువ్వేకాదూ? ఇవి చదివే కదూ మా అన్నయ్య అవమానం భరించ లేక ఆత్మహత్య చేసుకోబోయాడు. అతనా మెపైకి ప్యాంటు జేబులోనుంచి ఉత్తరాలను




తీసి విసిరేసాడు.

ఆమె ముడివడిన భ్రుకుటితో అయోమయంగా ఆ ఉత్తరాలని చదువుతోంది.

"నేను ఈ ఉత్తరాలను రాయలేదండీ" కళ్ళలో నీళ్ళూరుతుండగా అర్థంకాని అతని అభియోగాన్ని తట్టుకోలేక అంది.

మరోసారి బలంగా ఆమె చెంపపై కొట్టాడు. "ఇంక నటించకు. నీకు మా వదినని చూస్తే అసూయ. ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్సుతో బాధపడుతున్నావు నువ్వు. ఆ సునీత మాటలని నమ్మి నాకు మా అన్నయ్యమీద లేనిపోనివి చెప్పి మా అన్నదమ్ముల మధ్య కలతలని సృష్టించాలనుకున్నావు. అది సాధ్యపడకపోయేసరికి మా వదినకి పిచ్చిపిచ్చి ఉత్తరాలు రాసావు. నువ్వేం చెయ్యబోయావో తెలుసా? మా అన్నయ్య చావుకి కారకురాలివి కాబోయావు"

"మీ అన్నయ్య ఆత్మహత్య చేసుకోబోడానికి కారణం నేనుకాదు. మీకెవరికీ ముఖ్యంగా మీ అమ్మగారికి కూడా తెలియకుండా ఆయన స్నేహితుడు వరుణ్ పెట్టిన ఫైనాన్స్ కంపెనీలో డబ్బు పెట్టడం, వరుణ్ డబ్బుతో పరారీ అయిపోవడం అసలు కారణం" అంది స్రవంతి కన్నీళ్ళు తుడుచుకుంటూ రోషంగా.

"మళ్ళీ అదేమాటా" రవి రౌద్రంగా అరిచాడు.

"ఛీ! నువ్వసలు మనిషివేనా? నీ అసూయతో అన్నయ్య మరణానికి కారకురాలివి కాబోయావు. అసలు నిన్నని ప్రయోజనం ఏముందిలే? ఇదంతా మా నాన్నగారు చేసారు. మా అంతస్తుతో ఏమాత్రం సరితూగని నిన్ను ఈ ఇంటికోడలిని చేసారు. ఆయన మాట విని నిన్ను పెళ్ళిచేసుకోవడం నేను చేసిన పెద్ద తప్పు. వెళ్ళిపో నీకీ ఇంట్లో స్థానంలేదు. మా ఇంట్లోంచేకాదు నా జీవితంలోనుంచి వెళ్ళిపో"

స్రవంతి కళ్ళలో వేటగాడి బాణానికి విలవిలలాడుతున్న పక్షి బాధ కనిపించింది.

"మీకు నాపై నమ్మకం లేదు కదూ? "

"కలలో కూడా నిన్ను నమ్మను" నిరసనగా అన్నాడు.

"నేను మీ భార్యని! మీరు నా జీవితాంతం తోడు, నీడగా వుంటారనే నమ్మకంతో మీ చేతిని అందుకుని ఈ ఇంటికోడలిగా వచ్చాను.

"కాని, ఈ ఇంట్లో నాకు అడుగడుగునా అవమానాలు అవహేళనలే ఎదురయ్యాయి.

"అయినా మీరు నా వారు అనే భ్రమతో అన్నింటినీ సహించాను

"కాని, మీ మనసులో నాపై ఇంత చులకన భావం వుందని ఇప్పుడే తెలుసుకున్నాను.

"మీరు కొట్టినది నన్నుకాదు, నా వ్యక్తిత్వాన్నే చావుదెబ్బ తీశారు.

"ఆడపిల్ల అత్తింటి గడపలో కాలు పెట్టాక మళ్ళీ చచ్చిపోయాక మాత్రమే గడప దాటుతుంది. కానీ నేను వ్యక్తిగా ఈ ఇంట్లో చనిపోయి ఈ ఇంటి గడపను దాటుతున్నాను. నా వ్యక్తిత్వానికి విలువలేని ఈ ఇంట్లో నేను బతకలేను"

స్రవంతి సూట్‌కేసులో తన బట్టలని పెట్టుకుని పూనకం వచ్చిన దానిలా మెట్లన్నీ దిగేసి కిందకి వచ్చింది.

హాలులో కూర్చున్న మాధవరావుగారు, త్రిపురాంబ తమ మధ్య జరిగిన వాగ్వివాదాన్ని విన్నారని వాళ్ళ ముఖాలే చెబుతున్నాయి. ఆమె వాళ్ళని ఒకక్షణం చూసి ముఖం తిప్పుకుని ముందుకి నడిచింది.

"స్రవంతీ! తొందరపడకమ్మా!" ఆదుర్దాగా ఆమె వెనుకే వస్తూ అన్నారు మాధవరావుగారు.

"నన్ను క్షమించండి మామయ్యగారూ! నా వ్యక్తిత్వానికి విలువలేని ఈ ఇంట్లో

నేను వుండలేను" అని ముందుకి నడిచింది.

"అబ్బో వ్యక్తిత్వం! పూటకి రికానాలేని వాళ్ళకి వ్యక్తిత్వం ఒకటి. మొగుణ్ణి వదిలి పుట్టింటికి వెళ్తే అమ్మ, అబ్బా కూచోపెట్టి దీనికి అన్నం పెడతారనుకుంటోంది" త్రిపు రాంబ తృణీకారంగా అంది.

"నోర్ముయ్" ఈడ్చి ఆవిడ చెంపపై కొట్టారు మాధవరావు.

క్షణకాలం చెంపపట్టుకుని శిలాప్రతిమలా నిలబడిపోయిన ఆవిడ మరుక్షణం తేరు కుని కోపంగా అరిచింది.

"నన్ను కొడుతున్నారా? "

"అమ్మనెందుకు కొట్టారు? " రవి ఒక్కం గలో వచ్చి తల్లిని పొదివిపట్టుకుని తండ్రి వైపు కోపంగా చూస్తూ అడిగాడు.

"ఏ పాపమూ ఎరుగని నీ భార్యని కొట్టి, ఆమెపై లేని నిందలువేసి ఇల్లు విడిచిపో యేలా చేశావు! ఇంతమందిని బాధపెట్టిన నా భార్యని నేను కొట్టకూడదా? "

"అది ఏం చేసిందో, దాని ఆలోచనలే మిటో మీకు తెలియవు నాన్నగారూ!"

"అవన్నీ తెలుసుకోడానికి ప్రయత్నించ నిది నువ్వేరా. స్రవంతి ఏమిటో, ఈ ఇంట్లో ఎవరు ఎలా ప్రవర్తిస్తున్నారో, ఏం చేస్తు న్నారో అన్నీ నాకు తెలుసురా" అంటూ ఆ ఉత్తరాలు తనే రాసినట్టూ, అయినా అవి అందుకున్న వ్యక్తుల్లో మార్పు రానట్టూ.

లక్షలాది రూపాయలు ఫైనాన్స్ కంపె నీలో పెట్టి శ్రీధర్ మోసపోయిన సంగతి తన కీమధ్యనే తెలిసినట్టూ చెప్పారు మాధవరా వుగారు.

వింటున్న రవి, త్రిపురాంబ నిశ్చేష్టుల య్యారు.

"అన్ని విషయాలూ సమయం వచ్చిన ప్పుడు అందరిముందూ చెప్పి శ్రీధర్‌ని నిల దీద్దామనుకున్నాను. కానీ అంతలోనే వాడిం తపని చేస్తాడనుకోలేదు. పోనీలే కళ్ళ ముందే చెట్టంత కొడుకు మరణిస్తే అది జీవితాంతం మనకి తీరని వ్యధగా మిగి లేది. అక్కడికి అదృష్టవంతులు. ముందు స్రవంతి సంగతి చూడండి" అన్నారాయన.

"ఏమండీ" త్రిపురాంబ ఏడుస్తోంది.

"నువ్వు కట్నంతేలేని కోడళ్ళని కిరసనా యిలు పోసి కాల్చి చంపే గయ్యాళి అత్తగా ర్లకి ఏమాత్రం తీసిపోలేదు త్రిపురా. కల్పన ముందు స్రవంతిని ప్రతి చిన్న విషయానికి అవమానిస్తూ నీ మాటలతో ఆమెని మాన సికంగా కాలుస్తూనే వున్నావు. కానుక అంటే సంతోషంగా ఇచ్చేది. పీడించి పుచ్చు కునేదికాదు. ఆశించేదికాదు. ఆశీస్సులతో ఇచ్చేది. అయినా ఇంకా ఇతరులనుంచి కానుకలను ఆశించే స్థితిలో వున్నావా నువ్వు? " అన్నారు మాధవరావుగారు.

త్రిపురాంబ ఏడుస్తూనే ఉంది. అన్నగారి నిర్వాకం విని నిశ్చేష్టుడయ్యాడు రవి.

అతని ముఖం రకరకాల భావాల సమ్మి శితంగావుంది. స్రవంతిని ఎంత చులకనగా మాట్లాడాడు? నిజమే. తను కొట్టినది ఆమె నికాదు. ఆమె వ్యక్తిత్వాన్ని చావుదెబ్బకొ ట్టాడు. ఎందుకంత తొందర పడ్డాడు? తన వివేకం ఏమయిపోయింది? తనిలా పశు వులా ప్రవర్తించాడేం? "

"వెళ్ళు రవీ! నీ భార్యని ఇంటికి తీసు కురా"

దడదడలాడుతున్న గుండెలతో బయ టకు దూకాడు రవి.

★ ★ ★

రైల్వే స్టేషన్... ప్రయాణీకులతో హడా వుడిగా వుంది. రవి స్రవంతిని వెతుకుతూ వేగంగా నడుస్తున్నాడు. అతని శరీరం ఉద్విగ్నతతో కంపిస్తోంది. గుండెకొట్టుకొం టున్న శబ్దం పైకే విన్పిస్తోంది.

'స్రవంతి కన్పిస్తుందా? మళ్లీ తన ఇంటికి వస్తుందా? ' అతను అక్కడంతా కళ్ళతోనే




వెతుకుతూ పరుగులాంటి నడకతో ప్రయాణీకుల మధ్యనుంచి వెళ్తున్నాడు. వెనకాల తల్లి వస్తున్నది లేనిది కూడా గమనించ లేదు. కాస్త దూరంలో బెంచీమీద కూర్చున్న స్రవంతి కనిపిస్తోంది. ఎటో చూస్తున్న ఆమె రవి రాకను గమనించలేదు.

"స్రవంతీ!" రవి గుండె గొంతులోకి వచ్చింది. ఆమె ఒకసారి అతన్ని చూసి మళ్లీ తలతిప్పుకుంది. "నన్ను క్షమించు స్రవంతీ!"

ఆమె జవాబివ్వలేదు. కనీసం తలతిప్పి అతన్ని చూడలేదు.

"నేను నిన్ను ఘోరంగా అవమానించాను. నన్ను క్షమించి ఇంటికిరా" ఆమె లేచి నిలబడింది. అతని కళ్ళలోకి సూటిగా చూస్తూ అడిగింది.

"వ్యక్తిగా ఓడిపోయిన నేను ఆ ఇంట్లో మీ భార్యగా బతకగలనా? " "పెళ్ళిలో నీ తల మీద జీలకర్రా బెల్లం వుంచి ధర్మేచ, అర్థేచ, కామేచ, నాతిచరితవ్యా నాతి చరామి అని పురోహితుడు చెప్పమన్న మంత్రాలని అప్ప చెప్పానే తప్ప నాకా మంత్రాల అర్థం తెలియదు. కాని వివాహం అంటే స్త్రీ పురుషుల జీవితాలను ముడివేసేది మాత్రమే కాదు. ఒకరి వ్యక్తిత్వాలను మరొకరు గౌరవించుకుంటూ ఒకరి విలువలని మరొకరు కాపాడుకోవలసిన పవిత్రమైన బాధ్యత అని నేను ఆలస్యంగానైనా తెలుసుకోగలిగాను. నీ వ్యక్తిత్వాన్ని కాపాడుతానని ఇప్పుడు ప్రమాణం చేస్తున్నాను" అతని స్వరం నమ్మిస్తున్నట్టు లేదు. నమ్మకం ధ్వనిస్తోంది.

స్రవంతి అతనిలో వచ్చిన ఈ మార్పుకి ఉక్కిరిబిక్కిరవుతోంది. "అమ్మా స్రవంతీ! నువ్వు నా ఇంటి కోడలిగా మా గడపలో అడుగు పెట్టినప్పుడు నీపై వ్యతిరేకతనే చూపించాను. ఇప్పుడు నిన్ను మనస్ఫూర్తిగా ఆహ్వానిస్తున్నాను. నన్ను క్షమించి మన ఇంటికి రామ్మా" అంది త్రిపురాంబ.

"అంత మాట అనకండత్తయ్యా" అంది స్రవంతి ఆవిడ చేతిని పట్టుకుంటూ.



వర్షా,

వివాహాలు స్వర్గంలో జరుగుతాయి. కాని వివాహబంధాన్ని నిలబెట్టుకునే ప్రయత్నం మాత్రం ఈ భూమిమీదే చెయ్యాలంటాడు ఒక రచయిత. మన పెళ్ళి స్వర్గంలో జరిగిందో లేదో నాకు తెలియదు కాని దాన్ని నిలబెట్టుకోనివ్వకుండా డబ్బు మన మధ్య ఇనుపతెరలా నిలిచింది. నిజమే వర్షా! నువ్వన్నట్టు నేను నీకు తగినవాడిని కాను. మీరు ఇచ్చిన ఖరీదైన కానుకలని అందుకునే అర్హత నాకులేదు. మీరు నాకు ఇచ్చిన కానుకలవిలువ ఎంతో కూడా నాకు తెలియదు. అందుకే ఈ ఉత్తరంతోబాటు లక్షరూపాయలకి చెక్ పంపుతున్నాను. నేను నీకు ఇంకా ఏమయినా బాకీ పడితే తెలియచెయ్యి. వీలయినంత తొందరలో ఇచ్చేస్తాను. -ధీరజ్

ఆ ఉత్తరాన్ని చదివి వ్యంగ్యంగా నవ్వింది వర్ష. "మొత్తానికి పౌరుషవంతుడే. లక్ష రూపాయలకి చెక్ పంపాడు" అంటూ ఆ ఉత్తరాన్ని తల్లికిచ్చింది. ఆమె కూడా ఆ ఉత్తరాన్ని చదివి అంది.

"ఏం అమ్మి డబ్బు పంపాడో! లక్ష రూపా

యలు! చిళ్ళ పెంకులు కావు"

"వాడిని నడిబజారులో నిలబెట్టి వేలం వేసినా అంత డబ్బురాదు" అంది వర్ష. అప్పుడే కారు దిగి లోపలకి వస్తున్న తండ్రిని చూడగానే వర్ష ఉత్సాహంగా అంది.

"మీకో గుడ్‌న్యూస్ నాన్నగారూ! ధీరజ్ లక్షరూపాయలు పంపాడు"

ఆయన ముడివడిన భ్రుకుటితో భార్యవైపు చూశాడు.

"అర్థం కాలేదా? మనం పెళ్ళిలో పెట్టిన కానుకలకి విలువకట్టి డబ్బు పంపాడండీ, అసలు వాడికి అంత డబ్బు ఎక్కడదం టారు? "

శివశంకరం భార్య దగ్గరకి నడిచి చెయ్యెత్తి విసురుగా ఆమె చెంపని ఛెళ్ళుమనిపించాడు.

వరలక్ష్మి కొయ్యబారిపోయి చెంప పట్టుకుని శిలలా నిలబడిపోయింది. వర్షకైతే నోటమాట రాలేదు. తేరుకున్న వరలక్ష్మి ఆగ్రహంతో వణికిపోతూ అడిగింది.

"నన్నెందుకు కొట్టారు? "

"పరాయి ఆడపిల్ల అయిన వర్షని కొట్టలేక"

"నన్ను కొట్టడానికి నేనేం తప్పుచేశాను" రోషంగా అంది వర్ష.

"నువ్వు తప్పుచెయ్యలేదమ్మా! తప్పంతా నాది. డబ్బు అహంతో కళ్ళుమూసుకుపోయిన నిన్నూ, డబ్బుకి తప్ప మనుషులకి విలువనివ్వని మీ అమ్మని ఇన్నాళ్ళూ సపోర్టు చేశాను చూడు, అదే నేను చేసిన తప్పు. ఇప్పుడా తప్పుని దిద్దుకోవాలనుకుంటున్నాను. లక్ష్మీ! వెళ్ళు. వర్ష బట్టలవీ సర్దు. దాన్ని అత్త వారింట్లో దింపుదాం"

"నేను వెళ్ళను. నాకు ధీరజ్‌నుంచి విడాకులు కావాలి"

"అవేమీ విస్తరాకుల్లాంటివి కావమ్మా బజారులో కొనుక్కోడానికి. పెళ్ళయిన రెండు నెలలకే భర్తనుంచి విడిపోడానికి నీకేకష్టం వచ్చింది"

"మీకు తెలియకే అడుగుతున్నారా? "

"అర్హతలేని వాళ్ళని అందలం ఎక్కించామని బాధపడుతుంటే అమ్మాయిని అత్తవారింట్లో దింపుదామంటారేమిటండీ! అసలది ఇల్లా? ఆ ఇంట్లో వర్ష ఒక్కనిముషం వుండలేదు"

"నువ్వు నోర్ముయ్! నేను వర్షతో మాట్లాడుతున్నాను. వర్షా! నువ్వు బయలుదేరు. ధీరజ్ హాస్పిటల్‌లో వున్నాడు"

"ఏం? ఏ మాయరోగం వచ్చిందిట? "

అతను కూతుర్ని కొన్ని క్షణాలు తదేకంగా చూసి అన్నాడు.

"ధీరజ్ నీకెలా డబ్బు పంపాడనుకున్నావ్? కిడ్నీ అమ్మేశాడు"

కొన్ని క్షణాలు ఆ గదిలో గాఢమైన నిశ్శబ్దం.

"మీకెలా తెలుసు? " వరలక్ష్మి నిర్వేరపాటుగా అడిగింది.

"శ్రీధర్ హాస్పిటల్‌లో వున్నాడని మీ నాన్నగారు చెప్పారు. నేను అతన్ని చూద్దామని వెళ్ళాను. అదే హాస్పిటల్‌లో ధీరజ్ కూడా వున్నాడు"

"శ్రీధర్ హాస్పిటల్‌లో వుండడమేమిటండీ"

"శ్రీధర్ ఆత్మహత్యకి ప్రయత్నించాడుట" అంటూ జరిగినదంతా చెప్పాడు.

వరలక్ష్మి కొయ్యబారిపోయింది.

"వర్షా? డబ్బులేనివాడనేగా ధీరజ్‌ని కాదనుకున్నావ్! మా ఆస్తి అంతా మాకు ఒక్కగానొక్క కూతురివైన నీది కాదా? వెళ్ళమ్మా! ధీరజ్ దగ్గరకి వెళ్ళు. ఈ తండ్రికి కూతురిగా కాదు, అతని భార్యగా బతుకు"

"మీరు ఇచ్చే ఆస్తి నాది. నా భర్తకెలా చెందుతుంది? ఆస్తి అంతస్తు ఏమీలేని ఆ నిర్భాగ్యుడితో కలిసి నేను బతకలేను. నేను ధీరజ్‌నుంచి విడిపోడానికే నిశ్చయించుకున్నాను" వర్ష తెగేసి చెప్పి లోపలకి వెళ్ళిపోయింది.

వరలక్ష్మి, శివశంకరం అప్రతిభులయ్యారు.







# చతుర ప్రపంచం

## అందరూ అబద్ధాలు చెప్పేవారే...

'సత్యమునే పలకవలెను, అబద్ధము ఆడరాదు'

ఎప్పుడో చిన్నప్పుడు నేర్చుకున్న పాఠాలవి. కానీ వాస్తవంలో అబద్ధాలు చెప్పనివారు ఎవ్వరూ ఉండరట. ప్రతి వ్యక్తీ ఎప్పుడో ఒకప్పుడు అబద్ధాలు చెప్తారట.

ఈ విషయం మీద వర్జీనియా యూనివర్సిటీ ఓ పరిశోధన నిర్వహించింది. దీనికి బెల్లాడీపాలో అనే సైకాలజిస్ట్ నేతృత్వంలో ఈ పరిశోధన జరిగింది.

కాలేజీలో చదివే వారి నుంచి డెబ్బై ఏళ్ల వృద్ధులవరకు వివిధ రకాల వయసు వాళ్లని ఈ పరిశోధనకు ఎన్నుకున్నారు. మొత్తం నూటయాభై మంది మీద వారు చేసిన పరిశోధనలో చాలా ఆసక్తికరమైన అంశాలు వెలుగు చూశాయి. ఓ వారం రోజులపాటు తాము రోజూ మాట్లాడిన మాటలు, వాటిలో నిజాలెన్ని, అబద్ధాలెన్ని అంతా వివరంగా రాసి ఇచ్చారట వీరు.

ఈ నూట యాభై మంది రాసిచ్చినవి చూశాక బెల్లాడీపాలో ఓ నిర్ణయానికి వచ్చారు. అదేమంటే ప్రతి వ్యక్తీ రోజుకి కనీసం రెండు అబద్ధాలైనా చెప్తారట.

అబద్ధాలు చెప్పాల్సిన అవసరమేంటి? అనే ప్రశ్నకూడా మనసులో కలగకపోదు. దీనికి జవాబేంటంటే ప్రతివారు తమని తాము మంచిగా, దయార్ద్ర హృదయులుగా, తెలివి గలవారుగా ప్రొజెక్ట్ చేసుకోడానికే ఎక్కువగా అబద్ధాలు చెప్తున్నారట. ఇంకా పిల్లల అల్లరి మాన్పించడానికి, హోంవర్కు చేయించడానికి వాళ్లు అడిగిన హిరణ్యాక్షవరాలన్నీ తీరుస్తానని అబద్ధాలు చెప్తున్నారట తల్లితండ్రులు.

బట్టల కొట్లలో పనిచేసే సేల్స్‌బాయ్స్, సేల్స్‌గాళ్స్ ఒకవిధంగా ఎక్కువగా అబ



ర్థాలు చెప్తారట. ఫలానా డ్రస్‌మీకు చాలా బాగుంది. ఈ కలర్ మీకు బాగా నప్పింది. ఈ డ్రస్‌లో మీరు చాలా బావున్నారు అని చెప్తూ సదరు డ్రస్ అమ్ముడు పోవడం కోసం ఎదుటివ్యక్తికి సూట్ అయినా కాక పోయినా బాగుందని అబద్ధం చెప్పేస్తారట.

మరి రాజకీయ నాయకులు! ఆ సంగతి అడగకండి అని బెల్లాడీపాలోనే అంటున్నారు. మరి ఆమె నేతృత్వంలో ఈసారి వారిమీద పరిశోధన జరుగుతుందేమో చూడాలి.

---

## పెట్... గ్రీటింగ్ కార్డులు

కుక్క బిస్కెట్ల గురించి మనకి తెలుసు. కానీ ఈ కుక్క గ్రీటింగ్ కార్డుల సంగతేంటి? అంటే బహుశా కుక్కలు, పిల్లుల బొమ్మలు ముద్రించి తయారుచేసిన గ్రీటింగ్ కార్డులేమో? అని అనుకుంటున్నారా? అయితే మీరు పొరబడినట్టే. ఇవి పెట్ యానిమల్స్ బొమ్మలతో డిజైన్ చేసిన కార్డు కాదు. వీరికోసం రూపొందించిన ప్రత్యేక హ్యాపీ న్యూ ఇయర్ అని చెప్తే దీనికేం అర్థం అవుతుంది. అదిగో ఈ ఇబ్బందిని అర్థం చేసుకుంది ఓ థాయ్ కంపెనీ. ఇంకేముంది వాటికోసం 'ఈటబుల్ గ్రీటింగ్ కార్డ్స్' పేరిట ప్రత్యేకంగా గ్రీటింగ్ కార్డులు రూపొందించి విడుదల చేసింది.

అంటే ఇకనుంచి మీ డాగ్ పుట్టిన రోజుకో, న్యూఇయర్‌కో ఓ ఈటబుల్




మైన కార్డు.

ఇప్పుడు మన ఇంట్లో ఓ కుక్కపిల్ల ఉందనుకోండి. బంధువులు, మిత్రులు మనతో పాటు దీనికి కూడా విషెస్ చెప్తారుకదా! కానీ ఎలా చెప్తారు? దీని దగ్గరకువెళ్లి గ్రీటింగ్ కార్డు ప్రజెంట్ చేసేస్తే మీ కుక్కగారు బహు సంతుష్టులైపోతారు. ఈ కార్డు తీసుకువెళ్లి దీనిముందు పెడితే చాలు అది చక్కగా కార్డుని ఆప్యాయంగా నాకి కొరికి తినడంద్వారా మీ సందేశాన్ని అందుకుంటుంది. మరో విషయం ఏంటంటే ఒకసారి కార్డు రుచిచూసిన కుక్కలు తామే పోస్టాఫీసుకు వెళ్లి పోస్ట్‌మా




న్ని చూడగానే తోకలూపుతున్నాయట. అవును మీ వూహ నిజమే. తమకి కార్డ్స్ ఏమైనా వచ్చాయేమో కనుక్కునేందుకే అవి వెళ్తోంది. ఏదిఏమైనా థాయ్ కంపెనీవారి ఆలోచన బేషుగ్గా ఉందని శునక జాతంతా తీర్మానించేసింది.

---

## గిన్నిస్‌లో బల్బ్?

బల్బులు సాధారణంగా ఎన్ని రోజులు వెలుగుతాయి? సమాధానం చెప్పడం కష్టంకదూ! ఎందుకంటే కొన్ని సార్లు ఇలా కొత్త బల్బ్ పెట్టగానే అలా టప్‌మని మాడిపోవచ్చు. మనం కోరుకున్నట్టుగా పదికాలాలపాటు వెలిగే బల్బులు తయారుచేస్తే సదరు కంపెనీలన్నీ దివాళా తీయాల్సిందే. అయితే ఓ బల్బ్... అవును అతి సాధారణమైనదీ ఎటువంటి ప్రత్యేకతలు లేనిదీ అయిన ఓ






బల్బ్ త్వరలో గిన్నిస్‌బుక్‌లో స్థానం సంపాదించబోతోంది.

మరి ఆ బల్బ్ కథాకమామిషు ఏమిటంటే...

తూర్పు ఇంగ్లాండ్‌లో ఇప్స్విచ్ అనే ఓ పట్టణం ఉంది. అక్కడ ఓ ఎలక్ట్రిక్ షాపులో ఓ బల్బు ఉంది. అది 25 వాట్స్ బల్బ్. మరి ఈ బల్బ్‌గారి రికార్డు ఏమిటంటే ఇది గత డెబ్బై సంవత్సరాలుగా అవును ఒకటికాదు రెండు కాదు గత డెబ్బై ఏళ్లుగా నిరాఘాటంగా వెలుగుతూనే ఉంది. అలాగని దీనిని ఏదైనా స్పెషల్ టెక్నాలజీతో తయారు చేశారా అంటే అలాంటిదేం లేదు. ఇలా ఒక బల్బ్ ఏడు పదుల ఏండ్ల పాటు వెలుగుతుండటం రికార్డు కాబట్టి షాపు వారు ఆ బల్బ్‌కి గిన్నిస్‌బుక్‌లో స్థానం కల్పించాలని కోరుతున్నారు. ప్రస్తుతం ఆ విషయం పరిశీలనలో ఉంది. ఒకవేళ వారు గనుక ఒప్పుకుంటే బల్బ్‌కి, దీంతో పాటు షాపు యజమానికి కూడా పేరొచ్చేస్తుందన్నమాట. ఇంకో విషయమేమిటంటే ఆ షాపుకి వచ్చేవారు ముందుగా ఆ బల్బ్‌నే చూస్తారట. కొందరైతే కేవలం అందుకోసమే వస్తారుట.

☆

# చతుర కతలు

## నామోషి

"ఏమిటే భూలక్ష్మీ... యమస్పీడుగా పనులుచేసేస్తున్నావ్... ఏదో విశేషం ఉన్నట్లుందే?" ఆశ్చర్యపోతూ అడిగింది అరుంధతమ్మ.

"అబ్బే... ఏం నేదమ్మగారూ... మామూలుగానే సేస్తన్నాగదా..." అంది చేతిలోని అంట్లగిన్నెని చకచకా తోముతూనే.

చేస్తుంటారు. చదువూ సంధ్యా లేకపోయినా మంచి హుషారైన పిల్ల భూలక్ష్మి. అల్లనేరేడు పండులా నిగనిగలాడుతూంటుంది. నలుపన్న మాటేగానీ ముక్కూ, ముఖం చూడ చక్కగా వుంటాయి.

"పాతికేళ్ళు పైబడుతున్నా పెళ్ళి చెయ్యావే




"ఏమీ లేకపోవడం ఏమిటి. నీ సంగతి నాకు తెలీదూ. ఏదో అవసరముంటేనే గదా ఇంత స్పీడుగానూ, శుభ్రంగానూ పనులు చేస్తావ్?" దేనికో టెండరు పెట్టబోతోందనుకుంటూ అంది అరుంధతమ్మ.

శ్రీకాకుళం దగ్గర ఏదో పల్లెటూరు ఈ పనిమనిషిది. చేసుకోవడానికి పనులేమీ దొరక్క పొట్టచేత్తో పట్టుకొని ఈ పక్కకొచ్చేశారు. తండ్రి రిక్షా తొక్కుతాడు. ఆ వచ్చిన డబ్బుల్తో తప్ప తాగుతాడు. ఇల్లు గడవడం కోసం తల్లీకూతుళ్ళిద్దరూ పదిళ్ళల్లో పనులు

మిటే..." అంటే,

"ఏటి సెయ్యమంతారమ్మా. అనాకానీ సంపాదన తేనోడు కూడా ఏలుకావాలంతన్నాడు. తిండికే నేకపోతే ఏలు నాసెక్కడ తెచ్చేది" అంటుంది భూలక్ష్మి తల్లి.

"పెళ్ళికేటి తొందరొచ్చినాదమ్మా..." అంటూ సిగ్గుపడుతుంది భూలక్ష్మి ముసిముసినవ్వులు నవ్వుతూ. అలా నవ్వుతున్నప్పుడు బుగ్గలమీద సొట్టలుపడి మరీ ముచ్చటగా వుంటుంది భూలక్ష్మి.

"అమ్మగారూ..." భూలక్ష్మి పిలుపుకి ఆలోచనల్లోంచి బయటకొచ్చింది అరుంధతమ్మ.

"ఏమిటే... చెప్పు" అంది ఆవిడ.

"ఇయ్యాల ఇజియా తాకీసులో సిరంజీవి బాబు సినిమావచ్చినాది. మద్దానమాటకి ఎల్లుదారని. పైసలిప్పించడమ్మగారూ..." న్యాయమారుతున్నట్టుగా అడిగింది భూలక్ష్మి.

"ఇందాకనే అన్నానుగా. నీ వేషాలు నాకు తెలియవా. సరే... డబ్బులిస్తాగానీ సాయంత్రం వేళ పనికిమాత్రం ఎగనామం పెట్టకు" అని లోపలికి వెళ్ళి ఓ పదికాగితం తెచ్చి భూలక్ష్మి చేతిలో పెట్టింది.

నెలసరి జీతం కాకుండా మధ్యమధ్య యిలాంటి 'టిప్స్' ఇస్తుంటేకానీ పనివాళ్ళు చెప్పినమాట వినరనేది ఆవిడ అనుభవం.

"దండాలమ్మగోరూ..." అంటూ హుషారుగా బయటకు వెళ్ళిపోయింది భూలక్ష్మి.

★ ★ ★

ఆపసోపాలు పడుతూ రెండుచేతుల్లోనూ కూరగాయలు, వెచ్చాలు వున్న సంచుల్తో సిటీబస్సు ఎక్కింది అరుంధతమ్మ. బస్సులో రద్దీ లేకున్నా కూర్చోవడానికి సీటులేదు. సీటులేమన్నా ఖాళీగా వున్నాయేమోనని పరికించి చూసింది. వెనకాల సీటులో భూలక్ష్మి కూర్చుని వుంది. దాని పక్కన ఒకే ఒక్క సీటు ఖాళీగా వుంది. తననిచూసి పలకరింపుగా నవ్వింది. "దానిపక్కన కూర్చోవడమా... మానడమా..." అనుకుంటూ సందిగ్ధంలో పడింది అరుంధతమ్మగారు. "ఆ వెనకాల సీట్లో కూర్చోండమ్మా" అన్నాడు కండక్టరు టికెట్ చింపుతూ. దగ్గర కెళ్తే తను లేచి సీటిస్తుందేమోలే... అనుకుంటూ అటుగా నడిచింది.

చూసి నవ్వుతోందేగానీ లేచే ప్రయత్నం ఏమీ చెయ్యడంలేదు భూలక్ష్మి. పంజాబీ డ్రస్సులో నల్లకలువలా వుంది. "అదెవరో తనకి తెలుసుకానీ, ప్రయాణీకులకెవరికీ తెలీదు కదా. కూర్చుంటే పోలా..." అనుకున్నా పనిమనిషి పక్కన కూర్చోవాలంటే ఏదో భేషజం అడ్డొస్తోంది. ఆలోచిస్తూ అలాగే నిల్చుండిపోయింది.

"సీటు ఖాళీగా వుందిగా కూర్చోండి" ఎవరో అంటున్నారు.

"తనకు లేని బాధ వీళ్ళకెందుకో..." మనసులోనే అన్నవాళ్ళమీద చిరాకుపడింది.

వచ్చి కూర్చోమన్నట్టుగా కాస్త పక్కకి జరిగిందేగానీ సీట్లోంచి మాత్రం లేవడంలేదు భూలక్ష్మి.

"అదేంటి అమ్మగోరూ... నా పక్కన కూచోడానికి ఆలోచిత్తన్నారు. పనిమనిషనా..." సాగదీసుకుంటూ అంది భూలక్ష్మి.

'దీని ముఖం ఈడ్చా... నలుగురిలో పరువుతీసేలా వుందే' మనసులో అనుకుంటూ "అబ్బే... అదికాదే..." అంది పైకి అరుంధతమ్మగారు.

"ఏది కాదు. మరి కూసోమంటే కూసోరే. అయినా అమ్మగోరూ... మూడుగంటల పాటు అయ్యగోరు నా పక్కన కూసోని పిచ్చిరీ సూసినారుగందా... ఆరికి లేని నామోసీ మీకెందుకు కూసోండి" అంది భూలక్ష్మి.

"ఆ..." అంటూ భూలక్ష్మి పక్కనే ధభీమని కూలబడింది అరుంధతమ్మ.

**–సూరిపండు**

---

## అడ్వాన్సు

"ఒరేయ్ చెప్పేది నీకేగాని గొడ్డుక్కాదు. మాట నమ్మకానికే కాదు, ప్రోనోట్లు రాతలకు కూడా అప్పిచ్చే రోజులకు నూకలు చెల్లిపోయాయి. స్థిరాస్తులు, బంగారం, వెండి మాత్రమేగాదు, చివరికి పెన్షను పుస్తకం, రేషను కార్డు ఏదో ఒకటి తాకట్టు పెట్టందే అప్పెట్టటం లేదెవరూ. నీ దగ్గిరేం వుంది గోచి పాత తప్ప. ఇహ దయచెయ్" అంటూ వ్యవసాయ కూలీ వెంకన్నకు పాఠం వల్లె వేశాడు, వడ్డీలకి డబ్బులు తిప్పే కిరాణా దుకాణం బంగారయ్య.

'డబ్బు మదంతో కన్నూమిన్నూ కానడం లేదు. ఎన్నయినా కూస్తాడు, మాలచ్మిని



పోగేశాడు కాబట్టి' అనుకున్నాడు వెంకన్న.

చరచరా వెళ్లిపోయి పావుగంటలో తిరిగొచ్చాడు.

వాడిని చూసి బంగారయ్య మొహం ఎర్రబడింది. తిట్టబోయి, వెంకన్న సంచిలోంచి ఓ కాగితాల కట్ట తీయడం చూసి ఆగిపోయాడు. మాట్లాడకుండా వాడిచ్చిన కట్ట అందుకుని ఆసక్తితో గబగబా విడదీసి చూసి విసిరికొట్టేశాడు. "ఇది నీకీ ఊరు

వెంకన్న.

గుడ్లప్పగించి చూస్తూ అప్రయత్నంగా తలూపాడు బంగారయ్య.

"వచ్చే నెల మునిసిపాలిటీ ఎలచ్చనులున్నాయి. నాకు ఓటుందో లేదో చూడు. రుజువు కింద పట్టుకొచ్చా"నని అన్నాడు వెంకన్న.

చూసి "నీపేరుంది. అయితే ఏంటిట?" అన్నాడు బంగారయ్య.




రాసిచ్చిన దస్తావేజనుకున్నావా? ఓటర్లలిస్టు పదిలంగా తెచ్చి నా ఎదాన కొట్టావు. అసలు నీ ఉద్దేశం ఏమిట్రా?" అని అరిచాడు.

వెంకన్న కంగారుపడలేదు. రెండడుగులు వెనక్కేసి కిందనున్న కట్ట జాగ్రత్తగా తీసి పట్టుకున్నాడు.

"నా బియ్యంకార్డు పెద్ద పండగలప్పుడు మీకాడెట్టి డబ్బులప్పు తీసికెళ్లినాను. ఆనాటికాడ్నుండి నెలకోసారిచ్చే బియ్యాన్ని తెప్పించి పెచ్చురేటు కమ్ముకుంటున్నారు. అది తప్పనను ఒప్పంటాను. మీరెట్టిం దానికి వడ్డీ రావొద్దా? ఏటంటారు?" అన్నాడు

"ఎలచ్చన్రోజు మీరెయ్యమన్న గుర్తు మీద పొల్లుపోనట్టు ముద్రేస్తాను. ఆ ఏయించుకునేవాడు మీవోడేగదా! ఇప్పుడు మీకు తోచినంత పడెయ్యండి. నా ఓటుని ఎడ్వాన్సు తాకట్టు పెట్టాననుకుని ఆడి దగ్గిర వసూలు చేసుకోండి" అని చెప్పి వెంకన్న దోసిలిపట్టాడు.

"ఎదవలు తెలివిమీరి పోయేరు. ఎక్కడలేని ఆలోచనలు పుట్టగొడుగుల్లా పుట్టుకొచ్చేస్తున్నాయి. సన్నాసెదవలికి" అనబోయి నోర్మూసుకున్నాడు బంగారయ్య.

నిశ్శబ్దంగా అర పచ్చనోటిచ్చాడు ఎడ్వాన్సుగా!

–మాధవరపు కృష్ణ




# పరిమళ ముత్యాలు

★ చితికిపోయిన బ్రతుకు బొమ్మను అతికించుకొనే ఒకానొక అవకాశమే భక్తి

-పరమహంస

★ ప్రబోధకుడివి కావాలా? అయితే దానికి ఒకటేమార్గం. నిన్ను నీవు ఉద్ధరించుకో.

-థామస్

★ ఒక చిన్న నిద్ర జీవితం అయితే మరొకలోకంలో మేల్కొంటాం అదే మృత్యుతత్వం.

-డోన్

★ వీరుడుకంటే శాంతస్వభావుడు శ్రేష్ఠుడు. విజేతకంటే మనో వికారాల్ని జయించిన వాడు ఘనుడు.

-బైబిల్ సూక్తి

★ జీవితమనే విందు తరువాత మృత్యువనే పానీయం సేవించక తప్పదు.

-గేథే

★ నిజాయితీపరుడైన వ్యక్తి తన అంతరాత్మ అంగీకరించని పనిని చేయలేడు.

-మదామ్ డస్టాల్

★ ఈ క్షణం కూడా అనంతకాలంలో ఒక భాగం.

-స్టీవర్టు

★ దీపము చీకటిలో వెలుగుతుంది. నీవు వెలుగులో వెలుగుతావు.

-సత్యసాయిబాబా

★ చెడుపనులకు దూరంగా వుండి ఉత్తముడనిపించుకో.

-రామకృష్ణపరమహంస

★ అతి నిద్ర, అత్యాహారము మనోచాంచల్యానికి, సోమరితనానికి పునాదులు.

-మావో

★ మనిషి పరిపూర్ణత అతని ఆస్తులలోకాదు, అతని స్వభావంలోవుంది.

-ఆస్కార్‌వైల్డ్

★ తన గమ్యమేమిటో కనుగొన్న మనిషికి ప్రపంచం పక్కకు తొలగి దారి ఇస్తుంది.

-ఎడిసన్

★ ప్రేమించడం మంచిదేకానీ ఆ ప్రేమను ఒకరికి కోరకుండానే సమర్పించడం మరీ మంచిది.

-షేక్స్‌పియర్

పి.ఎ. ప్రభాకర్‌దత్తు

# ఏరిన ముత్యాలు

★ చేయదలుచుకున్న మంచిపని వెంటనే చేయగలగాలి. జాప్యంచేస్తే అందులోని మంచి హరించుకుపోవచ్చు

– ఎమర్సన్

★ జిహ్వ మనం చెప్పినమాట వినకపోవడమే అన్ని అనర్థాలకు మూలం.

– సెనెకా

★ తక్కువస్థానంలో ఉన్నవారిపట్ల చూపే తన ప్రవర్తన ద్వారానే ఒక గొప్ప వ్యక్తి తన గొప్పతనాన్ని తెలియచేస్తాడు.

– కార్లైల్

★ ఏమి జరిగినా ఏమీ జరగనట్లే ఎప్పుడూ ప్రవర్తించు.

– ఆర్నాల్డ్ బెన్నెట్

★ మన ముఖ్యావసరాలు పరిమితమే కానీ పెంచుకునేవి అత్యధికం.

– జువాడెరీ

★ ఎప్పుడూ భయపడే వ్యక్తి ఎక్కడా సురక్షితంగా ఉండలేడు.

– మహాత్మాగాంధీ

★ ఉదారబుద్ధితో చేయబడిన పని ఎప్పటికీ నశించదు.

– ఛార్లెస్ డికెన్స్

★ మనం చేసేపనులు మనమాటల కంటే బిగ్గరగా పలుకుతాయి.

– కార్లే

★ నమ్మటం కష్టసాధ్యం, నమ్మకపోవడం అసాధ్యం...

– విక్టర్ హ్యూగో

★ తుపానులో ప్రయాణం చేస్తున్న గాలివిమానంలాంటిది వృద్ధాప్యం. ఎక్కిన తరువాత చేయగలిగింది ఏమీ లేదు....

– గోల్డా మెయిర్

★ దయను పంచడం అన్నది చాలా కష్టతరమైన పని. అయినా ఆ దయ మనకు తిరిగి లభిస్తుంది....

– మహమ్మద్ ప్రవక్త

★ మంచి పట్ల ఆశ, చెడు పట్ల భయం... ఈ రెండే మానవ మేధను ముందుకు తీసుకుపోయే గొప్ప శక్తులు....

– శామ్యూల్ జాన్సన్

★ కఠిన పరిశ్రమ, ఇంగితజ్ఞానం, మిత వ్యయం అన్న మాటల ద్వారానే అదృష్టాన్ని తెలియజేయడం అవుతుంది....

– డ్యూమాన్

సేకరణ: చింతలపూడి జయప్రకాష్ నారాయణ్

# 'అంచుకీ అంచుకీ మధ్య' పై సమీక్షలు

అక్టోబర్ చతురలో ప్రచురితమైన అక్కినపల్లి సుబ్బారావు నవల
'అంచుకీ అంచుకీ మధ్య' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## దూరపు కొండలు

(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

అక్కినపల్లి సుబ్బారావు గారి "అంచుకీ అంచుకీ మధ్య" పాశ్చాత్య దేశాలలో ముఖ్యంగా అమెరికాలో జీవించే భారతీయుల మనోభావాలకు, వారు ఎదుర్కొనే సమస్యలకూ అద్దం పడుతుంది. దేశం కాని దేశంలో అవమానాలు సహిస్తూ, గొడ్డుచాకిరి చేస్తూ వారు సాధిస్తున్నది ఏమిటి? కంప్యూటర్ పట్టా పుచ్చుకోగానే డాలర్ల మోజులో తమ కన్నవారిని, బంధువులనూ, స్నేహితులనూ విడిచి వేల కిలోమీటర్ల దూరంలో దిగి మానసికంగానూ, శారీరకంగానూ బలహీనపడి చివరికి వారు సాధించేది ఏమిటి? అని ప్రశ్నించుకుంటే సమాధానం శూన్యమే. ఎప్పుడు ఊడుతుందో తెలియని ఉద్యోగాలు, కనీసం అనారోగ్యంతో ఉన్నప్పుడైనా సహాయం చెయ్యని ప్రభుత్వం ఒకరకంగా రెండవతరగతి పౌరుల్లా జీవితం మొత్తానికి నిరంతరం డాలర్లకోసం దాస్యం చేయడంలోనే గడుస్తుంది.



గత తరం పెద్దవారిలోనూ ఈ తరం యువకుల్లోనూ వచ్చే మార్పులు చక్కగా వివరించారు. పాత తరానికన్నా, కొత్త తరానికి ఆలోచనల్లోనూ, మానసిక స్థైర్యంలోనూ, నిర్ణయాధికారాలలోనూ ఎక్కువ స్వేచ్ఛ, దుడుకుతనం ఉన్నాయి. పాతతరం వారు డబ్బుకన్నా, భోగభాగ్యాలకన్నా అనుబంధాలు, ఆత్మీయతలే ముఖ్యమని నమ్మి తమకున్నదాంట్లో సొంత మనుషుల మధ్య ప్రశాంతంగా జీవించాలని కోరుకుంటే నేటి

తరంవారు మానసిక సంఘర్షణలకు గురి కావడానికి కారణం కేవలం డబ్బు సంపాదనపై వ్యామోహమే అనడంలో సందేహం లేదు.

గోపాల్ వంటి మిత్రులు కావాలని ప్రతి ఒక్కరూ కోరుకుంటారు. ఈ దేశంలో ఎంతోమంది నారాయణ, రుక్మిణిలాంటి వారున్నారు. వారి కథలు విన్నవారందరి జీవితంలో విషాదముద్ర వేస్తాయి.

రమణయ్య, కవితల పాత్రలు జీవితంలో మనిషికీ మనిషికీ మధ్య ఉండే అవసరాన్ని, అనుబంధాన్ని చాటిచెప్తాయి. పంచుకొనేవారే లేనప్పుడు విషాదమైనా, ఎంతటి సంతోషమైనా అసంపూర్తిగానే ఉండిపోతుంది. అమెరికాలో జరుగుతున్న సంఘటనలను కళ్ళకు కట్టినట్లు చూపించిన రచయిత రచనాశక్తికి, ఎక్కడా ఆగాలనిపించకుండా చదవాలనిపించిన సంభాషణాశైలికి పాఠకులు రుణపడిఉంటారు.

—బి. అరుణా మనోహర్
నవులూరు-522 503

## త్రిశంకుస్వర్గం

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

అమెరికా అంటే అందరికీ అందుబాటులో ఉన్న స్వర్గమని భ్రమించి డాలర్ల మూటలు తెచ్చుకోవచ్చని ఆశించే మధ్యతరగతి మానవుడికి దూరపుకొండల చందాన ఊరించే అమెరికా అసలు స్వరూపాన్ని ఎంతో దగ్గరగా చూపించిన నవల "అంచుకీ అంచుకీ మధ్య".

ఈ కాలంలో యువతరం అంతా అమెరికాకు వలసవెళ్ళిపోతోంది. ఇక్కడ లేనిదేదో అక్కడ పొందాలని, డాలర్ల మూటలు కట్టుకోవాలని, స్వర్గంలాంటి జీవితం పొందాలని శక్తికి మించినదైనా అమెరికాకు ఎగిరిపోతున్నారు. తీరా అక్కడకి వెళ్ళాకా కానీ తెలియదు అది స్వర్గం కాదని త్రిశంకు స్వర్గమని. నారాయణ, రుక్మిణిల బలవన్మరణం అందుకు సాక్ష్యం. గొప్పకోసం తిప్పలు, అసలు చోటుకు తిరిగివస్తే నామర్దా, ఎవరో ఏదో అనుకుంటారనే అనుమానంతో ప్రాణానికి నీళ్లు వదులుకునే నారాయణ, రుక్మిణి కథ మనసును కదిలించివేస్తుంది.

గ్రీన్‌కార్డ్ వచ్చేవరకు భారతీయులు పడే తిప్పలు ఫుట్‌బాల్ కోర్ట్‌లో బంతిలాంటివి. నిలకడలేని ఉద్యోగాలు, స్వంతిల్లు నిలుపుకోవాలంటే పడేపాట్లు అన్నీ కళ్లకు కట్టినట్లు విపులంగా రాశారు అక్కినపల్లి సుబ్బారావుగారు. రమణయ్యతోపాటు అమెరికాలో మనం తిరుగుతున్న అనుభూతి కల్గిస్తుందీ నవల. ఆనాటి తరానికి ప్రతీక రమణయ్య అయితే ఈనాటి తరానికి ప్రతీక ధనరాజ్. ఆనాటివాళ్ళు జీవితం విలువైనదని భావిస్తే ఈనాటివాళ్లు పరిగెత్తే కాలంకంటే ముందు పరుగులెత్తాలని భావిస్తున్నారు.

జీవితాలకు భద్రత లేని జీతాలు, పెళ్ళికి విలువివ్వని పరుగులు. మమతానురాగాలకు, పలకరింపుకు నోచుకోని రమణయ్యకు ఒక ఊరట కవిత. భర్తనుండి పొందలేని వాత్సల్యం కవితకు రమణయ్యలో దొరుకుతుంది. అమెరికాలో ఏదో బావుకోవాలని వెళ్లి తిరిగి ఇండియాకు ఉద్యోగం చూసుకుని వచ్చేసిన రామన్, నటేశన్‌లాంటివారు- ఇండియాలోలాగ సీనియారిటీకి విలువయిస్తారని భావించి బోల్తాపడ్డ అవతారం లాంటివారు- ఎప్పుడంటే అప్పుడు రేట్ పెరిగే షేర్లు తిరిగి విలువ కోల్పోయే విధానం- స్టాక్‌ఎక్స్ఛేంజ్‌ల ఛేజింగులు... వెరశి అమెరికా.

ఈ నవల చదివి అయినా యువతరంలో మార్పువచ్చి డాలర్ల కలలు కనడం మానేస్తే మంచిది.

— డా॥ ఎం.ఎస్. జ్ఞానేశ్వర్
మదనపల్లి-517 325




## కలియని అంచులు

*(మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

చీకటిలో చందమామ తర్వాతి నవలలా ఉంది "అంచుకీ అంచుకీ మధ్య". ఒక అంచు అమెరికా అయితే ఇంకో అంచు ఇండియా. ఈ రెండంచుల మధ్య వ్యవధానంలో వ్యవస్థ ఎలా ఉంటుందో చెప్తోందీ నవల. ఈ రెండు సమాంతరం రేఖలూ ఎప్పుడూ కలియవు. కాని ప్రయాణిస్తూంటే కలుస్తాయన్న భ్రమ తప్పక కల్గుతుంది. అందుకు తార్కాణం ఈ నవల.

యాధృచ్ఛికంగా అనాధశరణాలయంనుంచి తెచ్చి పెంచుకున్న కొడుకు అమెరికన్ కల్చర్‌తో కల్సిపోయి, ఓసారి వివాహం చేసుకుని, విడాకులిచ్చేసి, మళ్ళా పెళ్లి చేసుకుంటున్నానని చెప్పడంలో తన పెంపకంలో ఏదో లోపం ఉందనుకుంటాడు రమణయ్య.

పెంచిన కొడుకు కంటే బాల్యస్నేహితుడే నయం అనుకొని అక్కడ నాలుగునెలలు తల దాచుకుంటాడు.

అతను అమెరికాలో ఉన్నంతకాలం కాస్త ఆర్తీ, తృప్తి ఇచ్చినది కవిత ఒక్కర్తే! వీసా పొడిగింపబడక కొడుకు తిరిగి ఎక్కడ ఇండియాకు గెంటివేయబడ్తాడో అన్న తపనతో పాటు కవిత ఎడబాటు కూడా కలచివేసింది రమణయ్యగార్ని.

అయితే ఇంతగా వివరించిన నవలలో అసలు ఉద్దేశమేమిటో కానరాదు. అమెరికాకు అర్రులు చాచే కుర్రకారులకు కనువిప్పుకా? రమణయ్యగారికీ కవితకీ కల్గిన పరిచయాన్ని ఏమని అన్వయించుకోవాలి? ప్రేమా? స్నేహమా? లేక వృద్ధ బ్రహ్మచారికి ఆఖరుకి ఓ తోడు ఉండడానికనా?

అనేక ఘట్టాలను వర్ణించి, కలియని రెండంచులనూ కలపడానికి చేసిన ప్రయత్నంలో రచయిత సఫలం కాలేదనే చెప్పాలి.

– *వి. లలితాంబ*
సీతంపేట-532 443

## సమకాలీన సమాజ దర్పణం

*(నాల్గవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

మనదేశంలో తయారయ్యే లక్షలాది నిరుద్యోగ మేధావులు భూతల స్వర్గంలా భావించే అమెరికాపై విశ్లేషణ ఈ నవల. విషయాన్ని సమగ్రంగానే చర్చించారు రచయిత. సరియైన సమయంలో అక్కినపల్లి సుబ్బారావుగారి నవల "అంచుకీ అంచుకీ మధ్య" ప్రచురించిన 'చతుర' సంపాదకవర్గం అభినందనీయులు. జీవితమంతా శ్రమించి కూడబెట్టిన ధనంతో తమ పిల్లలను భూతల స్వర్గంగా భావించే అమెరికాకు పంపించాలని చూసే కొంతమంది మధ్యతరగతి తల్లిదండ్రులకైనా ఈ నవల కనువిప్పు కలిగిస్తుంది.

నవలలో ధనరాజ్ తన పెంపుడు తండ్రి రమణయ్యమీద చూపిన మమకారం చక్కగా చిత్రీకరించారు. రమణయ్య కూడా చదువుకున్న సంస్కారంతో కొడుకుమీద ఆధారపడకుండా స్వంతంగా పనులు నిర్వహించుకుని, అమెరికాలో జనజీవన స్రవంతిలో తీరుతెన్నులు విశ్లేషించుకుంటూ గడపటం బాగుంది.

నవల మధ్యలో కవిత, గోపాల్‌ల పాత్రలు ఉదాత్తంగా చిత్రీకరించారు. స్నేహానికి నిర్వచనం గోపాల్ కుటుంబంలోని వ్యక్తులు. భూతల స్వర్గంగా భావింపబడే అమెరికాలో హెచ్‌వన్ వీసా పేర జరిగే మోసాలు, ఏజెంట్లు ఇండియానుంచి తెచ్చే మనుషులకి చేసే మోసాలు, వివరించారు. అమెరికాలో ఇన్సూరెన్సు క్లైంలమీద, వెల్‌ఫేర్ స్కీమ్‌ల మీద, సోషల్ సెక్యూరిటీ చెక్‌లమీద జరిగే మోసాలు తేటతెల్లంగా వివరించారు.

అమెరికాలో కూడా మోసాలు జరుగుతాయి అని రమేష్ ద్వారా కారు కొనుగోలు, మెకా

నిక్ ద్వారా మోసం జరగటం వివరణ బాగుంది. అమెరికాలో మోసం చెప్పి చేస్తారు. జరిగే మోసం అంతా చిన్న ప్రింటులో వుంటుంది అంతే దానిని సామాన్యులు గ్రహించలేరు.

ప్రస్తుత ఆర్థిక సంక్షోభ సమయంలో చతుర ద్వారా చాలా చక్కని నవల అందించారు. మంచి చెడు ప్రపంచమంతటా వుంది. చూసే చూపుని బట్టి దాని స్వభావం మారుతుంది.

ముఖ్యంగా తల్లిదండ్రులు లక్షలు ఖర్చుచేసి తమ పిల్లలను అమెరికా పంపితే చాలు అనే ఆలోచన మానుకుని ఎక్కడైనా అవకాశాన్ని బట్టే ఆధారం అని గ్రహించుకుంటే మంచిది.

*– సుసర్ల లీలావతి*

కా(ప్రా-500 062

## అటు అమెరికా ఇటు ఇండియా

*(ఐదవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

**అ**క్కినపల్లి సుబ్బారావుగారి నవల "అంచుకీ అంచుకీ మధ్య" సన్నటి కనుపించని ఖాళీ ఉందేమో అనుకుంటే అది అంతులేని అగాధంలా అనిపించింది. ఈ రోజుల్లో ఇంటికొక్కరైనా భారతీయులు అమెరికాలో వున్నారంటే అతిశయోక్తి కాదేమో! ఇది ఒక ఫ్యాషన్ అయిపోయింది. పూర్వపు రోజుల్లో మనదేశంలో బతకలేక విదేశాలకి వెళ్ళేవారు. లేనా ఉన్నత విద్యకు. కానీ అది ఇప్పుడు తారుమారై మనదేశంలో ఉద్యోగాలు ఉన్నా కూడా విదేశాలకు యువత ఎగబడుతున్నారు. ఈ మోజు ఎంతమంది యువతని ఆశనిరాశల మధ్య ఊగిసలాడిస్తున్నదో. చదువే ఒక వ్యాపారం అయిన ఈ రోజుల్లో కంప్యూటర్స్ పుణ్యమా అని ఉద్యోగాలు కూడా గాంబ్లింగ్ అయిపోయాయి. ఎంతో ఖర్చు పెట్టి కంప్యూటర్ కోర్సులు చేసి, ఉన్న ఆస్తుల్ని అమ్మి లోహవిహంగాల్ని ఎక్కి ఆకాశవీధిలో ఎగిరి వెళ్ళేవాళ్ళకు అక్కడ కూడా అనిశ్చిత పరిస్థితులు ఎదురు అవుతున్నాయి. 'మంది ఎక్కువైతే మజ్జిగ పలచన' అన్నట్లు అక్కడ సరైన మార్కెట్ లేక, ఉద్యోగాలు రాక, ఉన్న ఉద్యోగం ఎప్పుడు పోతుందో తెలియక, ఏజెంట్ల బారినపడి దేశంకాని దేశంలో జీవన్మరణ సమస్యని ఎదుర్కొంటున్నారు. ఎందుకీ తాపత్రయం అంతా? ఈ తెచ్చిపెట్టుకున్న కష్టాలకి కారణం ఎవరు? సరైన ఉద్యోగావకాశాలు కల్పించలేని మన ప్రభుత్వమా? లేక పరుగెత్తి పాలు తాగాలనే యువత అత్యాశా?

ఏదిఏమైనా మనదేశంలో మన వాళ్ళ మధ్యన ఉన్న భద్రత, నిశ్చింత పరాయిదేశంలో ఉండదు. అయినా యువత అక్కడ సెకెండ్ సిటిజన్స్‌గా వుండటానికైనా ఇష్టపడుతున్నారు. ఎంతసేపూ డాలర్ల డాబు, స్టేటస్ కావాలి. ఈ పరిస్థితి మారేదెన్నడో. బహుశా కాలమే సమాధానం చెప్పాలి.

నిరాడంబరజీవి, ఆశయవాది అయిన రమణయ్య అంతరంగమథనం నవలకి ఊపిరినిచ్చింది. తరాల అంతరాలు, నిత్యజీవితంలో తన పెంపుడుకొడుకైన ధనరాజ్ ఆలోచనల్లో మార్పు గ్రహించి కూడా ఏమీ చేయలేని నిస్సహాయుడు ఆయన. ఆ యాంత్రిక జీవనంలో తను కూడా ఒక యంత్రమై మనిషి మనుగడ సాగిస్తుంటే చూడలేని రమణయ్య ఆవేదన ఆలోచింపచేసేట్లుగా వుంది. అటు అమెరికా- ఇటు ఇండియా రెండూ నిజంగా తూర్పు-పడమరలే.

*–యన్. ఇందిర*

సికింద్రాబాద్-500 003

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060. Cuddapah: 70011; Tadepalligudem: 28881; Warangal: 59933.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd. No. H/HD/965- RN1/32186/78